ఓం

శ్రీ నాగేశ్వర గ్రంథమాల. ప్రథమ పుష్పము

# విద్యుల్లతా సుదర్శనీయము.

## [ The Last-Days of Pompii ]

గ్రంథకర్త:

పండిత దంతనాల నాగేశ్వరశాస్త్రి.

ప్రకటనకర్త:

వీరమల్లు చంద్రశేఖరశర్మ.

తెనాలి

రజత ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

 [వెల 0—14—0

# పీ ఠి క

—...—

నేనీగ్రంథమునకుఁ బూర్వము నాలుగు వత్సరముల క్రిందట
నొక పద్యకావ్యమును గద్యకావ్యమును గొంతవరకు వ్రాసి కొన్ని యంత
రాయములవలన నాగ్రంథములను బూర్తిఁ జేయలేక పోవుటయేఁ గాక
రెండు వత్సరములనుండి బొత్తుగ కవిత్వాభ్యాసముగూడ వృద్ధినొందిం
చుట కవకాశము లేకపోయెనని మనంబున మాత్రము మిక్కిలి పరి
తపించుచుండి తత్కార్యసాఫల్యమును గనలేకపోయితిని. ఒకనాటి
సాయంతనమందు మన్మిత్రరత్నంబగు బ్రహ్మశ్రీ పాతకమూరి కోటయ్య
గారు "సినిమా కంపెనీ" చూచుటకు బయలుదేఱి నన్నుఁగూడఁ
దోడ్కొని వెళ్లి తత్ప్రదర్శనానంతర మీనాటకము నన్ను తప్పక వ్రాయ
వలసినదని యతి శ్రద్ధతోఁ బ్రోత్సాహ మొనరించియుండిరి. తద్వచనా
చాతుర్యమునందు భయముగలవాడనై నప్పటికి నొకింత ధైర్యమూని
వ్రాయుట కారంభించితిని. ఇయ్యది యాంగ్లేయ చారిత్రాత్మకమై
యుండుటఁబట్టి నాకప్పటప్పటికిఁ గొన్ని సందియములు పొడమినను
బ్రయత్నమును మాత్రము విడువక యుంటిని. ఆసమయమునందు దైవి
కముగ, నాటకసరస్వతి, పండిత, శతాధిక, గ్రంథకర్త, ఇత్యాది బిరు
దాంకితులును మన్మిత్రులును నగు మ.రా.శ్రీ. ద్రోణంరాజు శీతారామా
రావుగారు మద్గృహసమీప గృహమందుఁ గొంతకాలము వసించి
యుండుట తటస్థించినది. అప్పటికీనాటకము రెండంకములను వ్రాసి
వారికొక్కనాడీ విషయమునంతయుఁ జెప్ప, నారచనా విధానమునకుం
గావలసిన సాయమొనరింపఁ బదునైదు దినంబులలో దీనిం బూ రిగా
వించితిని. గాన వారికినే కృతజ్ఞుఁడను. తరువాత మద్గురువరేణ్యులును,
విద్యాశేఖర, కవిశేఖర, పండితేత్యాది బిరుదాంకితులును ననేక గ్రంథ
కర్తలును నగు బ్రహ్మశ్రీ వడ్డెపాటి నిరంజనశాస్త్రిగారి దృష్టిపథము

నందీ నాటకకన్యను నిలువఁబెట్టితిని. వారీ నాటకకన్యను వీక్షణమాలి కలచేనలంకరించి పవిత్రమొనరించి నందులకు నేవారికి సర్వదా వంద నము లాచరించువాఁడ.

అంత ముద్రణార్థము ప్రయత్నముసేయనారంభించి నామిత్రులఁ గొందఱిని జూచుతరి శ్రీమద్వీరమల్లు వంశపయః పారావారరాకా సుధాకరుఁడగు, చంద్రశేఖర శర్మగారు. మత్ప్రయత్నమునకుఁ బూర్ణ ముగదోడ్పడి, నాగ్రంథమూలను, నిర్విఘ్నముగ నెరవేర్చుటకు. శపథ మొనరించిరి. అంతట నాసంతోషమునకు మేరలేక, యీచిన్నిపొత్తము నాంధ్రభాషామతల్లికి ప్రథమపుష్పముగ నమర్పించుకొంటిని. విద్యామ నీషులు, దోసంబుల మన్నింతురు గాక ! ఇట్లు,

గ్రంథకర్త.

# తప్పొప్పుల పట్టిక.

| తప్పు. | పుట. | పంక్తి. | ఒప్పు. |
|---|---|---|---|
| స్నేహితము | 2 | 25 | స్నేహము |
| నిర్మిత | 3 | 13 | దీపిత |
| యెం | 9 | 12 | ఎం |
| యెం | 9 | 14 | ఎం |
| క్షిర | 12 | 11 | కీర |
| దునబద్ధమాడ | 25 | 14 | దనృతంబునాడ |
| తేనయె | 30 | 8 | తేనియ |

ఇంకఁ దీనియం దక్కడక్కడగల యచ్చు తప్పులను చదు వరులు గమనించి చదువుకొన వలయును.

శ్రీ

# నాగేశ్వర గ్రంథమాల

—...—

ఏతద్గ్రంథమాలయందు ప్రతిమానపునకు నిత్యావశ్యక ములగు శిల్పములు, వాస్తు, జ్యోతిషము, వేదాంతశాస్త్రము, ధర్మశాస్త్రములు, ఆయుర్వేదము, మంత్రశాస్త్రము, యోగశాస్త్రము, భాషాభివృద్ధిదాయకములు, నీతిదాయకములు, రసవత్తరములు, నునగు, నవలలు, నాటకములు, చారిత్రలు నింక నితరభాషలయందుండెన్నియో యుపయోగ గ్రంథములను మృదుమధుర శైలిని దెనిఁగించి మంచి కాగితములతో సుబోధముగ రెండుమాసముల కొకపొత్తము ముద్రించఁబడును. గాన దేశాభిమానులు మాగ్రంథమాల నత్యంతాదరమునఁ బోషింపఁజందా దారులుగఁజేరి యభివృద్ధిఁజేసి లోకమునకు దివ్యతేజ మొసంగెద రని ప్రార్థించుచున్నాడ.

ఇట్లు,

వి. చంద్రశేఖరశర్మ,
ప్రాప్రయిటరు.

శ్రీనాగేశ్వర గ్రంథమాలా
కార్యస్థానము,
కొత్తపేట, తెనాలి.

బ్రాంచి—పొన్నూరు.

—

# ఇందువచ్చు పాత్రలు

## పురుషులు.

1 సుదర్శనుఁడు—కథానాయకుఁడు.

2 మధుసూదనుఁడు, } కథానాయకుని మిత్రులు.
3 ధర్మపాలుఁడు, }

4 రంగిసెట్టి—వర్తకుఁడు.

5 పూర్ణానందుఁడు—గురువు.

6 ముకుందుఁడు—శిష్యుఁడు.

7 రాముఁడు, }
8 రంగఁడు, } మందుల వాండ్లు.
9 పెరుమాళ్లు, }

## లు.

1 విద్యుల్లత-కథానాయకి.

2 సుందరి-చెలికత్తె.

3 మందారమాల.

4 మదనరంజని.

5 వర్తకుని భార్య, బిడ్డ.

6 లక్ష్మి-మందులవాని భార్య.

శ్రీ

# విద్యుల్లతా, సుదర్శనీయము

—:0:—

ఉ॥ శ్రీకరుఁడవ్యయుండు సుర ♦ సేవితపాద సరోజభాసుఁడ
స్తోకమనీష లోకముల ♦ శోభిలఁజేసెడు దివ్యదేహ సు
శ్లోకుఁడు మాధవుండెవుడు ♦ శుంభదలంకరణాభిరామ భా
గ్యాకరులయ్యు సభ్యులిల ♦ నందముఁజెందఁగఁ బ్రోచుఁగావుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు)

సూత్ర—(ప్రవేశించి) ఓహో! సభ్యులు నాకొఱకుఁ బ్రేమాస్పద వీక్షణంబుల నిరీక్షించుచున్నారు. మత్కాలహరణంబు వీరికి శ్రమఁగలుగఁ జేయుచున్నదిగదా? ఇఁకనైనఁ దొందఁరగలిఁగి పరివర్తింపవలయును. (పరిక్రంజూచి) పారిపార్శ్వకా! నీవొకసారి యిటురమ్ము.

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) ఆర్యా! నన్నుఁబిలచిన కారణమేమి?

సూత్ర—కారణమేమని యడుగుచుంటివా? కాలోచిత ధర్మగ్రహణ మేధాసంపన్నత్వము నీకనుమాత్రమైనను లేదనితోచుచున్నది. ఈనాటకశాలం గాంచుము. ఎందఱు సదయహృదయులగు, సభ్యులచే నలంకరింపఁబడినదో, వీరందఱేటికరుదెంచుటకుఁ గారణమేమని యూహించెదవు!

పారి—గ్రహించితి. గ్రహించితి. నాట్యప్రదర్శన సందర్శన కౌతూహలాయత్తచిత్తులై విచ్చేసియున్నవారేకదా?

సూ—ఇఁకనేమి! సర్వవిషయములు దెలిసియు నీకప్పుడప్పుడు పొరబాటు సంభవించును గాబోలు.

పా—ఇప్పుడు మనకుఁ బ్రదర్శనాయుత్తమగు నాటకరాజమెద్ది?

సూ—ఆహా! నాటకరాజమెద్దియని యడుగుచుంటివే? ఎఱుఁగవా? విద్యుల్లతా సుదర్శనీయము.

పా—(ఆలోచన నభినయించి) విద్యుల్లతాసుదర్శనీయమా? అనఁగా
సూ—ఇదియాంగ్లేయ చారిత్రాత్మకమగు రసవత్తరమైన యొక కథ.
పా—అట్లనా? ఇక్కాలంబునఁ బౌరాణకథలను వినుటకును, గను టకును, విసువెత్తియున్న నీసభ్యుల హృదయానందజనకమగుట కేమియును, సందియములేదు. నవీనధర్మంబులం దెలియవలెనన్న జరిత్రాత్మకములే ముఖ్యములు. ఆగా! అదియాంధ్రుల కెట్లు ప్రదర్శనార్హము.
సూ—అస్తే మేలకాదు? దానినాంధ్రభాషయందు కడుమృదుమధురం బుగ రచించి, విద్యుక్తనిత్యకర్మానుష్ఠాతయు శిల్పకళానిష్ణా తయు ధర్మమార్గాన్వేషియునగు నాతనిజనకునకు నిశ్చలభక్తి రసప్రపూరితమానస సరోవరుండై, కృతిసమర్పణంబుఁగావించె.
పా—(కొంచెమాఁగి) నారెవరు.
సూ—మఱచితివా?

మ॥ చిరభక్తిప్రతిభావిశేష మతియై ♦ శ్రీకంఠు సేవించు నా
పరమాహ్లాదుఁడు దంతనాలకుల స ♦ త్స్వాధోధిపూర్ణిక్షపా
కరలింగార్య సుధీసుతున్సుకవిలో ♦ క స్తుత్యపాండిత్యధీ
వరనాగేశ్వర శాస్త్రినిం దెలియవో ♦ వాగ్వైభవశ్శారదన్.

పారి—ఓహో! అక్కవిక్రృతనాటక ప్రదర్శనంబున లోకంబునకు విజ్ఞానచంద్రిక, కరతలామలకంబు. శీఘ్రంబునం బ్రదర్శన కుపక్రమింతము.
సూ—నీసందేహ మంతయుఁ దీఱెనుగదా?
పారి—నిశ్చయముగ నది విద్యుల్లతా సుదర్శనీయ మగుటచే నాకా కొంతంతావంత యైనను లేదు.
సూ—అట్లైనరమ్ము. సుదర్శన మధుసూదనులు వచ్చుచున్నారు. మన ముబోయి తక్కినపాత్రలను సిద్ధపఱచుదము. (నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

---

శ్రీ ర స్తు.

# సుదర్శనీయము.

## ప్రథమాంకము.

—(౦)—

రంగము—పురసౌధము.

[ సుదర్శనుఁడు, మధుసూదనుఁడు ప్రవేశము ]

సుద—మిత్రమా! పత్రికా పఠనము మనుష్యునకెంతటి జ్ఞానాభివృద్ధి దాయకమో తిలకించితివా? మనదేశ స్థితిగతులన్నియు దీని యందు వ్రాయఁబడియున్నవి. స్వదేశౌన్నత్య రమాదేవి కృశించి, యితర రాష్ట్రాధినాయకుల కరకమలములఁ దాండవ మాడుచుండె. అందుచే దేశీయమహాజనులు చింతాకుల చిత్తులై వర్తించుచుండిరి. మనసాటి సామ్రాజ్య నాయకులే యీ తీరున నన్యదేశావాసము జేయుచుండఁ దదితర విషయ మవిచారణీయము. అన్యరాష్ట్రీయ ధర్మము లెంతటి దుస్సహ బాధ్యములు! స్వదేశ సౌభాగ్యమును దలంచినపుడెల్ల, నా మనంబు దల్లడిల్లుచుండును.

మధు—సుదర్శనా! నిజమే; కాని గతజలసేతుబంధనంబునఁ బ్రయోజనంబేమియున్నది? సుఖదుఃఖంబులు భగవదధీనంబులు. కాల చక్రం బెప్పుడును బరిభ్రమించుచునేయుండును. ఇంతమాత్రమునకే వగచుట మనీషావంతులకు హాస్యాస్పదము. (ఇంచుక యూరకుండి) ప్రియమిత్రుండగు ధర్మపాలుం డదేవచ్చుచున్నాడు.

(ధర్మపాలుఁడు ప్రవేశించును)

ధర— ఆహా! ఈ పురసౌధ శృంగారము వర్ణనీయమై యున్నది. సుదర్శనుఁడు తన తండ్రియగు సురేంద్రనాథుని జ్ఞాపకార్థమీ భవన నిర్మాణంబుగావించె. అతని పితృభక్తి యమేయమైనదికదా?

సీ॥ అనయంబు లసదుప ♦ న్యాసంబులను జెప్పు
బుధజనవితతికిఁ ♦ బుట్టినిల్లు
కవితారసజ్ఞులు ♦ గల్పించు వరనీతి
నాట్యాభినయ సుగు ♦ ణములదీవి
బరమేష్ఠిసృష్టికిఁ ♦ బ్రతినగా దీపించు
శిల్పచిత్రములకుఁ ♦ గల్పతరువు
ప్రజలెల్ల గుమిఁగూడి ♦ ప్రాపంచ ధర్మముల్
విచ్చలవిడిఁబల్క ♦ రచ్చపట్టు
గీ॥ విధుశిలా నిర్మితములైన ♦ వేదికలును
రత్నదీపిత గోపుర ♦ రాజములును
నవనవా శోకవృతు వై ♦ భవము గలిగి
వెలుఁగు భవనంబు సద్య శో ♦ ఫలముగాచె.

సుద—మిత్రమా! వచ్చితివా! ఇటఁగూరుచుండి పత్తనమందలి నూతన విషయంబులేమైన నెఱింగింపుము!

ధర్మ—మఱేమియును లేవు. సుగుణవిరాజితయగు భవద్యశః కన్యకామణి స్వదేశముననేగాక యన్యదేశీయ హృదయ సరోవర క్రీడాయత్త చిత్తవృత్తిచే, మిగుల నానంద జనకస్థానస్థాయినిఁ గల్పించుచున్నదని, యంతఃపుర కాంతారత్నస్తోత్ర గీతికాగానంబు మదీయ శ్రోత్రపేయమై యలరారుచున్నయది.

సుద—ధర్మపాలా! మనమిద్దఱము, నొక దేశీయులమగుటచేతను, బాల్యస్నేహితమునుబట్టియుఁ, బూర్వము నాయందుంచుగౌరవ

భావమే, నీకిక్కడ స్ఫురించి, యట్లు బల్కుచుంటివి, కాని, వేఱుకాదు. అన్యదేశీయస్తుతులఁ బడయు టెంతటి దుర్భర కార్యము! అది యటుండనిమ్ము. ఈ దినంబున సర్వవిద్యా దాయినియగు, వాణీ సందర్శనంబునకు నామనంబు కుతూహాల పడుచున్నయది. మువ్వురముంగలసి, తద్దేవ్యాలయంబున కరుఁగుదము. రండు.

(నిష్క్రమింతురు)

[ తెర లేచును ]

వాణీ, ఆలయము

( సుదర్శన, మధుసూదన, ధర్మపాలురు ప్రవేశము )

సుద—మిత్రులారా ఏమీ?

సీ॥ గాంగేయనిర్మిత ♦ ఘనరత్న గోపుర
ప్రాకార నిర్మిత ♦ ప్రాంగణంబు
ద్వారపార్శ్వోజ్జ్వల ♦ హీరహారభ్రాజ
దుత్తుంగ గంధర్వ ♦ యువతియుగము
అసమానసౌందర్య ♦ లసదాస్య విస్ఫుర
ద్భక్తి తత్పోపేత ♦ భక్తగణము
దైవభక్త్యాసక్త ♦ ధర్మప్రబోధిత
చిత్రవిగ్రహసంఘ ♦ చిహ్నితంబు
గీ॥ అహరహారాధ నోచితా ♦ హ్లాదజన్య
భూరిసంఫుల్ల సౌగంధ ♦ పుష్పభూజ
చయ సమాక్రాంత రాజిత ♦ స్థలముగలిఁగి
యలరుచున్నది కంటిరే ♦ యాలయంబు.

మిత్రులారా! ఇద్దేవీ భవన నిర్మాణ విధానం బతివిచిత్రంబు?

మ॥ ధరలో మానససృష్టిఁజూపి జనులన్ ♦ ధన్యాత్ములన్జేయ నీ
వరుస న్జిత్రవిచిత్ర శిల్పసుకళా ♦ ప్రాగల్భ్యవిస్తారుఁడై

పరమాత్ముండగు విశ్వకర్మ సృజియిం ♦ పన్నగా లేదేని యీ
స్థిరసౌభాగ్య విశేషభాస సుషమా ♦ శీలంబు ప్రాప్తించునే.

మను—అమందానంద కందళితంబై, రచనాచాతుర్య మగోచరంబై, ప్రత్యక్ష దేవతారూప నిధానంబై, యలరారు నీ శిల్పవిద్యా వైశద్య ప్రదర్శనంబు సేయ, మఱియొకండు సమర్థుండగునా ?

ధర్మ—(యెదుటఁజూచి) మిత్రమా! సుదర్శనా! విద్యుల్లతాద్యుతి ప్రభాసమానయగు నా స్త్రీరూప దేవతావిగ్రహమిటు వచ్చుచున్నట్లున్న దేమి ?

సుద—ధర్మపాలా! విగ్రహభ్రాంతిబొందితివిగాని, యీమె రాజవంశ సంజాతయగు యువతీరత్నంబుగాఁ దోఁచుచున్నది. ఆమె కర కమల పుష్పమాలాలంకృతయై యిటే వచ్చుచున్నది.

(విద్యుల్లతాదేవి ప్రవేశించును)

విద్యు—(తనలో) వీరెవ్వరో? దివ్యతేజోవికాస వదనారవిందంబుల మందహాసంబు దొలుకాడుచున్నయది! దేవీదర్శనార్థ మిటు వచ్చినట్లు దోఁచుచున్నయది! ఇమ్ముల్లవ్వారియం దమ్మాధ్యపురుష సందర్శనం బయస్కాంతవిధి. నామనంబు నాకర్షించినది. ఇప్పుడ్వారంబును దేవీసాక్షిగ నాతని సమీపద్వారముకడ నుంచి, తదీయ రూపలావణ్యం బపాంగవీక్షణంబున దర్శించుచు నిష్క్రమించెద.

(నిష్క్రమించును)

సుద—(తనలో) ఇవ్వనితారత్న ముఖవిలాసం బవర్ణనీయముగఁ దోఁచుచుండె. మానవకాంతయా ? అయోనిసంభూతరాలగు నప్సరసయా ? నా దేహము బులకింపఁజేయ వీక్షణంబులఁ దిలకించి, చిత్తం బన్యాయత్తంబుగానీయక తద్రూపధ్యాన దాస్యంబుఁజేయుమని జెప్పిపోవుచున్నట్లు గన్పట్టుచున్నది. కానిమ్ము. అదృష్టవంతులఁ జెలచువారెవరు ?

మధు—సుదర్శనా! మనముగాంచవలసిన ప్రదేశంబులు జాలఁగలవు. గాన శీఘ్రంబునఁ బోవుదము.

సుద—విద్యారాణియగు నవ్వాణీమహాదేవిని ధ్యానించి యేగుట సర్వశ్రేయస్కరంబు.

మధు—అట్లేకానిమ్ము.

సుద—(ముందుకు నడచి దేవీవిగ్రహమును జూచి)

మ॥ అనవద్యంబగు సర్వవిద్యల నకుం ♦ తాత్మప్రభాశక్తిచే
ననయంబున్జగదుత్సవం బలరఁగా ♦ నర్థివ్రజస్తోత్రవై
జనహృద్యత్వకళా సమృద్ధులిడుభా ♦ షాదేవి నిన్నెప్పుడున్
వినయాన్వీతమనీషఁ గొల్తుము మముక్ ♦ వీక్షించి రక్షింపుమా!

మ॥ మముఁబ్రోదోచి పరార్థసాధనకునుం ♦ బ్రాల్మాలి దీపించు నా
విమలోత్తీర్ణకళా విరాజమగు స ♦ ద్విద్యా విశేషంబు శీ
ఘ్రముగా మాకు నొసంగి పూర్వవిభవ ♦ ప్రత్యక్షులన్జేసి యో
సుమనస్తోత్రి పదారవింద యుగళా ♦ శోభిల్లఁ బాలింపుమీ.

ధర్మ—(తనలో) నేనుమాత్ర మీ శిల్ప విద్యామతల్లింగూర్చియే ధ్యానించెద.

సీ॥ జగమెల్ల నేదేవి ♦ యగణితద్యుతులచే
ననయంబు జీవించు ♦ ఘనముసెంద
నేదేవి కరుణచే ♦ నెలమి లోకంబెల్ల
నవనవ రసభావ ♦ మవఘళించు
నేదేవి రూపంబు ♦ నిలమీద ముక్తికి
మార్గదర్శకమునై ♦ మమతఁజెందు
నేదేవి వెనువెంట ♦ శ్రీదేవి చరియించు
నిమసంబు వీడని ♦ నీడవోలె

గీ॥ ధాత చాతుర్యసృష్టికిఁ ♦ దళుకునొసఁగు
మెరుఁగుఁ జేకూర్చి మోహంబు ♦ మీరఁజేసి
యలరు మహితాత్మ శిల్ప వి ♦ ద్యామతల్లి
కనుదినంబును బ్రొమొక్కెద ♦ ననఘ మతిని.

మధు—ఆర్యా! ఉపవన విహారంబునకుఁ గాలంబు సంకుచితంబుగఁ గన్పట్టెడు. శీఘ్రగమనంబు ముఖ్యంబని తోఁచెడిని.

సుద—నిజము. ఈ సమయంబున మందాకినీ తటప్రాంతంబున కరుఁగుట మంచిది. ఈ సూర్యవీథిం గొంత దూరంబేగి యుత్తరాభిముఖులమైతిమేని, యానదీలలామ సాన్నిధ్యంబు సత్వరంబున లభింపఁగలదు.

మధు—అట్లే యేగుదము. రండు.

సుద—(కొంచెమునడిచి ఆశ్చర్యముతో) మిత్రులారా! అటువినుఁడు ఆర్తనినాదం బొకటి వినఁబడుచుండె.

ధర్మ—మనకానినాదంబు లవిచారణీయంబులు.

సుద—సఖా! మధుసూదనా! వింటివా? అతని వాక్యము, కర్ణకఠోరంబుగఁ దోఁచుచుండె. అయ్యది దిక్కులేని యొక్కయబలా విలాపముగా, దక్షిణానిలుఁడు మత్కర్ణంబునఁ బ్రవేశపెట్ట నాహృదయంబు వికలత్వంబునొంది నన్ను వనవిహారవిముఖుం జేయుచుండె. గాన సత్వరంబుగ బోయి యానాతి కష్టంబు లీడేర్పవలయును. వేగరండు.

ధర్మ—(తనలో) ఈతనివెంట బయలుదేరినప్పుడెల్ల నిట్టివే సంభవించును. కాని, యీతఁడు దిగంతయశోవిరాజితంబగు క్షత్రియవంశ సంజాతుఁడగుటచేఁగాదా? ఇట్టి సుపథమందు వర్తించుట. నిశ్చయముగా నితఁడు సుదర్శనుఁడే.

సుద—సఖా! ధర్మపాలా! ఇటువినుము.

చ॥ సురుచిర ధర్మతత్త్వమిల ♦ సూరి జనాదరణంబునై సదా
వరలెడు నంచు దీనజన ♦ పాలన, ముఖ్యమటంచు నెంచుమో
సరసుఁడ దుఃఖితాత్ముఁడయి ♦ చాలగ నేడ్చెడు తన్విగాంచి, యా
దరమునఁ బ్రోవ ధీరులకు ♦ ధర్మమునై విలసిల్లు ధారుణిన్.
(నిష్క్రమింతురు)

రంగము. [గృహములో ప్రవేశము రంగిసెట్టి, భార్య, బిడ్డ మందారమాల.]

మందా—(తనలో) ఆహా! ఏమి నాదురదృష్టము. నాలుగైదు దినములనుండియు నా వర్తకంబు నిరర్థకంబగుచున్నది. నేనేమి పాపము జేసితినో. దైవము నన్నిట్టి కష్టములపాలు జేయుచుండె. ఏది యెట్లున్నను అంకురాలనగుటయు, బంధుసమూహంబు లేకపోవుటయు, నీతనిచేఁజిక్కి పడరాని యిడుములఁ బడవలసి వచ్చినది. ఉత్కృష్టవంశ సంజాతనై యుండియు, సాటిలేని భాగ్యంబుచేఁ దులఁదూఁగుచుండు, నావంటిదానికి నేటికిట్టి కడఁగండ్లు సంప్రాప్తించె. హా! దైవమా! స్వదేశ వాసంబుఁ బరిమార్చియు నన్యదేశంబుల పాలొనరించి నావంటి నిర్భాగ్యురాలిని, యిట్టి కఠినున కొప్పగించి, హింసింపఁజేయుట, న్యాయమా? (ఇంచుక యూరకుండి) దైవమును దూరనేల? నాపురాకృత ప్రారబ్ధమిట్లున్నది. ఈ దినము వైశ్యుఁడు తప్పక నన్ను దండించును. మచ్చునకైన నొక్కపూసరంబు విక్రయింపనైతిని. నాపొట్టకైనను సంపాదించుకొనలేదు. నేఁడు నాకతఁడు భోజనంబొసంగుట యబద్ధము.

రంగి—మందారమాలా! మందారమాలా! (అని బిగ్గఱగాఁ బిలుచును)

మందా—(తనలో) నాపుట్టి మునింగినది. (ప్రకాశముగా) అయ్యా! వచ్చితిని.

రంగి—ఈ దినం బెన్ని పూసరంబు లమ్మియుంటివి? మాట్లాడవేమి?

మందా—(చేతులు నలుపుకొనుచు) అయ్యా! యీ దినంబేమియు నమ్మలేదు.

రంగి—అమ్మలేదూ? అమ్మలేదూ? ఓసీ దుర్మార్గురాలా! ఇంత మొండితనముగ మాట్లాడుచుంటివే? ఛీ! ఛీ! నాయింట నుండి లేచిపొమ్ము. దినమును నీకన్నమెట్లువచ్చును. నన్ను మోసము జేయుచుంటివా? ఎక్కడనో మాటలతోఁ గాలము గడుపుచు, విక్రయింపలేదని చెప్పుచుంటివా? ఛీ! ఛీ! పో! పో! గ్రుడ్డిముండా! (అని కట్టెతోఁ బాదును)

భార్య—తన్నుడు, తిన్నుడు. ఏడ్చుచున్నది. నేనీముండకొఱకు మహా శ్రమ పడుచుంటిని. గ్రుడ్డిదైనను అందమునకుఁ దక్కువలేదు. తలదువ్వక బయటకు బయలుదేరదు. ఈ రోజుననేకాదు నాలుగు దినములనుండి యొక్క దమ్మిడీయైనను దెచ్చుటలేదు సుమా? (అని గ్రుద్దును)

మందా—(ఏడ్చును) అయ్యో! నేనేమిచేయుదానను. నిజముగా మోసముచేయుటలేదు. (అని యేడ్చును) మీరే నా తలి దండ్రులని నమ్మి మీ యింటియందు కాలము గడుపుచుంటిని. ఇంక నాకు దిక్కెవ్వరు.

రంగి—ఛీ! ఛీ! ఈ దినము మాయింటియందింత గంజియైనను బోయునదిలేదు. ఓసీ! యీవేళ దీనికిఁ దిండిపెట్టవద్దు.

మందా—(ఏడ్పు నభినయించి) రేపటినుండియు నట్లే చేయుదురుగాక నా దురదృష్టము. ఏమిచేయఁగలదానను. నాకర్మమిట్లుండె.

తప్పక కేవటినుండి, యమ్మి పొమ్ము వెల్లించెదను. దిక్కులేని యీ యంధురాలిని బోషించుట నిహపరంబుల రెంటను మీకు సౌఖ్యంబు జేకూరును. వర్తకశిఖామణీ! ఈ దీను రాలిని గన్నబిడ్డగఁ గారవింపుము.

రంగి—ఓసీ! నీవునాకుఁ గన్నబిడ్డవా? కన్నబిడ్డవా? నావంశమున నీవంటి గ్రుడ్డిముండ పుట్టవలయునా? (అనికొట్టును)

[ సుద, మధు, ధర్మపాలుర ప్రవేశము ]

సుద—ఎవరీ గృహమందు, తలుపు తెరువుఁడు.

రం—బిడ్డా! తలుపుఁదీయుము. ఎవరోపిల్చుచున్నారు.

బి—(తలుపుదీయును) నాన్నా! తలుపుదీసితిని.

(సుదర్శనాదులు ముందునకు వత్తురు)

సు—యెవరువారు.

రం—(భయముతో) పుష్పవర్తకులము.

సు—యెందునకామెను గొట్టుచుంటివి?

రం—నాలుగుదినములనుంచియు పూవులమ్మ్మటలేదు.

సు—నీకేమగును?

రం—ఏమియునుకాదు. పరిచారిక.

సుంద—అయ్యో! ఆగ్రుడ్డిబిడ్డనట్లుకొట్టుట న్యాయమా?

మందా—అయ్యా! ధర్మాత్ములారా! పూవులేమియు నమ్ముటలేదు, వీధియందుఁ బుష్పవ్యాపారు లెక్కుడుగా నుండుటచే నావద్ద నేమియు విక్రయింపబడుటలేదు.

సు—వర్తకుడా! పాపమామె నేమిచేయుమనెదవు? అట్లుకొట్టుట నీకుఁదగదు. జ్ఞానహీనుఁడవు. అంధురాలనియైన నీకు దయ

# సుదర్శనీయము



## ద్వితీయాంకము

రంగము — [ఉద్యానవనము విద్యుల్లతాదేవి ప్రవేశము]

విద్యు॥— ఆహా? ఏమి ఈయుద్యానవన శోభావిశేషము.

సీ॥ మల్లికాకుసుమాది ♦ మంజరీపరిమళో
        జ్జ్వలసమీరార్భక ♦ వాసితంబు
కుసుమాళి మాధుర్య ♦ రసపానమత్త ష
        ట్పదబృంద ఝుంకార ♦ భాసురంబు
పల్లవావళిభుక్త ♦ పారవశ్యోత్పన్న
        పరభృత సంగీత ♦ భాసురంబు
చూతకైతకభూజ ♦ శోభితారుణబీజ
        మాధవీభుజలతా ♦ మండితంబు

గీ॥ శారికాకీరకూజిత ♦ సంకులంబు
    రాజహంసాంగనా సంఘ ♦ రాజితంబు
    కష్టమానసజీవ సౌ ♦ ఖ్యప్రదంబు
    వనరమాదేవివాసంత ♦ వైభవంబు.

నేడీవనవిహారంబన్న నెంతయో దుర్భరంబుగఁ దోచుచుండె. చిత్తంబు తత్తరంబొందుచుండె. (అటునిటుఁజూచి) ఈస్ఫటిక శిలావేదికయందించుక సేపు విశాంతినొందెద (కూర్చుఁడును) మనమా! నేటిదినంబున దర్శించిన యమ్మహాపురుషుండెవ్వండై యుండు, ఆతని ముఖవిలాసంబు జంద్రతిరస్కారంబై రాజ లక్షణలక్షితంబై యలరారిమన్మథసామ్రాజ్యాభిషేకసమర్థుండో

యనమదీయ మనోదర్పణ ప్రతిబింబితరూప సౌందర్యలావణ్యా గరిష్ఠుండై, దృక్పథంబునఁ దాండవమాడుచుండె. నేనేమిసేయుదును! రాజవంశసంజాతినగు నాయభీష్టంబు దీర్పువారెవ్వరు. తీరుటెట్లు (కొంచెమూరకుండి) ఇందునకవ్విధాతయేసమర్థుండు. లేదేని నాకష్టంబుఁ జెప్పవీలులేదుగదా? అతనిపేరైనఁ దెలిసికొననైతిని, ఇంకనాకెట్లాతని దర్శనభాగ్యంబు లభ్యంబగును! మంచిముత్తెంబునందు బారాడఁజిగిరెనాతని దేహకాంతిస్వచ్ఛంబై యుండె. నామనోరథంబుఁ తల్లిదండ్రులతో నెట్లుచెప్పుదు! చెప్పినవారామోదింతురా? ఒకవేళ వారిచ్చమైవార్తనంపిన నతండేమనునో? ఇందునకు మార్గంబెట్లు (కొంచెమాగి) పిల్లగాలులు నాడెందంబుఁ దల్లడిలఁజేయసాగెను. ఆలేమావి సలరారు పికాంగనాగీతంబు నామనంబు నున్మాదావస్థం బ్రవేశపెట్టుచుండెను. (ఆశ్చర్యమునభినయించి) పురుషులెవరో యిటువచ్చుచున్నట్టున్నది. దుర్మార్గుఁడగు మద్గురుఁడుకాదుగదా! నేకొంచెము మఱుంగునఁజేరి వీరివిషయమును దిలకించెద.

[ సుద, మధు, ధర్మపాలురు ప్రవేశింతురు. ]

సు—మధుసూదనా? ఇవ్వసరామణీయకమును జూచితివా!

ఉ॥ చల్లనిపిల్లతెమ్మెరలు ♦ సాంద్రపరాగ విరాజమానమై
యులము బల్లవింపఁగడు ♦ నూర్జముతో నిటువీచుచుండ సం
ఫుల్లసుమంబులెల్ల పరి ♦ పూర్ణసుగంధముఁ బర్వఁజేయఁగాఁ
జల్లదనంబు శాంతియును♦జయ్యనఁ గూర్చెడు మోదమందగన్

మ—రాజవతంసమా? అటునాలింపుము.

మ॥ ముదలన్పల్లవఖాదియై ప్రియునికి ♦ నోమ్మోదంబు బెల్లుబ్బఁగా
వదనంబెత్తి వినోదగీత కలనా ♦ భ్యాసంబు సారించు న

మ్మదనోన్మాదపికాంగనా మణిసుధా ♦ మాధుర్య నిర్వ్యదవం
బది వీణానినదోత్సు కాతిశయమై ♦ యాహ్లాదమున్గూర్చెడున్.

సుద— (ఆశ్చర్యముతో) సఖా? ధర్మపాలా? చూచితివా? అతిరమ్య మామిడిగున్నలనడుమ నలరారు స్ఫటికశిలావేదికయందగపడు విలాసమెద్దియో ?

ధర్మ—(పరికించిచూచి) అబలారత్నంబుగఁ దోచుచుండె. అయినను దినఁబోవుచు రుచులడుగనేల? సమీపించుచుంటిమిగదా ?

సుద—మనము సమీపించినకొలంది దూరముగాఁ బోవుచుండెను. సమీపించవలయునా? వినుము.

మ॥ వనశోభ న్దిలకింపఁ ద్రదమమనో ♦ వాంఛానముద్యోతితమై
ఘనసౌందర్య విలాసవైభవ లస ♦ త్కాంతాస్వరూపంబుతో
గానబొంద స్గనుదెంచెఁగాని భువనీ ♦ కోకస్త నీవామపా
ద నఖాంచద్ద్యుతిరేఖఁబోలదగునా ♦ తారుణ్యారామామణుల్.

ధర్మ—అయినసమీపమునకేఁగి తద్విషయమును గ్రహింతము.

(ముందునకు నడుచుచున్నారు.)

వి—(తనలో) వీరునన్నుగాంచినట్లున్నది. ఇటేవచ్చుచున్నారు. కొంచె మావలికేగి యామహీరుహముపొంత నిలువబడియెద. (నిలుచుండి) ఓహో? దేవీభవనంబునఁగాంచిన పురుషత్రితయంబుగఁదోచుచుండెను. కానిమ్ము. దైవానుగ్రహపాత్రుల కెప్పుడును నీప్సితంబులు గరతలామలకంబులుగదా? ఆతని వృత్తాంతం బామూలాగ్రము నెఱుంగవలయును. కానిమ్ము. పలుకరించిచూచెద. ఆహా? మనంబా? బహుత్వరపడుచుంటివి. సాధ్వీమణులకదిలక్షణమా? దూరదృష్టింబరికింపుము. సంధ్యా

కాలమాసన్నమైనది. దేవీప్రార్థనకుఁ గాలంబుసమీపించె. వీరును సమీపించిరి. నేనేమియు దెలియనిదానివలె నటించుట శ్రేయస్కరంబు

సు—ధర్మపాలా ? ఆయువతీసన్నిధానంబునకరిగి యామె వృత్తాంతంబంతయు దెలియనడుగుము.

ధర్మ—మంచిది, అట్లేయడిగెద (ముందునకునడచి)

అమ్మా? మీరెవ్వరు? ఇందులకేలవచ్చితివి ? భవద్వృత్తాంత మేమి ? నీవదనవిలాసంబుఁగాంచ రాజన్యకుమారికవలెఁదోచు చున్నది నీవృత్తాంతమారయ మహాతేజస్వియు, సకలసద్గుణ శోభితుఁడును దానరాధేయుఁడును, నుత్తమక్షత్రియవంశ సంజాతుండనునగు సుదర్శనుఁడుబంప నిటువచ్చితిని. ఆతఁడిచ్చ టకువిచ్చేయు టధర్మమని యూహించి యాతమాల వృక్షచ్ఛాయ నాసీనుఁడై యుండెను. శీఘ్రంబున న్ననుగ్రహింపుము.

వి—(తనలో) మదీయవృత్తాంతం బీతనికెఱింగించుటయుక్తము. ఈతనిమాటలు మాధుర్యంబుగ వినఁబడుచుండెను. కానీ? ముందీతనితో గంభీరంబుగ మాటలాడెద. (అతనివంకజూచి)సందేశహరా? నావృత్తాంతం బేమియవసరము? ఒంటరిగా సంచరించు వనితాలలామల సామీప్యంబునకుఁ బురుషులు రాఁజెల్లునా ?

ధర్మ—ఒంటరిగానుండుటచేతనె వచ్చియుంటిని. వచ్చితప్పేమిపలికితిని.

వి—ఓ హెూ ? తప్పుబల్కవలయునా ? పచ్చుటఁజాలదా అయి ననునడిగితివి కావున నావృత్తాంతమును జెప్పెదవినుము. మన్నివాసంబు గంగాసరిదుత్తరతటవిరాజమానంబగు పాంచాలంబు. తత్పట్టణాధీశ్వరుండగు సత్యవర్ధనుండు, మజ్జనకుడు మదీయ నామంబు విద్యుల్లతాదేవి. దుర్భరశత్రురాజపీడ చేఁద్రదాజ్యం

బు వారియుర చేతులందిడి నాతఁడిొ యీపురంబుఁ బ్రవేశించి యుద్దేవీసదన నివాసియగు నద్వైతమతబోధకుఁడగు స్వామి పూర్ణానందుని స్నేహంబుచే నాప్రక్క సౌధంబునఁ గాపురం బుండెను.

ధర్మ—పరిణయం బయ్యెనా?

వి—లేదు. (కొంచెమాగి) మధ్యాహ్నంబున కరుగు వేళయైనది, ఇంకఁ బోవలయును.

ధర్మ—అమ్మా? ఈవిషయంబంతయు మన్మిత్రునకు కెఱింగించి, యాపైని వృత్తాంతం బంతయుఁ దెలియంజేసెద పోయివచ్చెద. (వెనుకకు బోవును)

వి—(తనలో) ఇదియేమోవిచిత్రముగఁ దోచుచున్నయది. నిశ్చయముగ దేవ్యాలయంబునఁ జూచినవారలు వీరె? సందేహామించుకంతయును లేదు. అయిన మన్మనోరథంబు సఫలీకృత మందునా? అది దైవాధీనము. సందేశమాకర్ణించి, యాతఁడిట కరుదెంచునా? అటులైన శుభమయ్యెడు, లేదేనినాయుద్దేశంబు నిరర్థకంబు? తొందర పడ నేల? కొంచెము సేపు వేచియుండెద.

(ధర్మపాలుడు, సుదర్శనాదులను సమాపించి)

ధర్మ—మిత్రమా? సుదర్శనా? ఆసతీలలామ పాంచాల దేశాధీశ్వరుండగుసత్యవర్ధనుని యనుంగుఁగూతురు. నామంబువిద్యుల్లతాదేవి. అవివాహిత. దేవ్యాలయసామీప్యసౌధంబు నివాసంబు. మనవలెనె వారీ పట్టణంబునకు విచ్చేసిరి, ఆమెజనకున కద్వైతబోధకుండగు పూర్ణానందుఁడు చిరపరిచయుఁడట.

సు—మిత్రులారా? నేఁబోయియామెతో సంభాషించి వచ్చెదను. మీరిక్కడ నేయుండుడు!

మ—మంచిది అట్లే చేయుము.

వి—(తనలో చిరునగవుతో) అదిగో! నేఁగాంచిన పురుషోత్తమరూపం బదియే? నా మనోహరుండితఁడే. మనమా! తొందరింప కుము. (సిగ్గునం దలవంచియుండును)

సు—(సమీపించి) సతీ! విద్యుల్లతా? భవత్సౌందర్యదాసుఁడీ సుద ర్శనుండు, యుష్మత్సందర్శనార్థము వచ్చియున్నవాఁడు.

వి—(భయలజ్జావదనయై) త్వదీయ చతురవాక్యంబులు నామనంబు నకు మిగుల భయావహములుగ నున్నయవి.

సు—పవిత్రక్షత్రియవంశసంజాతవగు నీకుభయంబేలఁ వినుము!

మ॥ నినుఁగాంచన్మదితత్తరించి, యటులో ♦ నీ రేజపత్రేక్షణా
యనుమానించుచు వార్తఁబంపితి, మదీ ♦ యాసక్తిసాఫల్యము
న్గని, మోదాంబుధి నోలలాడఁగ భవ ♦ త్కారుణ్యపూర్ణేక్షణా
ననచంద్రాశ్రితపకాంతి నాపయి నిధా ♦ నంబొప్పఁ జేకూర్పవూ?

ఇదియునుఁగాక.

చ॥ ఉభయుల జన్మముల్ ధరణి ♦ నుత్తమ, రాజకులాంబురాశికి
శుభదములౌచుభాసిలెడు ♦ సుందరి; దేశమటన్ననొక్కటే
అభయమునన్ మదీయకర ♦ మందు భవత్కర పద్మముంచి స
చ్ఛుభకర వైభవోన్నతవి ♦ శుద్ధకృతార్థుని జేసి ప్రోవుమీ.

విద్యు—మీరాడుమాటలు నాకువినోదంబుగాఁ గన్పట్టుచుండెను. ఇదియేమి! అబలను నన్నొంటరిగాఁజూచి యిట్లుఁబల్కఁబాడి యా? జననీజనకులు వృద్ధులు, గౌరవనీయులు. అట్టియెడ విచా రింపక మీరుచేయు రససంభాషణంబు నాకించుక సందియము వొడముచున్నయది. దానియర్థమేమో తెలియుటలేదు. (తనలో) కొంచెము కఠినముగా మాట్లాడిచూచెద (ప్రకాశముగా)

గీ॥ ధర్మపరులైన తమవంటి ♦ ధాత్రివిభులె
యొంటిపాటున నున్నట్టి ♦ యువిదఁజేరి
పలుకరించిన నేమంచుఁ ♦ బలుకఁగలదు
కంచెయే చేనుమేసినఁ ♦ గలదెఁ త్రోవ.

సు—(తనలో) ఓహో ? ఈమెవచించెడు ప్రతిపదమును రసాస్పదమై భావగంభీరమై యలరారుచున్నయది. శ్లేషపదప్రయోగములయందీమె కడుసమర్థురాలుగఁ గన్పట్టుచున్నది (ప్రకాశముగా) తన్వీ ? పురుషులమనంబు వెన్నవంటిదనియా ? ఇటుల బల్కుచుంటివి? నీవాక్సుధా రసధారాసరణియుష్మదాలింగనాసక్తయగు నాచిత్తసరోవరంబును మఱింతేఁ ండునట్లు జేయుచున్నయది. జననీజనకుల యాజ్ఞారహితనగుదునని భావింతువేని ప్రకృతిసందర్భమునుబట్టి వారును సంతసింపుదురు. మొదటిది శాస్త్రవిహితమైయున్నది. అంనువలన సర్వజనాహ్లాదజన్యము. ఇందునకు సంశయంబెంతమాత్రమువలదు. నిరగాహ్యము, నిర్భయము, సదాచారము. ప్రియసఖీ ! నాదేహమున, మదనసంబధమైన యుష్ణమెక్కుడై దాహంబుగలిగి నోరెండసాగెను, ఇఁకఁజెప్పవలసిన దేమున్నది.

గీ॥ అనుభవింపంగ నీయధ ♦ రామృతంబు
దయనొసంగియు నాప్రాణ ♦ దానమిమ్ము
ఇహపరంబుల రెంటను ♦ సహజమైన
ఫలములభియింను ముంగొంగు ♦ పసిడిభాతి.

మృగేక్షణా ? నాబాహువల్లరిచే నీతనులత నొకపరిస్పృశింపనిమ్ము. ఇటురా? (అనితాకబోవును)

వి—(ప్రక్కకుఁదొలగి) నిలువుము. నిలువుము. (మిట్టిచూచి) నీచేష్టలు విపరీతమును బొందుచున్నయవి, చాలు! చాలు ! ఇదియేనా

క్షత్రియధర్మము. ఇదివరకిట్లెందఱినివంచించియుంటివి. ఒంటరిగ నీకన్నుదమ్ముల యెదుటఁబడిన వారినెల్లనిట్లే గ్రహించియుంటివి కాబోలు సరి! సరి!

గీ॥ అతివలనుఁబట్టి బలిమి న ♦ న్యాయముగను
జెఱుపఁజూచెడు వారికిఁ ♦ జెల్లుగాని
భయమొకించుకలేకను ♦ బైనఁబడుట
యదియుఁబూరుషోత్తములకు ♦ నర్హమగునె.

కావున నరచేతవైకుంఠముజూపి, యాత్మణమం దనన్యప్రేమాంబుధి నోలలాడించి తుదకుఁదృణప్రాయంబుగఁ బరిత్యజింతురు. ఇట్టి వెడగుమాటల నుడువక మునువచ్చినత్రోవ నేగుట యుచితము.

సు—సఖీ? విద్యుల్లతా? నాయందు మాత్రమట్టి భావంబునుబొందుట న్యాయంబుగాదు. ఇదియే నాకాంతాన్వేషణంబునకుఁ బ్రథమంబు. నీవేమద్గృహలక్ష్మివి. నాయర్ధాంగివి. మత్కులరాజ్యంబునకుఁ బట్టమహిషివి. మదీయసంతాన ప్రాప్తికి వరప్రదాన దేవతవు. నాభాగ్యరాశివి. నాయర్థకామాది వర్గమునకుఁ బెన్నిధివి. నిశ్చయము ఇందునకావంతయుసందియములేదు. సత్యనిరతుఁడను మదీయచిత్తంబును బరీక్షింపుము. ఆటురమ్ము. ఒక్క ముద్దిడుము.

వి—(కొంచెమావలికేగి తనలో) ఈతఁడు వచించునవి యన్నియు యదార్థంబుగఁ దోచుచున్నయవి; అయినం దొందర పడనేల. ఇంకఁగొంచెము మాట్లాడి చూచెదను. (ప్రకాశముగా) రతీనాధసమదర్శన సుదర్శనా? నీవుజెప్పినవన్నియు నిక్కములే యైయుండవచ్చును. కానిమ్ము. నేనిప్పుడుబరిగ్రహించుటకు వలనుపడదు. మజ్జననీజనకుల యాజ్ఞఁగైకొని యాపైఁ గార్యము నూహించెదఁ గాన నేఁబోయివచ్చెద (అనినడచును)

సుద—(అడ్డముబోయి) ఈవిషయమం దో కరియాజ్ఞ నపేక్షింపఁ దగినదికాదు. అష్టవిధవివాహంబులలో గాంధర్వము క్షత్రియ కులధర్మమని చెప్పఁబడియున్నది. ఇటువినుము.

మ॥ మునుదుష్యంత మహీధరాధిపుని స ♦ మ్మోదంబు జెల్వొందగా
వనజాతేక్షణ మేనకాత్మజ మహా ♦ భాగ్యంబటంచు న్దపో
వనసీమ న్వరియింపలేదె; యిపుడున్ ♦ వ్యర్థంబె; తన్మార్గమున్
జనుమోసుందరి! మానుచున్మధుర హా ♦సవ్యాస వాగ్వైఖరుల్

విద్యు—ఇయ్యది రాజధర్మంబయ్యేనేని (చిరునగవునఁ గొంచెమాగి) యోచించి భవత్కాంతంబునఁ బూసరంబలంకరించెద. సూర్యుం డస్తాద్రికేగుచుండె. విద్యాగురుండగు పూర్ణానందుఁడు మిగుల కోపముజెందును. గుర్వాశ్రమంబునకుఁ బోవలెను. నాహృదయంబు దత్తరపాటొందుచున్నయది ఇది దేవ్యాలయోద్యానవనంబు, తదనుచరులెవ్వరైన వచ్చుచుందురు, పోయివచ్చెద.
(అనినడుచును)

సు—(అడ్డముబోయి) కురంగేక్షణా ? ఈపుష్పమాలికను, దిలకింపుము? ఇయ్యది దేవీసన్నిధాన బహిర్ద్వారముకడ నీచేనాకొఱకుంపఁబడినదిగదా? తత్కాలంబునందే స్వయంవరంబు జరిగియుండె, నింకనన్నిట్లు మోసగించుట న్యాయమా ?

విద్యు—(తనలో) ఇప్పటికీతఁడు పూర్ణముగా నాయభిప్రాయమును గ్రహించినాఁడు. నిక్కముగా నితఁడేనాప్రియుఁడు. మెల్లగ నీతని దప్పించుకొని గృహముజేరెద. రేపటిదినము విచారించెదను. (ప్రకాశముగా) ఇందుమోసమేమియునులేదు. నీయభిప్రాయంబునందు దోషములేదు. (తొందరగా నడచుచున్నది.)

సు—నిలువుము, నిలువుము ఒక్కమాటవినుము. (అని వెంటనిష్క్రమించును.)

రంగము : సుదర్శనుని సౌధము.

మందారమాల—ప్రవేశము

మందా—(తనలో) నేనీసౌధమునంతయుం గలయఁదిరిగితిని. ఇందొక్క పురుషుఁడైనను స్త్రీయైనను గనికంబునకైనను గానరారు. అఱచి యఱచి నాగొంతంతయుఁ బోయినది. ఆసుదర్శనుం డొక్కరుండే యుండునుగాబోలు. అట్లయిన నేనదృష్టవంతు రాలనే? అతఁడును వయస్సునఁ జిన్నవాఁడని తలంచెద. ఉభయులకు నీడుజోడుగుదిరికఁగలిగి పిచ్చుకలవలె ముచ్చటగా నుండినఁ బూమవారలు సంతసింపకుందురా? కాని, నేనంధురాలనగదా? (దుఃఖముతో)

మ॥ అకటా! యేమనిమాఱుదాననిను దే ♦ వా? భారతీనాధమా మకసర్వాంగిము లున్మనోహర గతిం ♦ భాసిల్లఁగాఁజేసి యీ సకలంకంబగు నేత్రయుగ్మమిడి మ ♦ త్స్వాంతంబులో ఘోరచిం తకుఁ జోటిచ్చితివేల! యీవిధి సము ♦ ద్యద్బుద్ధిహీనుండవై.

ఇప్పుడు జేయునదేమున్నది! (వినుటనభినయించి) ఎవరో వచ్చుచున్నట్లున్నది. ఎవరువారు?

(సుధ, మధు, ధర్మ, ప్రవేశము.)

సు—నేనుసుదర్శనుఁడను.

మం—వారెవరు?

సు—మన్మిత్రులు మధుసూధన, ధర్మపాలురు.

మం—(సుదర్శనుని చేతులుబట్టుకొని) ఆర్యా? మీరేగిచాలవేళైనది. అప్పటినుండియు నేనొంటరిగా నిందుంటిని. లోపలికిదయచేసి శ్రమదీర్చుకొనుఁడు. మీకుగావలసిన యుపచారంబుల నేఁజేసెద. (అని కొంచెమావలికి దీసికొని వెళ్లును.)

సు—పాపము! నీవంధురాల వేమిచేయఁగలవు. కాన నీవూరకుండుము, పరిచారికాజనంబులు కృత్యంబు నెరవేర్తురు.

మం—ఆర్యా? తమకుం బరిణయంబైనదా? అయిన తత్పట్టణనామం బెయ్యది, భవదీయ ప్రాణనాయకి యెచ్చట? నావంటిదానికి మీబోఁటి సుందరాకారులఁ గన్నులారఁజూచుభాగ్యంబు లేదు గదా? (దుఃఖచిత్తయై) నన్నెట్టులైన మీరేరక్షింపవలెను. భగవంతుఁడగు నావిధాత నన్ను మీసామీప్యంబునకుఁ జేర్చి నాఁడు. అందువలన సమస్తము లభించు నట్లెంచుచుంటిని.

సు—మంచిది, నిన్నట్లే కాపాడుదుము. నావివాహంబింకను గాలేదు. ఆవిషయమై యాలోచించుచుంటిమి.

మం—చిత్తము కన్యకాసంబంధమెచ్చట.

సు—ఇంకనది సిద్ధాంతముగఁ జెప్పుటకువీలులేదు. మేము సౌధోపరి భాగంబునకుఁబోయి విశ్రమింతుము. నీవునచ్చట గష్టముగా నుండును. గాన, నిచ్చటనేయుండుము.

మం—ఆర్యా! నేనురాలేకేమి? మీరాకకుఁబూర్వ మివియంతయుఁ దిరిగివచ్చితిని. అవసరమున్న యెడల వచ్చెదను.

సు—లేదు. ఇచ్చటనే యుండుము. మిత్రులారా! సౌధోపరి భాగంబునకు బోవుదము రండు.

మం—వెళ్ళితిరా? (అనిర్వ్యసిసి గమనించుచు) ఆవెళ్ళిరి (తనలో)

శా॥ రాకాచంద్రుని రాకకున్నిఁశిజకో • రంబట్లు జండాంశుశో
భాకారంబునకున్నరోజమటులే•నత్యాసతోనుంటి నా
రాకాచంద్రనిభాననుండయిన యీ•రాపుత్రునిన్ భర్తగా
నాకున్గైకొను ప్రాప్తియుండునె!యికన్•నాభాగ్యమెట్లున్నదో.

ఇంతవరకు సర్వవిషయములు నాకనుకూలముగ నేయున్నవి. ఈతనినెల్లైన స్వాధీనముఁ జేసికొనినయెడల నాకన్నిటను సౌఖ్యంబుఁ జేకూరును. ఆపని, మాటలవలనమాత్రము గానేరదు. ఇది నిశ్చయము, మఱియెట్లు (కొంచెమాఁగి) మరుగుమందులున్నవని చెప్పువాఁడొకఁ డొకటియున్నది. తదౌషధప్రయోగంబున బహుసులభముగా నాకోర్కె నెరవేరును. ఈకార్యంబునకు నెవరిని యాశ్రయించెద మహారహస్యమైన విషయము. నాకు హితురాండ్రెవ్వరుగలరు. ఇంతటనుండియుఁ దద్విషయప్రయత్నమందప్రమత్తనై మెలంగవలయు (వినుటనభినయించి కరశ్రితోకొట్టిచూచును) ఎవరో వచ్చుచున్నట్లున్నది. (సుందరి ప్రవేశము.)

సు-(తనలో) ఔరా! ఇప్పాంపీనగరశృంగారంబెంత శోభానైపుణ్యత నలరారుచున్నయది. వీధులయొక్కయు, రథ్యాస్థానముల యొక్కయు నైశాల్యంబు వర్ణనీయంబుగ దోచుచున్నయదిగదా? చంద్రమండలంబును ముద్దాడుచున్నవో యనునట్లుండు గోపురశిఖర ప్రకాశమాన సౌధజాలములయందుఁ జంపకమల్లికా మాధవీవృక్షలతాపరిమళశోభిత విహారస్థలములును, సకలవస్తుసముదయవాణిజ్యవ్యాప్తపణ్యవీథికానిచయంబులును రంభోర్వశ్యాది దేవగణికా తిరస్కారనాట్యాభినయకళా ప్రావీణ్యవారాంగనానాట్యరంగస్థలంబులు గలిఁగి ద్వితీయ దేవతానగరియో యన నొప్పారు నిమ్మహాపట్టణంబున విద్యుల్లతాకాంతుని సౌధంబెక్కడయని విన్నయింతును. ఎవరినైన నడిగితినేని. వారే యభిప్రాయమును బొందుదురో? ఇప్పటికే కడు దూరమువచ్చితిని. శరీరము మిక్కిలిశ్రమనొందినది. అయిన రాజచిహ్నితధ్వజ విరాజమానోన్నత సౌధంబొక్కటియు నీప్రాంతమందెచ్చటను గాన్పించుటలేదు. (తిరిగిచూచి కొంచెము నడచి) అదిగో? యీపరిక్రమాత్రము దదంకశోభితమైన సౌధ

రాజంబొక్కటి గానంబడుచున్నయది. అద్దానిసమీపించి విచారించెద, (కొంచెము ముందుకునడిచి తెక్కెమువంక చూపునభినయించి) ఈతెక్కెమునందు, మహారాజా! సుదర్శనా! అనియున్నది పెతుకఁబోయిన లతిపాదస్పర్శనము గాంచినట్లాతని సౌధంబు నాకు దృశ్యమానంబయ్యె? సుఖద్వారంబు కడకుఁబోయి ద్వారపాలకులంగాంచి లోపలఁ బ్రవేశించెద. (ముందుకు నడచును)

మందా—ఎవరువారు! ఎవరువారు! మాట్లాడరేమి?

సుంద—(తనలో) ఈమెఁ గుడ్డిదిగానున్నది. ఇతరు లెవ్వరిచ్చట లేరు. అయిన నీమెవృత్తాంతమరసెద, (ప్రకాశముగా) నేను విద్యుల్లతాదేవి చెలికత్తెను. నా పేరుసుందరి యందురు.

మందా—నీవిచ్చటకు రాగతంబేమి?

సుం—మా దేవి యాజ్ఞచేవచ్చితిని.

మందా—ఎందులకు, ఎందులకు!

సుం—(తనలో) ఈమెనాపవిస్తారమంతయుఁ దెలియనారంభించినది. ముందీమె విషయమును దెలిసికొనవలెను. (ప్రకాశముగా) అమ్మాఁ నీవెవరవు, ఇచ్చటనెందులకుంటివి? నాయందు దయఁగలదానవై నీవిషయంబు సాంగంబుగాఁ జెప్పుము?

మందా—(సందేహముతో) నేను రాజకులసంజాతను. సుదర్శనప్రియను.

సుం— (ఆశ్చర్యముతో) నీవా సుదర్శన ప్రియవు! నీవా సుదర్శన ప్రియవు! ఇదియేమి వింతగానున్నదే!

మందా —నీవు మాటయొక యర్థమూహించుచున్నట్లున్నది. అదికాదు, దిక్కు లేని యంధురాల నగుటచే నన్నుఁ బ్రియముగాఁ బోషించుచుండెను. తత్కారణంబున నట్లంటిని.

సుంద—నామంబెయ్యది.

మం—మందారమాలయందురు.

సుం—అమ్మా? మందారమాలా? సుదర్శనానురాగయగు విద్యుల్లతాదేవి సందేశ మీరాజచంద్రునకు దెలియజేయుటకు వచ్చియుంటిని. కావున నాయన సందర్శనంబును జేయవలసియున్నది.

మందా—(సుందరిని కౌగలించుకొని) అమ్మాయి! ఇంతకుఁబూర్వమే యంతఃపురంబునకుఁబోయి శయనించి యుండెను, నీవిప్పుడు మాట్లాడుటకు సమయముగాదు. ఆసందేశమునాకుఁజెప్ప వీలగునేని, దెలియజేయుము. అట్లే యాతనితో నివేదింతును. (తనలో) దీనిని నాస్వాధీన మందుంచుకొను నుపాయమూహించవలెను. (ప్రకాశముగా) నన్ను నీకంటె నన్యమైన దాసిగ భావింపవద్దు, ఆమెకు నేనును హితురాలనే.

చ॥ సుగుణ పరంపరాకలిత ♦ శుద్ధమతిన్నిరియించువారితోఁ
దగగ నబద్ధమాడ నిను ♦ దప్పక నాహితురాలవందు నో
అగణిత సుందరాంగి! యిపు ♦ డావిషయంబు సమగ్రమొందఁజ
క్కఁగ వినుపింపు మాపయిని ♦ కార్యము జెప్పెదనీకు నిప్పుడే?

సుం—అమ్మా? మందారమాలా? చెప్పుటకేమియును సందియము లేదు.

సీ॥ ఉద్యానవనమధ్య ♦ హృద్యమై, చెలువొంద
రాజేంద్రు ముఖచంద్రు ♦ రమణి కాంచెఁ
గాంచిన దాదిగఁ ♦ గమనీయ దేహంబు
విరహానలంబున ♦ వేచుచుండె,
వేచుటంజేసి స ♦ ద్విద్యా తిరస్కార
చంచల బుద్ధితో ♦ సంచరించె
సంచరించుటఁజేసి ♦ సమవయస్యాంగనా
స్నేహాతిరిక్తయై ♦ చెలఁగుచుండె

గీ॥ నేమిచెప్పుదు నాలేమ ♦ నేమమిపుడు
దర్శనీయ సుదర్శన ♦ ధరణీధవుని
గాంచికున్నను బ్రతుకికఁ ♦ గలదె జగతిఁ
గానవేగ మాతనిబంపు ♦ కరుణఁ గలిఁగి.

మందా—(తనలో) దీని చెలిమినాకు ముఖ్యంబు. దీని మాటలనుబట్టి చూడ నీతఁడు మహాసౌందర్య శోభితుఁడని దెలియ వచ్చుచున్నయది. ఆమెయు విద్యుల్లతయే యైయుండును. వీరి కన్యోన్య ప్రేమ యభివృద్ధి యగుచున్నది. కానిమ్ము. ఈప్రేమానుబంధమును ద్రెంపుట యుచితముగాదు. పూర్వజన్మమందెన్ని పాపంబులు చేయుటచేతనో యిట్టిగతి సంభవించినది. అద్దేవీకృపాపాత్రనై తినేని నాకేమియుఁ గష్టములేదని దలంచెద. ఈసమయమందామెను గలసి మాట్లాడవలెను. మంచిసమయముదొరికినది (ప్రకాశముగా) సుందరీ! ఆపురుషుని నిద్రావస్థనుండి తప్పించుట యోగ్యముకాదు. తదుపరి శీఘ్రముగ నాతనిఁ బంపెద. ఇందునకు నేబాధ్యురాలను. మఱియొక సంగతి నన్నిప్పుడు నీవెంటఁగొనిపోయి యామెనుజూపింపుము. ఇదితప్పదు. పోవుదమురమ్ము.

సుం—అమ్మా! మందారమాలా! విద్యుల్లతా సౌధంబిక్కడకుఁ జాల దూరమందున్నది. నీవువచ్చిన మరల నొంటరిగా రావీలులేదు.

మం—సుందరీ! అట్లుగాదు. నీవు నాసమముగా నడువలేవు. నేనొంటరిగా నొక్కత్రుటిలో రాఁగలను. పోవుదమురమ్ము.

(నిష్క్రమింతురు.)

రంగము. [రాజవీధి] పూర్ణానందుడు పాడుచు ప్రవేశించును.

పూర్ణా-శ్లో॥ త్రిపురాంతక త్రిదశేశ్వర గణనాయక శివతే
శరణం భవకృతసాగరఘణి కంకణ చరణం

వృషవాహన విషదూషణ పతితోద్ధర శరణం
శివశంకర శివశంకర హర మే హరదురితం॥

అతిభీషణ కటుభాషణ యమకింకర పటలీ
కృతతాడన పరిపీడన మరణాగమ సమయే
ఉమయాసహ మమచేతసి యమశాసననివసం
శివశంకర శివశంకర హర మే హరదురితం॥

(ముకుందుడు ప్రవేశించును.)

ముకుం—సాష్టాంగ నమస్కారములు.

పూ—సద్గురుసచ్చిదానంద పరబ్రహ్మార్పణమస్తు.

ము—ఎచ్చటనుండి విచ్చేయుచున్నారు?

పూ—మచ్ఛిష్యుఁడగు సత్యవర్ధనుని గృహమునుండి.

ముకుం—తమ యద్వైత శాస్త్రమందు గల సమానపాండితీ విభవులని చాల దినముల క్రిందట వినియుంటిని. అప్పటినుండియుఁ దమదర్శనముఁ జేయ నా మనంబు కుతూహల మొందుచుండెను. నేటిదినమునఁ గాకతాళీయ న్యాయముగఁ దమదర్శన భాగ్యంబు చేకూరెను. కడుధన్యుఁడను, కడుపుణ్యుడను, తమదాసుఁడను.

పూ—అబ్బాయి? సాధూనాందర్శనం పుణ్యంబను నార్యోక్తి వ్యర్థమగునా ?

ము—నిశ్చయము. నిశ్చయము. ఆర్యా? నాకొక్క సందియము గలదు దానిని తమవలనఁ దెలిసి కొనవలెనని, నాయభిప్రాయము.

పూ—ఏమి సందియమో చెప్పుము.

ఉ॥ దేవుని రూపమేవిధిని ♦ దేజరిలుజ్జగమందు! జీవుఁడే
వావిని సంచరించు బుధ ♦ వర్య! శరీరమ దెట్టులాయె నీ
భావము బోధసల్పినను ♦ భవ్యగుణోజ్జ్వలు జేసి సాధుసం
సేవితతత్త్వ మార్గమది ♦ శీఘ్రముగా నెఱిఁగింప వేడెదన్

పూ—సుమతీ? నీసంప్రశ్నము. వర్ణనీయమే! కాని ఇంచుక సందియము. నీ విదివర కేమహాత్ముని కృపనైనఁ బొందియుంటివా?

ము—చిత్తము. స్వామి యద్వైతానందసన్నిధానంబునఁ గొంత కాలంబు శుశ్రూషంజేసితిని.

పూ—అట్లైన సందియములేదు, సావధానుండవై మదద్వైతోపన్యాసంబుఁ గర్ణపేయంబుగ నాలింపుము.

కుమారా? భగవత్స్వరూపంబు నిర్గుణసగుణ నిర్వికారనిరంజన శుద్ధబుద్ధాచింత్యమై, అవాఙ్మానస గోచరంబై, సచ్చిదానంద స్వరూపమై, కోటిసూర్య ప్రభాతిరస్కార శోభాసము దయోజ్వల దివ్య మంగళ మూర్తియై, జగదానందకరస్వప్రకాశభాసమానంబై సజాతీయ విజాతీయ స్వగతభేదరాహిత్యంబై పిపీలికాది మహ తత్త్వ పర్యంతస్థితపదార్థాంతర్గత తేజోరూపంబై. సహస్రారసరోజాత కర్ణికామహార భాస్వద్బిందుపీఠాధిష్టానంబై, జన్మజరామరణదుఃఖరహితంబై యోగిహృద్ధ్యానగమ్యమై సృష్టిస్థితిసంహారకారణంబై, సర్వకాలసౌఖ్యప్రదంబై, అవర్ణనీయ ప్రకాశంబై యలరారుచుండును. ఇఁక జీవుండన? అనర్థమకారాగార సంసారసాగరనిమగ్నుండై కామక్రోధాద్యంతశ్శత్రుని బద్ధమానసుండై, మాయావిమోహితుఁడై, ఆగామిసంచితప్రారబ్ధాది కర్మబద్ధుఁడై దురాశాపిశాచాపరిపీడితుఁడై మిథ్యాప్రపంచవాసియై, వర్తించుచుండును.

దేహంబన పృథివ్యాది పంచభూత నిర్మాణంబై క్రిమికులసంకులంబై, మాంసాద్యసహ్యపదార్థస్థానంబై, క్షణభంగురంబై, ప్రకాశించుచుండును.

వత్సా! ఈదినమింతవరకు ముగించితిని, దేవతారాధనకు కాలము సమీపించినది. గృహంబునకుఁ బోవలెను.

ము—చిత్తము. ఆర్యా! నమస్కారము. ఈరత్నహారంబును భవదీయ కంఠమునలంకరింపుడు.

పూ—శ్లో॥ అర్థమనర్థంభావ యనిత్యం! నాస్తితతస్సుఖ లేశస్సత్యం।
పుత్రాదపి ధనభాజాంభీతి। స్సర్వత్రై షావిహితారీతిః॥
భజగోవిందం భజగోవిందం। మూఢమతే॥

అని యున్నదిగాన నేధరించుట యుచితముగాదు ధర్మవిరుద్ధము.

ము—అట్లువలనుపడదు. నాప్రీతిపూర్వకముగ నొసంగుదానికి మీరాయత్యంతరముమి! ధరింపుడు. ధరింపుడు.

పూ—(తనలో) ఇంక బెట్టుచేయుట వ్యర్థతనము. (ప్రకాశముగా) నీవే ధరింపఁజేయుము

ము—(మెడలో వేసి నమస్కరించును)

పూ—అభీష్టప్రాప్త సిద్ధిరస్తు.

ము—స్వామీ! పోయెదను. [నిష్క్రమించును]

పూ—(తనలో) నేనిప్పుడాతనితోఁ జెప్పిన దంతయు వేదాంతశాస్త్రమా! విద్యుల్లతా సౌందర్య విమర్శనా సందర్భమా! నామనంబా లలనాశిరోవతంస లావణ్యాబ్ధింబడి మునుంగుచున్నయది. కానిమ్ము ఇక్కాలంబున ధన మార్జించుటకును

లావణ్యాంగనా సౌఖ్యమొందుటకు నీమెట్టవేదాంతోక్తులు జాల ముఖ్యమైనవి, రేపటిదిన మెట్టులైననా మెరుంగు బోడిబాహు లతాపరివేష్టితుఁడనుగాక తప్పదు. మఱియు మానవ జన్మమెత్తి నందులకు

సీ॥ తొలుకాడు జిరునవ్వు ♦ జెలువొందు పూఁబోండ్ల
మెరుగుఁజెక్కులముద్దుఁ ♦ గరపుటొకటి
గిలిగింతలాడుచు ♦ గెలుపొందు చెలుల కె
మ్మోవి తేనయెనాను ♦ మురిపె మొకటి
మగపంతమూనుచు ♦ సొగసొందుమగునల
కొదమగుబ్బలఁబట్టి ♦ కులుకుటొకటి
బంగారుజిగిఁగెల్చి ♦ రంగారుపాలతులఁ
గాఁగలించెడు భాగ్య ♦ కలన మొకటి

గీ॥ ఇన్నిటందేల్చి సుఖమిచ్చి ♦ యింపుమీఱ
మాటలాడెడు సతిఁగూడి ♦ సుమతిఁబెనఁగి
తిరుగుచుండెడువాఁడె పో ♦ పురుషవరుఁడు
జన్మమెత్తినఫలమిది ♦ జగతిలోన.

కాన రేపటిదినము సంపూర్ణ ప్రయత్నంబు జేసెద.

(నిష్క్రమించును.)

ద్వితీయాంకము.

—(0)—

# సుదర్శనీయము

## తృతీయాంకము

—(౧)—

ఉద్యానవనము రంగము. విద్యుల్లతా ప్రవేశము.

వి- (తనలో) ఇయ్యది చంద్రకాంత శిలావేదిక, దీనియందు విశ్రమించిన నామనం బతితాపంబొందు. ఇప్పటికే తదీయరూపలావణ్య స్మరణంబున మిన్నువిరిగిపైఁబడ్డ చందంబునఁ దోచుచుండె. స్మరసంతాపాగ్ని నుపశమింపఁజేయుటకు మూరు సీమల యగంధవహ నందనుండును సీపికాంగనా గానరవంబును, నిందిందిరాసందోహ ఝుంకారంబును మిత్రత్వము నొంది నాకు దుర్భరశతృ సంఘాతములై పరిణమించుచున్నయవి (దిశలు దేరి చూచి) ఇంతవరకు నామనోహరు దర్శింపఁబోయిన సుందరి గాదమ్మ్యె. కారణంబేమైయుండును. ఆది యానవమోహనాకారుమందిరంబునకు జేరియుండునా? లేక, పంపావతీ పట్టణ వీధులయందలి విచిత్రంబులం దిలకించుచు మార్గమధ్యంబుననే యుండెనా? ఎట్లు తెలియును. ఆహా? మన్మధుం డెట్టికౄరకర్ముఁడు. మదీయ ప్రాణంబుల నిట్లు హింసింపనేల? నాకతండు విరోధుఁడా! నేనేమితప్పు జేసితిని. నన్ని ట్లిందుల కలయింపవలె. నాకేమియు దోచుటలేదు. (నటునిటుజూచి) అకటా?

మ॥ సరవిన్మంత్రి వసంతుఁగూడి శుకరా ♦ జంబెక్కి కైవారముల్
వరుసన్ శారిక లుచ్చరింపఁ బిక ని ♦ స్వానస్తుతుల్గొంచు దు

ర్భరశోభిధోజ్జ్వలమానసోత్కటయుత ♦ ప్రారంభమార్గీరవా
శరపుష్పాస్త్రుఁడు నాటసాగె శరసం ♦ ఘాతంబు మద్వక్షమున్ ॥

(పైకిజూచి) ఓహో ? ఈతనికిఁదోడుగ మేనమామయుఁ గూడ బయలుదేరినాడు. ఉభయులేకమై లోకంబులనెల్ల దగ్ధం బొనర్పకుందురా! లోకములసంగతి యెటులున్నను నాపనమాత్రము బట్టదలచినారు. ఏమీ ? ఈపాపము.

మ॥ అకటా బంగరునీసడించు జిగితో ♦ నానంద మున్గూర్చునీ
యకలంకంబగు నాశరీరమిపు డ ♦ న్యాయంబుగా శీతల
ప్రకటాంచత్కర జాలమగ్నమయి తా ♦ పంబొంది నిట్టూర్పుతో
వికలత్వంబును జేయఁ జంద్రుఁడదిగో ♦ విద్వేషుఁడై వచ్చెడిన్ ॥

ఆహా? ఏమిచేయుదానను. తాపంబతిశయించుచుండె. ఎట్లు చల్లారును. గోరోజన, కర్పూర కస్తూరీసమ్మిశ్రితచందన పంకంబైనను లేదుగదా! అలంగుకొన. అయ్యో! ఇంకెట్లు? ఈసన్నని సోనలై ప్రవహించు నాగొజ్జంగిపూఁదేనె కాల్వల జలకమాడిన తాపంబేమైన శమింపకుండునా? అట్లుగాదు అతిశయిల్లును. ఇచ్చటుండునవి యన్నియు నాకీసమయమందు విపరీత మొనర్చునవియే? ఇట్టి శత్రుప్రవ్యూహమధ్యంబున నన్నుఁ బ్రవేశపెట్టి దైవంబుకూడ విచిత్రంబుఁ జూచుచుండెఁగాబోలు.

గీ॥ కలుషహృదయులకెప్పుడు ♦ గలిమిఁగూర్చి
రక్షణముసేయు భగవంతుఁ డ ♦ క్షయముగఁ
గలుషశూన్యుల బాధించుఁ ♦ గఠినముగను
కారణంబేమొ! దీనికిఁ ♦ గానరాదు.

కానిమ్ము ధైర్యంబూనుట చాలమంచిది. ఓచంద్రమదనులారా! విరహావస్థచేఁ గృశించునబలను మీరిట్టు గారియ వెట్టదగునా? నానాధుండు ప్రియుండు మదీయ విరహపరిహారి, సుదర్శన

స్పర్శమాత్రంబుననే మీబలంబు సన్నగిలంజేసెద. మీయా యుధంబులు విరుగఁగొట్టెద సుమీ? జాగ్రత, ఇంకనొక్క క్షణమాగుడు. కసిదీర్చుకొనియెద. [అని యిటునటుఁజూచి] ఆతఁడు వచ్చునరకు నీ వేదికయందు విశ్రమించెద. (అని పరుండును)

(సుందరి, మందారమాల, ప్రవేశింతురు)

సుం—(తనలో) ఈమె సాక్షీ నిదురించుచున్నట్లు గన్పించుచున్నది. (సమీపించి) అయిన పిలిచిచూచెద. (ప్రకాశముగా) అమ్మా! విద్యుల్లతా! (ఇంచుకయూరకుండి) మాటాడుట లేదు. తాకిపిలిచెద. సతీ! సుదర్శనప్రియా!

వి—(తటాలునలేచి యిటునిటుజూచి) ఎవరు?

సుం—అమ్మా! నేను సుందరిని.

వి—ఇంత జాగేలచేసితివి? (తనలో) ఓహో! మత్ప్రియుఁడరుదెంచెఁ గాబోలు. నే నెట్లుంటినోగదా! నామనంబు పుష్పబాణక్షతమై సోలిపోయినది.

సుం—అమ్మా! ఇక్కడకుఁ జాలదూరమున్నది. శరీరంబు మిగుల డస్సిపోయినది.

వి—ఎప్పటికిని నాకారోగ్యము నాకాయుష్యమని పలుకుచుందువు. కాని యితరులెట్లైననేమి? నీవువెళ్ళినకార్యము నుడువవైతివి.

సుం—దేవీ! నీమనఃప్రియుండింతకుఁ బూర్వమే సౌధాంతమునకుఁ బోయెనని యు నిప్పుడీవార్తనంపుటకు వీలులేదనియుఁ దద్గృహ మందుండు మందారమాలయనునామెచెప్పి తానును నావెంట భవత్సందర్శనార్థ మిదిగో వచ్చియున్నది.

వి—(నిట్టూర్పువిడిచి) అబ్బబ్బా! నీమాటలునాకుఁ దలనొప్పిఁగలిగించుచున్నవి. నేఁజెప్పినదేమి ? నీసేతయేమి ? (రోషముతో) చాలు ! ఛి, ఛీ.

గీ॥ కఠినురాలవు దుర్మార్గ ♦ కాంతవీవు
మదన తాపంబుఁదెలియని ♦ మందమతివి
విరహిణీజన కష్టంబు ♦ సరసులెరుఁగు
గొడ్డురాలది యెరుఁగునా ♦ బిడ్డకుట్టు.

మం—(తనలో) ఓహో! ఈమె మహాతీవ్రముగ మాటలాడుచున్నదికాన నీమెను శాంతింప జేయవలెను. (ప్రకాశముగా) దేవీ! ఆలోపంబంతయు నాచేఁజేయఁబడినది తల్లీ! నన్నుఁదిట్టుము నేను మూఢురాలను. అదియుంగాక నంధురాలను. ఇదే నమస్కరించుచుంటిని నేఁ జేసినపాపముగాని నీచెలి చేసిన దోసమేమియు లేదు. అమ్మా!

గీ॥ బిడ్డ లోపంబు దల్లియుఁ ♦ బ్రియముతోడఁ
జూచి పోషింప వలెనను ♦ సుద్దులెఱుఁగు
దేవి వీవనివేఁడెద ♦ దివ్యమతిని
శాంతభావంబు దాల్పుము ♦ జలజనయన.

వి—(తనలో) నీమె సంభాషణంబులు మృదుమధురంబుగనున్నవి. అంధురాలనని జెప్పినదే? అయిన నీమెవృత్తాంతమరసెద. నాయుత్సాహమంతయు నిరర్థకంబుఁజేయ నీమె నన్నేవియో మాటలనోదార్చుచుండె,(ప్రకాశముగా) సఖీ! సుందరీ? ఈమెయెవరు.

మం—అమ్మా? నేనేచెప్పెద. నాపేరు మందారమాల, రాజవంశసంజాతను. అంధురాలను, దిక్కులేనిదానను; నేటికి నీనాధుండు దిక్కయి నన్ను బోషించుచుండె, నీవు నన్నట్లేచూడవలయును. దైవము నన్నిట్లుసృజించినాడు. (అనియేడ్పునభినయించి) నేనేమి

చేయుదానను. భవదీయ దివ్యసుందరము గన్నులారఁ జూచు భాగ్యంబు లేకపోయెగదా? మీదాంపత్యవిశేషంబు నేఁజూడను గదా? నాపురాకృత ప్రారబ్ధము. తల్లీ! నీవేదిక్కు. భవదీయ హృదయారవింద మరంద పానోన్ముఖ భృంగరాజగు సుదర్శను, నిదే పంపుదానను. ఆగ్రహింపకుము.

వి—అమ్మా? మందారమాలా? ఇటురమ్ము. నానాథుని బంపిదవా? నిశ్చయమా? నీకువచ్చిన భయమెంతమాత్రమును లేదు,నిన్ను మదీయ సోదరివలె భావించెద.

మం—అట్లు నాచేత నీచేయి వేయుము.

వి—అటులనే జేసెద, నీకరం బిటుదెమ్ము. (చేయివైచును)

మం—అమ్మా? నేఁబోయివచ్చెద.

వి—ఇప్పు డొంటరిగఁబోఁగలుఁగుదువా?

మం—జాత్యంధులకు మార్గంబును, మూగలకు యుక్తియుఁ బుట్టుకతోడ నేగలుఁగును. నేఁబోయెద. (నిష్క్రమించును)

వి—చెలీ? సుందరీ? (కరము బట్టుకొని) నావాక్యంబులు నీకుఁగడు కోపకారణంబు లయ్యెనని దలంచెద. సఖీ! నేనేదియో యాలాపంబున వేరు మనంబు గలదాననై నిన్నట్లంటిని గాని వేరుకాదు. నీవు కోపమొందిన నాజీవితంబు నిష్ప్రయోజనంబు. కావున నంధురాలనైన నామాటలంతగాఁ బాటింపవలను. నీకుఁదెలియని విషయంబు లేమియుండును. సందేహింపకుము,ఆతని నీమె పంపునా ? నిజము చెప్పుము?

సు—తప్పకఁ బంపును. ఆమె మాటలుజూడ నిజమనియేఁ దలంచెద.

వి—సుందరీ? నే నుద్యానవనంబునకు వచ్చునపుడు నాతల్లిగారు శీఘ్రంబున రమ్మని చెప్పినది. చాల నాలస్యమైనది. ఇకఁ బోదమురమ్ము. (నిష్క్రమింతురు.)

రంగము:— [సౌధము సుద, మధు, ప్రవేశింతురు.]

సు—మధుసూదనా! పురుషుల చిత్తంబు మహా చపలమైనదిగదా? ఇంతవరకు సుందరీ జన ముఖావలోకన విముఖుండనై బ్రహ్మచర్యవ్రతము నిష్కాపట్యంబుగ నాచరించు నామనంబు చపలతనొందె. నేను వివాహ వయస్కుండనైతి. నాకా యబలా రత్నంబు గాన్పించినదాది తదీయరూపమే స్వప్నంబునఁగూడ మరపురాదయ్యె. ఇంతయేల? సత్యముగ వరించితిని. ఆమె మనంబుగూడ విచారించ నట్లే తోచుచున్నయది.

చం॥ చిలుకలకొల్కి యంగజుని ♦ చేతి కటారి మిటారి మేల్మి ని
గ్గుల పసమీరు మేను, కడు ♦ గుత్తపుగుబ్బల ముద్దుగుమ్మ తా
నిలువునఁ జూచి నాదు మది ♦ నిబ్బరమున్వడి దొంగిలించె నా
వలపులపంటఁ గూడి జగి ♦ వా తెరఁ గ్రోలెడు భాగ్యమెన్నడో?

మ—సత్యము. సత్యము ఇక్కాలంబున బ్రహ్మచర్యంబన్న కడు వింతగఁ దోచును. క్షత్రియ ధర్మమూర్గాన్వేష తత్పరత్వంబున యుష్మదీయ మనంబతి శ్లాఘ్యంబు. ఇప్పుడు నీమనంబు నాకరించిన విద్యుల్లతా దేవింగూర్చి యొక్క రాయబారంబుఁ బంపిన తద్విషయంబు సమగ్రంబుఁ దెలియంగలదు. అట్లాచరించుట ముఖ్యంబని నాయభిప్రాయము. లేదేని,

చ॥ స్వయముగ నేగి తద్విభుకు ♦ వాంఛను దెల్పియుఁ దల్లిదండ్రికో
భయమది లేక యాయబల ♦ భావమెఱింగి వరింపజెల్లునో
నియతవచో గభీర గుణ ♦ నీరధి! క్షత్రియ వంశధర్మ ము
న్నయపథ వర్తనంబునిది ♦ నవ్యమతిన్దలపోసి చూడగన్.

సు—మధుసూదనా! అది యుచితమార్గమేగాని యామె తండ్రిగారికిఁ బ్రియమిత్రుండగు పూర్ణానందుఁడను నొక మతగురువు గలఁ

డట. ఆతఁడు కడు దుర్మార్గుఁడట. ఆతని వాక్యం బానంతమై నను నామె జనకుఁడు జవదాటఁడని నుడివినది. నా మనంబు మిక్కిలి తత్తర పడుచున్నయది.

సు—అట్లు ముందు మన మందారమాలను సర్వ విషయములను రహస్యంబుగఁ గనుఁగొనిరమ్మని పంపి తరువాత తద్విషయమును విచారించుట మంచిది.

సు—మంచిది. అటులేకానిమ్ము నాయమ యీప్రక్క నుండినది. పిలిచి యీవిషయం బంతయుఁ దెలియఁజేయుము.

మ—(కొంచెమువలికేగి) మందారమాలా! మందారమాలా! (అనిపిలుచును) సుదర్శనా! ఇందెక్కడను గాన్పించదు.

సు—ఓహో! పాపము అంధురాలగు నీమె యెచ్చటికేగనోకదా! ఈ ద్వారంబునఁ జూడుము.

మ—(చూచి) అదిగో! ఇవ్వీధిని కడుభయంబున కఱ్ఱ నొకదానిని నేలఁ దాకించుచు వచ్చుచుండెను.

సు—గానిమ్ము పాపము దైవ మిట్టివారియందు దయావిహీనుఁడై గన్పట్టుచుండె.

(మందారమాల ప్రవేశించును.)

మం—(తనలో) ఇదియే నేనుండు సౌధరాజంబు. (చేతితో దాకుచు) అబ్బా! చేరితిని. శరీరమంతయు నలిఁగిపోయినది. కన్నులు లేకపోయినను మాటలనుబట్టి గ్రహించితిని. నిశ్చయముగ నామె విద్యుల్లతయే! ఈతఁడు సుదర్శనుఁడే. ఇందు సందియ మెంతమాత్రమును లేదు. నేను నిర్భాగ్యురాలను. ఇదియును సందియములేదు. పరిచారికా వృత్తిమాత్రము కడునింద్యమైనది.

చ॥ పరుల యధీనవృత్తికిఁటు ♦ బొల్పడి యిష్టముఁజెందు కార్యముల్
సరగునఁగూర్చి వారలను ♦ సంతసభక్తి వినమ్ర భావతన్
గరము నిరంతరంబుఁ గన ♦ గావలెఁ గొంచెము మించెనేని దు
ర్భరమగు నీచవాక్యతతిఁ ♦ బల్కుదురెంత మహాత్ము లైననున్.

ఇంతకు నాపుట్టినుంగు కాలమాసన్నమైనదని తోచుచుండె. ఏమైనఁగానిమ్ము ఆవిషయ మీతనితోఁ జెప్పకతప్పదు. అదియటుండ నిమ్ము. ఈతనిని స్వాధీనమొనరించుకొను మార్గము నన్వేషించ వలయును. ఇది ముఖ్యము (వినుటనభినయించి) ఇచ్చటనెవరో మాట్లాడు చున్నట్లున్నది. లోపలికేగెద.

సు—మందారమాలా! ఎచ్చటికేగితివి? నీవంధురాలవుగదా? ఒంట రిగ నెక్కడకును బోవలదని జెప్పియుంటిని. ఇటురా! ఇయ్యా సనంబున గూర్చుండుము.

మం—(కూర్చుండి) ఆర్యా! నేనిప్పుడు చాలదూర మేగితిని నీకొక శుభవర్తమానముఁ దెచ్చితిని.

సు—ఏమియది ?

మం—నీవివాహ సంబంధ మైనది.

సు—సత్వరంబున లభించునా ?

మం—అతి శీఘ్రంబునఁ జేకూరును. భవదీయ విషయమును గూర్చి బహు శ్రమనొందితిని. తత్ఫలంబెట్లు పరిణమించునో? నాకు మాత్రము భవదీయరూపలావణ్యంబు దిలకించు భాగ్యము లేదుగదా?

సు—నీపురాకృత కర్మఫలంబీ విధియయ్యెను. చింతింపకుము. నీ యిష్టమువచ్చినట్లు మద్గృహంబున సుఖమునుండుము.

మం—ఆర్యా! నాకింకేర్యాయుం గూడనది యే. ఇంతవరకునట్టి ధైర్యంబు తోడనే యుంటిని. ముందేమగునో తెలియదు.

సు—మందారమాలా! ఇంతకుం బూర్వము జెప్పువిషయము సాంగ మొనర్పవైతివి.

మం—అదియేమి (ఆలోచన నభినయించి) మఱచితిని, స్ఫ్రూహకు వచ్చినది. నేనిప్పుడు వచ్చునది విద్యుల్లతాదేవి కడనుంచి.

సు—(త్వరతో) అట్లనా? విశేషములేమో త్వరగాం జెప్పుము.

మం—నీయందు విభ్రాంతిచే నేమిచెప్పుదును! ఆ విద్యుల్లత

చ॥ తనువుకృశించె మానసము ♦ దత్తరపాటొదవెన్ భయంబు చే
తను గడువిభ్రమంబడరె ♦ దర్పకుండ్రోల్పకయింత లేక తా
ధనువునం బుష్పబాణమిడి ♦ ధైర్యముపీడగం గొట్టుచుండె నం
చును వచియించెనాకు నవ ♦ శోభనగాత్రిరహస్య పద్ధతిన్.

సు—(తనలో) నిశ్చయము, ఆమె నన్నే వరించినది. అచ్చటికీయంధురా లెట్లరిగెను. కనుంగొనియెద (ప్రకాశముగా) మందారమాలా! అచ్చటి కెందులకుం బోతివి?

మం—చూచిరాగలందులకు.

సు—నీకేమి తెలియును?

మం—ఆర్యా! మఱచితిని. మఱచితిని. నాతప్పు క్షమింపుడు నన్ను రక్షింపుము. ఈసంతోషంబున నేనద్దాని జెప్పుట మరచితిని.

సు—భయమేమియును లేదు నెమ్మదిగం జెప్పుము.

మం—షుందామె చెలికత్తెయగు సుందరిని భవద్దర్శనార్థము పంపినది. ఆసమయమందు మీరు సౌధాంతర మందుండిరి.

అందువలన నేఁబోయి యానారీరత్నంబుతో మాటలాడివచ్చితిని. నిన్నొకపరివచ్చి యామెను యుష్మద్భావములతో బద్ధకంఠము గలదానిగాఁ జేయుమనియనేకవిధంబులఁ బ్రార్థించె. సత్వరంబునఁబొండు. కొంచెమాగి నేను రాఁగలను.

సు—(తనలో) ఇదియంతయు నిజమైన సందర్భముగ నే దోచుచున్నది. అయినను తొందరపడరాదు. నారీమణుల చిత్తములు చంచలములు. సౌధాంతరమునకుంబోయి మిత్రులతో నాలోచించి, యేగుట యుత్తమము. ఈమె, యిక్కడనేయుండుట మంచిది. (ప్రకాశముగా) మందారమాలా! పోయివచ్చెద నీవిచ్చటనే యుండుము. మిత్రమారమ్ము. (నిష్క్రమించును.) తెరపడును.

మం—[తనలో] ఈతండెట్టులైన నామెను వివాహమాడుట నిజము. నాకు దుర్గతి మాత్రము దప్పదు. ఇందునకుపాయమేమియుఁ గన్పట్టలేదు. జ్ఞప్తికివచ్చినది. గురువు దుర్మార్గుడని వచించినది. కారణమేమైయుండును. ఒకవేళ నాతనికేమైన నీమెయందు ప్రేమయుండెనా! దేశికుండుగదా! అయిననేమి! జగన్మోహన సదృశరూపలావణ్యవతులగు నారీమణుల కుచకచౌన్నత్యాదుల గాంచి యెవరు భ్రాంతి నొందకుందురు? మున్ను మునిశ్రేష్ఠుండగు విశ్వామిత్రుండే మేనకకు దాసుఁడయ్యెను. ఇప్పటివారలఁ జెప్పనేల? అయిన నాతని యభిప్రాయమును దెలిసికొనియెద. అతని యాశ్రమమునకుఁ బోయెద. (కొంచెముచడచి వినట నభినయించి) ఎవరో శంకరధ్యానానంద నిమగ్నమానసులై యిటు వచ్చుచున్నారు. పలుకరించిచూచెద.

(పూర్ణానందుఁడు, పాడుచు ప్రవేశించును.)

శ్లో॥ శశిశేఖర శివదాయక ♦ హరిశాయక గిరిజా
ప్రియనాయక గజకంధర ♦ గజదానవహరణా

కనకాసన కనకాంబర ♦ భవనాశనశరణం
శివశంకర శివశంకర ♦ హర మే హర దురితం,

మందా—స్వామీ! నమస్కారము. మీనామం బెయ్యది?

పూ—అభీష్టావాప్తిరస్తు! శుద్ధనిర్గుణపరబ్రహ్మ దర్శనపూర్ణానంద స్వామి యందురు.

మం—(తనలో) పూర్ణానందస్వామియనుచున్నాడే! నేఁగాంచఁబోవు పూర్ణానందుం డితఁడేనా? (ప్రకాశముగా) స్వామీ? విద్యుల్లతాదేవి గురువగు పూర్ణానందులవారు మీరేనా ?

పూ—నేనే? నీవామె నెఱుఁగుదువు,

మం—నేనిప్పుడు భవదీయసందర్శనార్థము బయలు దేరితిని. ఆడఁబోయిన తీర్థ మెదురేగు దెంచినయట్లు తమదర్శనంబు నాకిక్కడనే లభించినందులకు నేనెంతయో కృతార్థురాలను.

పూ— నీపేరేమి? నాదర్శనంబునకుఁ గారణ మేమి?

మం—నన్ను మందారమాలయందురు. నేనంధురాలను, సుదర్శనభవనమందువాసము. విద్యుల్లతా పరిచారికను. నాస్థితియంతయు మిగుల దుస్థితి. మదీయాభిప్రాయ మెఱింగించుటకు సంశయించుచుంటిని.

పూ—సంశయింపఁబనిలేదు. సవిస్తరంబుగ నీయుద్దేశమునంతయు వెల్లడింపుము.

మం— స్వామీ! భవదీయశిష్యురాలు విద్యుల్లత సుదర్శనుని వరించినది. ఆ వృత్తాంతంబు తమ కెఱిఁగింప నూహించితిని.

పూ—(ఆశ్చర్యముతో) వరించెనా ? నిశ్చయముగా వరించెనా ? చూచితివా బాల్యమునుంచి కడుప్రేమతో సర్వవిద్యాకుశలి

నిగాఁజేసియున్న నాకు మాటమాత్రమైనను జెప్పకయే ఇక్కా ర్యంబునకుఁ గడంగినది ? (తనలో) ఏమీ? నాకర్మము, నేటి వరకు నానారీ శిరోరత్నంబుపై నాకుగలమోహము, అవర్ణ్య ముగదా? ఇంక బతుకుటెట్లు. అకటా !

సీ॥ తిలకంబు కొనగోరఁ ♦ దీరుగాదిద్దిన
మొగముపై ముంగురుల్ ♦ మురువుసూప
ఘనమైన వజ్రాల ♦ కమ్మలకాంతులు
జెక్కుటద్దములపై ♦ నిక్కియాడ
సిగులొప్పు ముంజేత ♦ మెరుగారు బంగారు
సన్నగాజుల సొంపు ♦ చిన్నెలొలుక
ననుమానమైదోచి ♦ యలరు లేనడుమునఁ
గెంపు లొడ్డాణంబు ♦ నింపుగులుక

గీ॥ రమ్యమగు నీలపుంబట్టు ♦ రవికఁదొడఁగి
జిలుగు సరిగంచు చెంగావి ♦ చీరఁగట్టి
పసిఁడి బొమ్మన ♦ బొలుపొందు పద్మనేత్రిఁ
గాగలించుట యికనాకుఁ ♦ గలుఁగఁబోదు.

(తనలో) ఇదియేమి మనంబుస్మృతిఁదప్పిపోయినది. కామాంధు లకు యుక్తాయుక్త శూన్యమనుమాట నిశ్చయము. (ప్రకాశ ముగా) మందారమాలా? కానిమ్ము. మనము చేయునది యేమి యునులేదు. అయినను విచారించెద.

మం—స్వామీ? అట్లుగాదు, ఇంకముందు నాయందాతనికి విరోధము సంభవించుననియు, నాభుక్తికిఁ గష్టంబుఁగలుఁగుననియుఁ దలఁ చెద,

పూ—(తనలో) మనమిప్పుడేమిచెప్పినను నీమెచేయులాగునఁగనఁబడు చుండెను. వారిరువురకు వేరుభావంబు గలుఁగునట్లు నేదేని

యుపాయంబూహింప వలయును, దీనికి మేలొనరింప వలయు, (ప్రకాశముగా) మానినీ? నేనొక్క యుపాయంబుఁ జెప్పెద, నీవట్లు చేయుదు నంటివేని.

మం—అవశ్యము, తమయాజ్ఞ నిర్వహించుదానను. ఇందునకు సందియం బెంతమాత్రమును వలదు.

చ॥ గురువరులాజ్ఞ మూర్ధమునఁ ♦ గోర్కెనుదాల్చితదీయకార్యముల్
భరమని త్రోసివేయకిటు ♦ భవ్యమతిన్వడిఁ గూర్పఁదత్కృపా
కరులయి శిష్యులెప్పుడిలఁ ♦ గామ్యపదార్థసులభ్యమానస
స్థిరగుణసమ్మతాతిశయ ♦ శీలురెయౌదురు దేశికోత్తమా?

పూ—అట్లయిన, నే ననేక మంత్ర తంత్రౌషధీక్రియల యందుఁ గడు సమర్థుఁడను, ఏదియో యుక్తి సాధించి యాతని నీవశము గను జగన్మోహన ప్రకాశరూపయగు నావిద్యుల్లతనుమద్వశవర్తిగను జేసెద. ఈవిషయంబన్య జనదురూహ్యమైన దానిగ భవదీయ హృదయ పేటికయందుంచి బంధింపుము సుమా!

మం—చిత్తము చిత్తము.

పూ— నేనిప్పుడు విద్యుల్లతామందిరంబునకుఁ బోవుచుంటిని. రేపటి దినమీవిషయమునుగూర్చి ప్రయత్నంబుఁ జేసెద పోయివచ్చెద.

(పైభ్యానమునుజేయును నిష్క్రమించును)

మం—ఇంతవరకు మదీయ కుతూహలంబు నిర్విఘ్నంబుగ నెఱవేరినది. భవిష్యత్కాలంబునగూడ నిట్లే కాఁగలదని తలంచెద. ఈతనిని మాత్రము విడిచిపెట్టఁగూడదు. కొంచెమాఁగి విద్యుల్లతా మందిరంబునకుఁబోయి లాలితవాక్యంబులఁ గాలంబు గడపెద. మెల్లగ గృహంబునఁ బ్రవేశించెద. (నిష్క్రమించును)

రంగము : ఉద్యానవనము

(విద్యుల్లతాదేవి, సుందరి ప్రవేశము)

వి—చెలీ! సుందరీ! ఇంతవరకు నామనోహరుండు రాకపోవుటకు గతం బేమైయుండును? మందారమాల యాసుదర్శన సుదర్శనం బొనరించి మదీయ దీనాలాపంబుల నుడివియుండునా! నుడివి యుండిన నింత యాలస్యంబేల యొనరించును! లేక నామనం బింకను బరీక్షింపఁ దలఁచెనా! కాదు. కాదు. ఆమెయంధురాలు గదా! పోవుట యాలస్యమై యుండునని సందేహించెద.

సుం—దేవీ! ఆమెయరిగి చాలసేపైనది.

విద్యు—అట్లైనఁ గారణంబేమి? ముందు మద్వరమానాంగీకారము నైనను సూచింపలేదే! (కొంచెమాగి) తనయంగీకార విధానంబు తెలియఁజేయు టసహ్యముగఁదోచెనా! చెలీ! ఇవ్విరహావస్థను సహించుట కడు దుర్భరముగా నుండెను.

సీ॥ పల్లవావళిచేత ♦ భాసిల్లు బూఁబాన్పు
గడువేడియై మేను ♦ గాల్పఁదొడఁగె
శ్రవణపేయముజెంను ♦ భ్రమర ఝుంకారంబు
వినుటకు రోతగా వెలయుచుండె
నవగాహనార్హమై ♦ యలరు గొజ్జఁగినీరు
బురద నీటివిధంబు ♦ బరగుచుండె
శైత్యోపచారార్థ ♦ చందన పంకంబు
దుర్గంధ పంకమై ♦ తోచుచుండె

గీ॥ రత్నమయ భూషణాల్పెద్ద ♦ రాళ్ళపగిది
బుద్ధికి నసహ్యమైయొప్పెఁ ♦ బువ్వుబోడి
కలవుదీరంగ నాతని ♦ గన్నులారఁ
గాంచుభాగ్యంబు నాకిప్డు ♦ గలదొ లేదొ,

సుం-దేవీ! తొందరింపవలదు. ఆతఁడింక రాగలండని దోఁచుచున్నయది.

వి—చెలీ! నీవు జ్యోతిషవిద్యయం దాఱితేరినదానవుగదా? ఇవ్విషయ మింతవరకు నాకు స్ఫురించినదికాదు. ఆతనిపేరన్న నాకే కాదుసుమా! పలుకరించు ప్రతిమానబింబవదనలకైనను నిష్ట యుండును.

మ॥ తరుణీ! మన్మథమన్మథుండని భువిన్ • దారుణ్య కాంతామణుల్
దరహాసాంచిత విద్రుమాధరసుధా ♦ ద్రవ్యంబు గట్నంబుగా
పరలన్నేయఁగలజ్జనొంది మదివ ♦ హ్వాయించుఁ గీర్తించుచున్
బరమధ్యాన నిమీలితాక్షులయియుం ♦ బద్మాక్షు వింపగే

సుం—ఎవరో యిటువచ్చుచున్నట్లున్నది.

వి—(ఆతురతతో) సుందరీ! చూడుము. చూడుము. సత్వరంబున, నేనెట్లుంటిని. నాముఖచంద్రుఁడేమైన కళంకమునొందెనా? కురులు సవరింపుము. ఎదురుగానేగుము. ముందీశయ్య సవరింపుము. పాదప్రక్షాళనార్థ మాపన్నీటితో బంగారుచెంబులఁదెచ్చి ముందుంచుము. చందనాది సుగంధద్రవ్యంబుల నాయత్తపరుపుము. పచ్చనిమూకులతోఁగూడిన యాతియ్య ద్రాక్షా ఫలగుళుచ్ఛంబులఁగొన్నిటిఁ గైకొని సువర్ణతామరపాకునందుంచుము. నా మనంబదురుచున్నయది. దేహంబు జలకించుచున్నది. ఇంక నీయిష్టము.

సుం— అట్లేచేసెద. భూషణాలంకృతవుగమ్ము.

పూర్ణా—(శ్లోకమును పాడుచు ప్రవేశించును)

శ్లో॥ శరణాగత భరణాదృత కరుణామృతజలధే
శరణం తవచరణం శివభవసంసృతివసతే

వరచిన్మయ జగదామయ భిషగానత మవతాత్
శివశంకర శివశంకర హర మేహర దురితం.

పూ—(తనలో) ఎన్నిపర్యాయంబులు భగవంతునిగూర్చి ధ్యానించిన నేమి ప్రయోజనము! ఒకపరి యా విద్యుల్లతా ప్రభాసయగు నా విద్యుల్లతా ధరామృతమానుటకంటె సౌఖ్యమొసంగునది ప్రపంచమందింకొక్కటియుండెనా? ఎట్లయిన నావనితామణి కౌఁగిట నిముసకాలము స్వస్థతజెందితినేని కడుధన్యుఁడను. కానిమ్ము. "యత్నేన కార్యసిద్ధిస్స్యాత్" అనునట్లు ప్రయత్నము జేయవలెగదా? చూచెద, నాపాటమాత్రము విడువఁగూడదు. సమీపించి మాట్లాడెద. (పాడుచు సమీపించును.)

సుంద—(దృష్టినిగిడించిచూచి) అమ్మా! స్వామి పూర్ణానందులవారు వచ్చుచున్నారు.

వి—(భయము నభినయించి) ఓహో! నాసంతోషమంతయు నేలఁ గలసినదే. ఈగుట్టంతయు రట్టగునుగాబోలు. ఇతఁడు కడు దుర్మార్గుఁడు. ఏమిచేయుదును చెలీ! నీవిదియంతయు నాతనితోఁ జెప్పవలదుసుమా!

సుం—నన్నన్యథా భావించితివా!

వి—లేదు. లేదు.

సుం—అట్లయిన నిట్లనెదవేల?

వి—(పూర్ణానందునిచూచి) గురువర్యా! నమస్కారము. ఇయ్యాసన మధిష్టింపుడు.

పూ—సుమంగలీభవ. అబ్బా! దేహము మిగుల శ్రమనొందినది.

వి—స్వామీ! శ్రమగలుగునంతటి యవసరము తమకేమున్నది.

పూ—(అటునిటుఁజూచి) ఈప్రదేశమంతయు నేటిదినంబునఁ బరిమళ వస్తుసముదాయ యుతంబై మహాశృంగారంబుగఁ దోఁచుచుండె కారణంబేమైయుండును!

వి—(తనలో) మదిలో నెంతయో సోదిలోనంతయే, యనునట్లు పరిణమించినది. అయినను నేఁజేయునది ధర్మవిరుద్ధ మేమియును లేదు. మద్వంశాచారము. ఇందుఁ దప్పేమి? (ప్రకాశముగా) విలాసార్థ మిట్లొనర్చితిమి.

పూ—ఆహా!

మ॥ ఘనకారుణ్యకటాక్ష వీక్షణసుధా ♦ కల్లోలవారాశివై
ననువీక్షింపఁగఁగోరి యీవిధమున ♦ న్గాపించినావో? సుద
ర్శనునేఁ గోరియలంకరించితివొ యా ♦ శాబద్ధచిత్తంబున
న్వనజాతేక్షణ! చెప్పుమీ వెస సుహృ ♦ ద్భావంబు రంజిల్లగన్

వి—(సందేహ మభినయించి) సుదర్శనవిలాసార్థమే ?

పూ—నాయభిప్రాయమును దిరస్కరించితివా ?

వి—యుష్మత్సదుద్దేశ్యము దిరస్కరింపలేదు,

పూ—నాయభిప్రాయము ద్వివిధముగానుండెనా? ప్రథమమునుండియు భవదధరసుధారస పానాసక్తిని జరించుచునేయుండినది. నేటివరకును మరచియుండలేదు. మత్కుతూహలంబును భిన్నమొనరింపక కౌఁగిటఁగారవింపుము.

వి—(తనలో) ఈతనికెన్నివిధంబులఁ జెప్పినను దుర్బుద్ధి వీడకయుండెను. ఇప్పుడు కోపభావంబు సూచించినగాని యీతనిబుద్ధి మరల్చుటకు వీలులేదు, (ప్రకాశముగా) గురూత్తమా! శిష్యురాలనై మెలంగు నీవిద్యుల్లతను దమపుత్రికగ భావింపవలెనుగాని యిట్టి

వెడఁగుమాటలఁ బ్రసంగించుట మీవంటివిద్వాంసులకుఁ గడు హేయమైనది. ఇంతటినుండియు మీయధర్మ వాక్యములఁ బూర్తిగమాని మదీయసత్కారంబులంగొని దయసేయుడు.

పూ—సతీ ! విద్యుల్లతా! నన్ను మూఢునిగ భావించియుంటివా? భవత్సౌందర్యంబు నన్నీవిధంబునఁ జేయుచుండె.

మ॥ సరసస్వాంతముతోడ నిన్ను సుకళా ♦ సారస్వతిం జేసి యి
ద్ధరణి న్గౌరవమొందు నన్నిపుడు నిం ♦ దావాక్యముల్ బల్కి యి
క్కరణిన్దూరుటఁ జెల్లునా? కనుము ని ♦ ష్కాపట్య చిత్తంబుతో
గురుకట్నంబు నొసంగుమో సతి భవ ♦ త్సోకస్తన ద్వంద్వమున్.

వి—దేశికోత్తమా ! యోగ్యమగు విద్యాబుద్ధుల నలరారఁ జేసి నేటికి మోహావేశ పరవశుఁడవై యిట్లుబల్కుట న్యాయంబుగాదు. తమ శిష్యురాలనైన నాచే నీతినెరుంగుట పాడిగాదు. ఇదియంతయుఁ ద్వదీయ శ్రేయంబునకు భంగకరంబు. మీవంటి మహనీయ చరిత్రులే యీరీతి వచింప లోకంబునం దెంతయో దుర్మార్గవృత్తి ప్రబలుట నిస్సందేహము.

ఉ॥ కావున మీరలీవచన ♦ కల్మషవృత్తిని గట్టిపెట్టి వేఁ
బోవుట ధర్మమయ్య బుధ ♦ పూజిత! నీ వెరుగంగరాని యే
వావులు లేవు లోకమున ♦ వాసిఁజరింపుము మోహవల్లికా
భావసమూలఖండన వి ♦ భాసమనీష మెలంగి యింతటన్.

పూ—చిగురుబోడీ! గ్రుడ్డువచ్చి పిల్లనెక్కిరించిన పగిది నీవచనంబులు సకలధర్మతత్వవేదినగు నాయెదుట నుడువుటంత సమంజసముగాదు. నీవంటియబలాలలామల బాహులతాబంధనంబులచేతను, పాలుగారెడు నిద్దంపుచెక్కిళుల ముద్దాడుటచేతను, గలుగు సుఖపారవశ్యముకంటె జగంబునందింకొక సౌఖ్యంబు గానంబడదు, ఇదియే బ్రహ్మానందము. ఇంతకంటె మహాత్మరానంద

మింకొకటి లేదు, అస్మదీయస్మరసంతాపంబు భవదీయాధర పీయూషరసపానంబిడి శమింపఁజేయుము. మాఱుబలుకవలదు.

(అని పట్టుకొన బోవును.)

వి—(ప్రక్కకుబోయి తనలో) నిశ్చయముగా నీతనికి. దుర్బుద్ధి యంకురించి, వృద్ధినొందినది, ఈతని, వంచించు, విధానమీసమయమందేదియును, గాన్పింపకున్నది. నాపాతివ్రత్యమే, యిందునకు సమర్థంబగును. ధృష్టమతింబూని, నీతనిందటిమెద (ప్రకాశముగా) కుటిలహృదయా! దూరముగనుండుము. నామాటలు హాస్యంబులని తలంచితివా? జగన్మోహనుఁడగు సుదర్శన సార్వభౌమునకు నాశరీరంబు దానంబొసంగితి. తత్కారణంబు నన్యపురుష స్వాధీనమైనపదార్థమునాశించుట వెఱ్ఱితనము. సింహము పాలిటి సొమ్ము గోమాయువు గోరుచందమున యాతనిసొమ్ము నీవపేక్షించుట హాస్యాస్పదంబు. ఇఁకటనైన నీయాశయమువీడి మర్యాదం గాపాడుకొనుము. విద్యోపదేశికుడవగుటచే శాంతత్వంబునఁ జెప్పితిని తప్పుక్షమింపుము. ఆశ్రమమార్గాన్వేషుఁడవు గమ్ము. భువనములయందు సత్కీర్తిధ్వజంబు స్థాపింపుము. దేశికశిఖామణివై మెలంగుము. నన్నుగటాక్షింపుము. శృంగార భూయిష్ఠలగు యువతీజనంబుల దేహచ్ఛాయంగాంచి విభ్రాంతి నొందకుము. ఇదే నమస్కరించుచున్నదానను.

పూ—పూబోడీ జ్వాలనొనరించి, యుదకంబుఁ బ్రోక్షించులాగు నీవాక్యంబులు బహువిచిత్రంబులుగఁ దోచుచుండె. బాల్యము నుంచియు, జాతుర్యవాచాలత్వంబునఁ గడుశ్రేష్ఠురాలవని నేనెఱుంగుదును. అయినఁగానిమ్ము. నీకన్యాత్వంబునకు భంగంబుఁ గలుఁగకుండ నేనాశీర్వదించెదను. నాయభీష్టంబు నెఱవేర్పుము. మున్ను పరాశరుఁడు దాశకన్యకకు వరమొసంగలేదా? దద

భీష్టంబును నెఱవేర్చుకొనలేదా? అంతకంటె మనమెక్కుడు వారలమా? శీఘ్రంబు గానిమ్ము. (అని కౌగలించుకొనబోవును)

వి—(తనలో) ఈతఁ డూరకుండునట్లు గాన్పించుటలేదు. శాంత వాక్యములచే నీతఁడుగట్టుపడునట్లు గన్పడదు. కఠినముగ మం దలించెద (ప్రకాశముగా కోపముతో) ఆగుమాగుము! దురాత్మా! నన్నంటితివేని ఘోరపాపంబు సంభవించును. మం త్రింబులకుఁ జింతకాయలు రాలుననుకొంటివా? మురాలాపం బులఁ గట్టిపెట్టుము. నీయద్వైతజ్ఞానమంతయు నిట్టులేయుం డునుగాబోలు. నీవంటి దుర్మార్గవిద్యాపారంగతులు గనుకనే పురాణములయందట్టివారిలవారిసి ప్రసిద్ధికెక్కినారు. ఇంకనీ యధికప్రసంగములు వినఁజాలము. లేదేని, మత్కోపానలజ్వా లలంబడి మ్రగ్గెదవు. నేనిశ్చలచిత్తనై యాసుదర్శన పదపద్మం బుల సేవించుదానను. వేరువిధంబున భావింపవలదు. దుర్బుద్ధి వీడి వచ్చినత్రోవ నేగుము.

పూ—విద్యుల్లతాద్యుతీ తిరస్కార లావణ్యతనులతా! విద్యుల్లతా! భవదీయ కఠినాలాపంబులు మత్కంఠంబునఁ బుష్పమాలలై యలంకరించు చున్నయవి. నామనంబు మఱింత సంతసంబు నొందుచున్నయది, ఈసమయమందు నీవు ఛీ, ఛీ, యన్నను అదినాకు గౌరవవాక్యముగనే మోదంబుఁగలుఁగజేయును.

గీ॥ సరసచాతుర్యశృంగార ♦ సార మెఱిఁగి
కుచ గుళుచ్ఛంబులను మించి ♦ కులుకుచుండు
పూర్ణచంద్రాస్య నీవంటి ♦ పువ్వుఁబోండ్ల
పాద తాడనంబదినాకుఁ ♦ బాపహరము.

వి—నీకంతకంతకుఁబిచ్చి యెత్తుచున్నయది. యుక్తాయుక్తవివేకశూన్యుఁ డవై, వర్తించుచుంటివి. నేనింకసహించను. మరలిపొమ్ము. (అని యావలికేగును)

పూ—(సమీపించి) అరవిందాననా? నామనంబు మహాచలనంబొందు చున్నయది. ఇంక నేనిలువలేను. బలాత్కారంబుగనైనను త్వదీయ సుధాధరంబానకున్న ప్రాణంబులు సున్న. నన్నీనిముసంబు నందుం గనిగలించి రక్షించుభారము నీయందున్నది. ఇటురమ్ము. ఒక్కముద్దిడుము. భవదీయ దోర్లతా మధ్యంబునం జేర్చియీ సేనుని నొక్కమ్మడి యెత్తుము (పట్టుకొనబోవును)

వి—దురాత్మా? కామాంధకారబంధురనయనా? మిథ్యావాదన తత్పరా? ఛీ! పాపిష్ఠుఁడా? దుర్మదోన్మత్త మానసంబునం గన్ను మిన్నెఱుంగక, నిరంతర గీర్వాణీచరణకమలధ్యాసినగు నన్నిట్లు బలాత్కరించుట తగునా? బుద్ధిలేదా? నీయసమాన వేదాంత శాస్త్రార్థవిజ్ఞాన మంతయు నేగుంటదిగఁద్రొక్కితివి! మత్ప్రాణ దయితుండురాఁగలఁడు, నీప్రాణంబులఁ గాపాడుకొనుము. ఆవ లికిఁ బొమ్ము.

(అనికొంచె మావలికేగును)

పూ—కనకలతికా! కురంగేక్షణా! ద్విరదగామినీ! శీఘ్రంబు భవదీయ పదపద్మదాసునిం బ్రోవుము. త్వదీయాలింగన సౌఖ్యపాగవ శ్యనిం జేయుము. (అని చేతులుజాచును)

వి—పూర్ణానందా! నీనామముయొక్క యున్నతంబునుగూడఁ జెఱచు కొంటివే! మూఢా! సాధ్వీమణుల హృదయ తాపంబుచే నశిం చెదవుగాక. ఇటువినుము.

మ॥ శ్రియముప్పొరగ నిత్యసేవలను నా ♦ చేఁగొంచు నెల్లప్పుడే
భయములేక సురక్షితంబుగను నా ♦ భాషా మహాదేవి దు
ర్నయ దుర్మార్గ విచారకారణు నిను ♦ న్వాక్పాశ బంధాన్వితున్
రయమున్జేసెడుగా భవన్మదన సం ♦ తాపంబు క్షీణింపగన్.

పూ—(తలవంచి తనలో) ఇంక నేఁజేయునదేమియును లేదు. అప్పంక జానసురాణియగు నావాణీమహాదేవి స్మరణాన్విత మానసులకు నేనెంతయుఁ గృతజ్ఞుడను. తత్కారణంబున నీమెకు భయకారణ వాక్యంబులఁబల్కి గమనోన్ముఖుండ నయ్యెద. (ప్రకాశముగా)

చ॥ అలికులవేణి నన్నిటుల ♦ నాదరభావముతోడఁ గాంచియు
న్గలుకుచు నాసుదర్శనుని ♦ గూటమిఁగోరితి వింకఁజూడుమీ
బలమగు మత్కుయుక్తులకుఁ ♦ బాల్పడఁజేసి భవన్మనోహరున్
గలఁత నహింపజేసెదను ♦ గాంచు మదీయ మనోవిశేషమున్.

సుం—అమ్మా! ఈతఁడు కడు దుర్మార్గుఁడుగాఁ దోఁచుచుండె. ఇప్పుడా సుదర్శనునితోఁజెప్పి యీతని మదనసంతాప జ్వరంబునకుఁ జికిత్సం జేయించుట మంచిదని దలంచెదను.

పూ—ఓసీ! దుర్మతీ! నేటికి నీకంటికిఁగూడ నంత హీననిగాఁ గన్పట్టు చుంటినా! ఉచ్ఛిష్టపదార్థంబులు బొట్టనిండమెక్కి పొగరెక్కి యున్మాదప్రలాపంబు లాడుచుంటివా! ఈ తాంబూరతో నీతల బ్రద్దలుగొట్టెద (అని కొట్టబోవును)

వి—భవత్ప్రతాపంబుఁ బరిచారికా జనంబులపైకిఁ దటాలునఁ బఱు గెత్తును. ఇంక మోమోటముగట్టిపెట్టి వెడలుము.

పూ—పరిచారికాజనంబులపైకికాదు నీవంటి యంతఃపుర కాంతా మణులపైకినిగూడ పఱుగెత్తును.

సుం—నీపిచ్చివాగుడు మానుము. ఈచెంబుతో మొత్తెద. (అని చెం బుతో మొట్టఁబోవును.)

పూ—వీరింక పెచ్చుపెరిఁగి మాట్లాడుచున్నారు. ఇచ్చటుండు టిక మఱియాదకాదు. మెల్లగజారుట యుచితము. అహా! కామమెం తటి యపకీర్తిపాలుజేయును! ఇదియెవరైననివిన్న నగుబాటు గదా! (అనుచు నిష్క్రమించును.)

వి—సుందరీ! ఇప్పుడెట్టులో నీతనిం దప్పించుకొంటిని. కుతంత్ర కుటిలమతులకెల్ల మొదటివాడు. ఏమేమో మాయలనుబన్ని నా ప్రాణనాథుని నాయొద్దకు రాకుండ జేయునని, మిక్కిలి భయమగుచున్నయది. ఇందున కుపాయమేమి? (ఆలోచననభినయించి కొంచెమాగి) స్ఫురించినది, స్ఫురించినది. చెలీ! నీవు శీఘ్రంబుగ నాతని సన్నిధానంబున కేగి యివ్విషయమంతయుం జెప్పి యాతనిం దోడ్కొనిరమ్ము. నీవచ్చునంతవరకుం సౌధంబునకు బోయి స్నానాదికృత్యంబులం దీర్చుకొని వేచియుండెద. పోవుదమురమ్ము.

సుం—దేవీ! ఎవరోవచ్చుచున్నారు. (చూపునభినయించి) మందారమాలవలెం గన్పట్టుచున్నది.

వి—సరే, కానిమ్ము. మాట్లాడియే,పోదము.

(మందారమాల ప్రవేశించును.)

మం—దేవీ! విద్యుల్లతా! చెలీ! సుందరీ! ఎవరిక్కడనున్నవారు.

సుం—రమ్ము. నేనును, విద్యుల్లతాదేవియును,

మం—అమ్మా! వృద్ధదాననగుటచేం జీనుజిటుక్కనినం బలుకరింప వలసివచ్చును. దేవీ! ఇదే నానమస్కారము.

వి—నమస్కారములకేమి లే.

మం—(తనలో) నాకేదియో మునింగిన లాగున్నది. సరే కానిమ్ము. పూర్ణానందుండుండెగా (ప్రకాశముగా) త్రిలోకసుందరీ! దేవీ! నాయందసూయాభావమును సూచించుచుంటివి. కారణమేమో యూహింపజాలను. తప్పుల క్షమింపుము, కరుణింపుము ఈ యంధురాలిని,

వి—మందారమాలా! ఇటుకూర్చుండుము. (అని కూర్చుండబెట్టును.) అట్లనుకొనుచుంటివేమి? నాబుద్ధి యేదియో యాలోచనయం దుండి, యట్లులంటినికాని, వేరుకాదు. సందేహింపవలదు.

మం—అమ్మా! విద్యుల్లతా! నీకంతటి విచారగ మేల? నాతోఁజెప్పుము. తప్పక జెప్పుము (అని వినుటనభినయించును)

వి—తప్పక చెప్పుమనెదవా? అటులైన వినుము, మధుపాధ్యాయుండు

శా॥ కామార్తుండయి కన్నగానక నను ♦ న్గామించి యేమేమియో
ప్రేమాలాపములన్వచించి మనమున్ ♦ భీభత్సమున్జేయ నో
నామాక్షీ! తదభీష్టసిద్ధిసటు మ ♦ ద్వ్యాగ్బాణసంధానతన్
భీమప్రక్రియఁద్రోసిపుచ్చి ఘనసా ♦ ధ్వీత్వంబు గాపాడితిన్.

ఈవిధమునంతయు నానాథునితోఁజెప్పి వెంటనేదోడ్కొనిరమ్ము.

మం—(ఆతురతతో) అట్లయిన నిప్పుడేగి, యీవిషయంబాతని కెఱిం గించి, తోడ్కొనివచ్చెద సెలవిమ్ము. పోయివచ్చెద.

వి—ఆలసింపక నికార్యంబు నెరవేర్పుము. ఎదురుచూచుచుందుము. సుందరీ! మనముబోవుదముః రమ్ము. మందారమాలా సత్వరంబు బొమ్ము. (నిష్క్రమింతురు)

(రంగము:— సౌధము)

(సుద, మధు, ధర్మపాలుడు, ప్రవేశింతురు)

సు—మిత్రులారా! ఆయరవిందానన యొద్దకు మనము జెప్పక ముందే మందారమాలయేగి యచటి వృత్తాంతమంతయు నరసివచ్చినది.

మధు—ఆవృత్తాంతమేమి?

ధర్మ—అనుకూల భావమునొంది యుండెనా?

సు—మిత్రులారా! సత్వరంబుగ రావలసినదిగాఁజెప్పి పంపెను.

ధ—సఖా! సుదర్శనా! ఆమెయే చెప్పినదా? లేక జననీజనకులు జెప్పి యుండిరా?

మధు—ధర్మపాలా! ఇది చాలమంచియాలోచనఁ జేసితివి, విచారించ దగినవిషయమే!

సు—ఆమెయే యీసందేశమును బుత్తెంచినది.

ధర్మ—అటులైన నీసందర్భమందు మనమెక్కుడు శ్రద్ధ వహింపరాదు. ఏమన,

గీ॥ కామసంతాప హృదయ సం ♦ క్రాంతలయ్యు
తామరసనేత్ర లెప్పుడ ♦ ధైర్య మతిని
యద్భుతంబగువార్తల ♦ నంపి వెనుక
జింతఁగూర్తురు బురుషుల ♦ చిత్తమందు.

సు—మిత్రులారా!అట్లైనమనము జేయవలసిన ప్రయత్నంబూహింపుడు.

మధు—ఇందునకు మదభిప్రాయమేమన, స్వయంవరము.

చ॥ ధరణిని రాజవంశఘున ♦ ధర్మమటంచును బెద్దలెల్ల నో
సరసవచోగభీర బుధ ♦ సన్నుత! పల్కిరిగాన తద్విధిన్
మరువక రమ్మటంచనియు ♦ మానినిబల్కె నటంచు నెంచి స
త్వరముగఁ బోవనొప్పనిది ♦ ధర్మముగాదనఁ జెల్లదేరికిన్.

సు—నామనంబుగూడ నీమార్గమునే ద్రొక్కుచున్నయది.

ధ—అటులైన నామె సమీపంబున కేఁగి యీవిషయంబంతయు సాంగం బుగఁ దెలిసికొనుటమంచిది.

సు—మనము ముగ్వురమును గలసిపోదమురండు.

మధు—(అటునిటుఁజూచి) ఎవరోవచ్చుచున్నారు.

ధర్మ—మిత్రమా! మందారమాలవలెఁ గన్పట్టుచున్నయది.

సు—రానిమ్ము. సఖులారా! ఈమె గుణశ్రేష్ఠిదియైనను మహామేధాసంపన్నురాలవలె నగపడుచున్నయది.

మధు—సుదర్శనా? గుణశ్రేష్ఠివారలకును, మూర్ఖవారలకును తెలివితేటలధికంబుగదా?

(మందారమాల ప్రవేశించును.)

మం—(తనలో) ఆహా! నాకోరిక బహుచక్కగా నెఱవేరుకాలము సమీపించినది. పూర్ణానందునకును, విద్యుల్లతకును, బెద్ద విరోధము సంభవించినది. ఇప్పుడు నేనెట్లుచెప్పిన నట్లుపినుటకు సందేహము లేదు. సరే తరువాత యాలోచించెద, ముందీవిషయంబు సుదర్శనునితోఁ జెప్పుదునా? ఊరకుందునా? కాదు. కాదు. (కొంచమాగి) ఓహో! ఈమాట ముందు మనకక్కఱకువచ్చును. కానను డిపుటయే యుక్తము (వినుటనభినయించి) ఎవరో మాట్లాడుచున్నట్లున్నది. ఎవరువారు.

సు—నేనును, మన్మిత్రులు, మధుసూదన, ధర్మపాలురును?

మం—(ఆతురతతో) ఆర్యా! సుదర్శనా! ఇంతవరకును గంధగజేంద్రగామినియగువిద్యుల్లతయొక్క మందిరంబునకుఁబోలేదా? అయ్యో! ఆయోపారత్నంబీదినంబు మహాశ్రమనొంది వదనారవిందంబున దీనత్వముదోపఁ బదీయచిత్తం బన్యాయత్తంబుగానీయక భవచ్చరణారవింద ధ్యానంబు సేయుచుండె. తరువాతఁ దద్గురుండట పూర్ణానంద నాముండట

శా॥ కామార్తుండయి కన్నుగానక నను ♦ న్గామించి యేమేమియో
ప్రేమాలాపముల న్వచించి మనమున్ ♦ భీభత్సముసేయ నో

వామాక్షీ! తదభీష్టసిద్ధినటు మ ♦ ద్వ్యాగ్యాణ సంధానతన్
భీమప్రక్రియఁ ద్రోసిపుచ్చి ఘన సా ♦ ధ్వీత్వంబు గాపాడితిన్.

అనిచెప్పి భవత్సందర్శనాభిలాషచే మిగులఁ గృశించుచున్నయది.

గీ॥ మోహ విభ్రాంతి నొందిన ♦ పూవుబోండ్ల
స్వాంతములకుఁ బురుషులు వి ♦ శ్రాంతి నిడుట
మిగుల దోసమందురు బుధుల్ ♦ సుగుణచరిత
అదనెఱుంగుచు విత్తుట ♦ యనువుగాదె.

కావున శీఘ్ర గమనంబు యోగ్యంబు (తనలో) వీరరిగినఁగాని పూర్ణానందుని దర్శించుటకు వీలులేదు. కానిమ్ము చూతము.

ధ—మందారమాలా! నీనేత్రంబులు గొంచెమేమైనఁ గనఁబడునా!

మం—అయ్యా! ఎంతలెండు. లీలగా నగపడును.

సుం—మందారమాలా! నీవు చాలాశ్రమ పడుచుంటివి.

మం—ఇంతకంటె నాకేమ్కుడేమున్నది. ఆర్యా! కాలంబతిక్రమించు చున్నది.

సు—మేము పోయివచ్చెదము నీవిక్కడనేయుండుము.

(నిష్క్రమించెదరు తెరపడును)

తృతీయాంకము.

——(0)——

# సుదర్శనీయము

## చతుర్థాంకము

—(o)—

రంగము గృహము

(మదనరంజని ప్రవేశించును)

మదనరంజని—(తనలో) నేటికి సుదర్శనునిఁ గాంచి నాలుగు దినములైనది. నాచాతుర్యమంతయు వ్యర్థమగుచున్నది. నాయందాతనికి భ్రాంతియున్నట్టు గన్పించదు. ఉన్నను లేకపోయినను నామనంబు మాత్రము మిక్కిలి పరితపించు చున్నది. ఆతఁడు విద్యుల్లతను విడువడు, నేనీతనిని విడువను. పూర్ణానందునకుఁగూడ నిన్నటి నుండి కోపం బధికమైనది. ఆతనికింకను బురిఁబెట్టి యౌషధ ప్రయోగమును దెలిసికొనియెద. నాకుఁదోడు గ్రుడ్డిదియొకతె యున్నది. అదియు నాయభిప్రాయము దేకీభవించినదని, యాతని వలనవింటిని. కానిమ్ము ఈసందర్భము ముందుగా మందార మాలకుఁ దెలియకుండ నుండవలెను. (అటునిటుఁజూచి) పూర్ణానందుఁడస్మద్గృహంబునకు విచ్చేసెదనంచుఁ జెప్పెను. ఇంతవరకును రాలేదు. కారణంబెట్లుదెలియును. మఱచితి, మఱచితి నేను శుష్కాంగిననికాని, వెండ్రుకలు నెఱిసినదాననని గాని, నాసికా రహితననిగాని, యాతనితో నెవ్వరైన మదీయసౌందర్యమును గూర్చిముచ్చటించి యుందురా? దానిచే సుదర్శనుండు నన్ను వరింపకుండెనా? (అద్దమును జూచుచు) నేనుధరించిన కపటవేస

మంతయు నిజముగ నేతోఁచుచున్నది. ఈవిషయ మెవరు తెలిసికొనఁ గలరు? (ముక్కు పట్టుకొని) ముక్కు మాత్రము గొంచెముకదలు చున్నది. దీనిని సవరించిన నేమియుభయము లేదు. (సవరించును) (వినుటనభినయించి) ఎవరో వచ్చుచున్నారు. రానిమ్ము.

(పూర్ణానందుఁడు, శశిశేఖర యను శ్లోకమును బాడుచు ప్రవేశించును)

పూ—(తనలో) ఇదియే మదనరంజని గృహమని తోఁచుచున్నది. ఇదిగో మదరంజని. దీనిమూలమున సుదర్శనునికి మోసము వాటిల్లఁ జేయవలెను. గ్రుడ్డిదిమాత్రమింత చతురతఁ గలిఁగినది కాదు. ఇది యిదివ రెందరినో బుట్టఁబెట్టినముండ.

మద—స్వామీ? వందనము. ఇయ్యాసనంబున నాసీనులగుఁడు.

పూ—మనోవాంఛా ఫలసిద్ధిరస్తు. (కూర్చుండును) మదనరంజనీ? చూచి తివా! కాలమహిమ! విద్యుల్లత దుండగము!

మద—(ఆశ్చర్యముతో) అయ్యా! ఏమిచేసినది? ఏమిచేసినది? ఇది వఱకు మావిద్యుల్లత మావిద్యుల్లతయని కడుమురియుచుంటిరి గదా! ఇప్పుడిట్లు పలుకుచుంటిరేమి? స్వామీ! సెలవిండు.

పూ—ఏమిచెప్పుదును నేటికి నలుబది సంవత్సరముల కాడుదానిచేఁ బరాభవమును బొందవలెనని నాజాతకమున వ్రాసిపెట్టియున్నది కాఁబోలు వినుము.

మ॥ గురుభావంబది శేలఁగల్పి, మది జం ♦ కున్గొంత లేకుండ యా
యరవిందాస్య! మదీయ మోహావచనం ♦ బవ్యాహత ప్రజ్ఞ చే
విరసంబొందఁగఁజేసి గౌరవ హర ♦ ద్వ్యత్తిన్మహా జాణయై
లెటిమె న్గొసెడు దూరమేగు వరకు ♦ న్దర్పంబుతోఁ గామినీ.

మద——అట్లాగ నరించిన మీరెట్లూరకుంటిరి; నావంటివాడైన మరలి వచ్చునా! గతించినదానికి వగచుట లాభమేమి మీచేతనేది యేని ప్రతిక్రియ యుండినఁజూడుడు. లేదేని యూరకుండుట మంచిది. (తనలో) ఈయనకుఁ బూర్ణంబుగఁ బాగవేయవలెను. (ప్రకాశముగా) స్వామీ!

సీ॥ చదివించినారుగా ♦ సత్సాహితీగద్య
పద్యప్రబంధాళి ♦ హృద్యమలర
బోధించినారుగా ♦ బుధజన సంస్తూయ
నవరసాలంకార ♦ నాటకముల
ప్రకటించినారుగా ♦ ప్రమద రసాస్థాన
సంగీత శాస్త్రంబు ♦ స్వాంతమలర
వినుపించినారుగా ♦ వివిధశాస్త్రార్థ ర
హస్య సందర్భము ♦ లవియు నెలమి

గీ॥ మధురశైలినిబోధించి ♦ మగువ నిటులఁ
బ్రౌఢఁజేయంగ ఫలమిట్లు ♦ బడెఁ దవిల్లె
నేమిచెప్పుదు గురువరా! ♦ యింతిగుణము
పెద్దలను దూరుటెంతయో ♦ పెంకెతనము.

పూ——(తనలో) ఈమదనరంజనికూడ పిచ్చిముండయే! దీని తెలివి తెల్ల వారినట్లేయున్నది లోకంబు నందెక్కడనైనను జదివినవారలు దుర్మార్గవృత్తుల నంగీకరింతురా! నిశ్చయముగ విదుషీమణియన్న విద్యుల్లతయే! మదీయ విద్యావైశద్యమంతయు నామోహ నాంగి సౌందర్యం బాకర్షించుటచే విగతజ్ఞానుండనై యీరీతి పౌరుషంబునూనవలసి వచ్చినది. కాని, యాతన్వి నేనెన్నివిధంబుల సంస్తుతించినను ప్రయోజనము లేకపోయె. ఆదివ్యవిలాసినీ శిరోవతంసమును దలంచినపుడెల్ల దేహంబు

బులకరింపక మానదు. మోహంబతిశయింపకఁ దప్పదు [ప్రకాశముగా] మదనమంజరీ? నన్నుఁ బరిహాసమాడుచుంటివా? ఇటు వినుము.

గీ॥ లోహకనచంబుదాల్చి ని ♦ ర్మోహమెసగ
నడవినెట్టులో నాకలి ♦ నడచుకొనుచుఁ
దిరుఁగు తపసులచిత్తంబు ♦ స్మరునికొల్వుఁ
జేరఁజేయును సుదతుల ♦ చెలువమగయ

మద—స్వామీ? తమను నేఁ బరిహాసించుదాననా? తమకరుణకుఁ బాత్రురాలను దైవసమానులగు మీవాక్య తిరస్కారిణినై వర్తించినదని నాకెంతయో లజ్జగానుండి యట్లంటినిగాని వేరు కాదు, ఈశిష్యురాలినన్యథా భావించవలదు.

పూ—సరే! కానిమ్ము ఏదియెట్లున్నను, మదీయ ప్రతిజ్ఞనెరవేర్చవలయునుగదా? మదనమంజరీ? విద్యుల్లతయందు విరోధమును నీయందు ప్రేమయు నాతనికి గలుఁగునట్లొక యౌషధంబు నీకొసంగెద. దానినినీచాతుర్య విశేషముచే నెట్లయిన నాతని గర్భంబునఁబడ వేయుము

మద—చిత్తము నాకది యొకపెద్దపనియా? నిమిషమాత్రంబునఁ జేయఁగలను.

పూ—అట్లైన మనమీ పత్తన బాహ్య ప్రదేశమందలి పర్వత ప్రాంతంబునకుఁబోవలెను, అక్కడ మచ్ఛిష్యులగు మందుల వాండ్లు వసించి యనేకవిధంబులగు నౌషధంబులఁ జేయుచుందురు, ఈ యౌషధంబు వారలయొద్ద సిద్ధముగానుండును అద్దానిఁ గైకొని వచ్చెదము. బయలుదేరుము. శకునముజూడుము.

మద—ఆర్యా? సిద్ధముగానుంటిని, (అటునిటుఁజూచి) ఎవరో వచ్చుచున్నారు, (పరికించిచూచి) అయ్యా! మందారమాల వచ్చుచున్నది, విషయమును దెలిసికొని పోవుదము.

పూ—(తనలో) ఇదియుఁగూడ నిట్టియాలోచనయందేయున్నది. పాపము, అంధురాలిది కానిమ్ము ఎట్లైన నాతఁడు స్మృతిలేక పడియుండుటే ప్రధానము.

మందారమాల (ప్రవేశించును)

మందా—మదనరంజనీ! మదనరంజనీ!

మద—మందారమాలా! రమ్ము

మందా—(సమీపించి ఆలోచన నభినయించి) ఇంకెవ్వరో యుండినట్లున్నది.

మద—స్వామి పూర్ణానందులవారు.

మం—అయ్యా! నమోనమః

పూ—శుభం, శుభం, ఏమిసమాచారము,

మం—మరేమియులేదు ఇంతకుఁబూర్వము సుదర్శనాదులా విద్యుల్లతాంతికమునకుఁ బోవుదుమని జెప్పి వెళ్లిరి, వారటు వెడలిన తోడనే, నేనిట్లువచ్చితిని.

పూ—(భయమునభినయించి తనలో)మదీయసందర్భమునంతయు రామయాతనితోఁ జెప్పకమానదు, లోకమందు నాకుండు మర్యాద హరించకమానదు, అతఁడుకడు సమర్థుండు, నాకేదియో కీడు సంభవింపక తప్పదు,

చ॥ కులుకుమెఱుంగు గబ్బిచను ♦ గుబ్బలపొంకము తోఁబ్రదీప్తలా
చెలువల సోయగంబుగని ♦ చిత్తము దత్తరమొంద మోహమన్
జలనిధిమగ్నులై తుదకుఁ ♦ జంద్రసమానవిభాసకీర్తి స
త్ఫలమదినీటఁగల్పి కడుఁ ♦ బాముల చేఁగృశియించుఁ బూరుషుల్.

కావున నస్మదీయవిజ్ఞాన మంతయు వఘూమోహంబు చేఁగదా నిందాస్పదమైనది. ముందు చేయవలసిన కార్యము మాత్రము వదలుట యుచితముగాదు (ప్రకాశముగా) మందార మాలా? మేమా ప్రయత్నమందే యుంటిమి.

మం—నన్నుఁగూడ నిచ్చటనే యుండమనెదరా?

పూ—పాపము! నీవంధురాలవు నగప్రాంతములకుఁ బోవలెను, చాల ప్రయాస నొందెదవు, కాన మదనరంజనియు నేనుం బోయి యికార్యంబుసాధించుకొనివచ్చెదము.నీవచ్చట నేయుండుము.

మం—మంచిది అట్లే చేయుదును,స్వామీ! నన్ను మఱువకుడు మెల్లగ భవనంబునకుఁ జేరెద, (నిష్క్రమించును)

పూ—మదనరంజనీ! మనముగూడ వేగంబునం బోవలయును, లెమ్ము. (చెవులోఁ జెప్పును) బంగారునాణెములను గొన్నిగైకొనుము.

మం—సిద్ధము జేసితిని.

పూ—నా వెంట రమ్ము. (నిష్క్రమింతురు తెరపడును)

(రంగము : మందులనమ్ము కోయవాండ్రు)

రాముఁడు, రంగడు, పెరుమాళ్లు, లచ్చి, ప్రవేశించుచున్నారు.

రాము—ఓరే! రంగా! నిన్న నే బజారుకు పోయినప్పుడు రంగాశార్లు గారు నాబీ, గందకము, సమానంగా పెట్టి వండింది రెండుశేర్ల న్నర వాతరాచ్చం కావాల్నని సెప్పారోయి.

రం—ఈయోగమేడదోయి! రంగాశార్లుగారి స్వంతమల్లేవుందే! బసవ రాజం, సింతామణీ, యిటువంటి గ్రెందాల్లో యెక్కడా కనపల్లే దోయి. పెరుమాళ్లూ! నీకేమైన యీయోగం తెలుస్తుంది! గంగాశార్లుగారు సెప్పినారంట!

పె—నాదగ్గిర యిదికాదుకానీ! యింకొక మాదిరుందోయి అదియేం దంటావా! ఆగు. ఈకలంలో మందు తీసి! సెప్తా! (అని మందు తీయును) ఏంవోయి యినుు.

ఉ॥ సున్నము సూదిరాయి మటి ♦ సుద్దను పెద్దపాటేలు కొమ్ముతో
దిన్నగనూరి గుగ్గిళము ♦ తీట కసిందయు నాబిముక్కలో
గన్న సమానభాగముగ ♦ నాగ్గిని వండిన వాతరాచ్ఛమై
సెన్నలరారటంచు మును సెన్నడుసెప్పెను రాస యోగమున్.

ఒసే! లచ్చీ! ఆకలంలో మందిటదే!

లచ్చి—నూరన్నీ! నూరన్నీ! మెత్తగ నలగలా!

పెరు—నూర్నారు. ఎంతసేసీ! లంజా! నూరో.

లచ్చి—(మిఱ్ఱిచూచి) మాటల్బాగారానీ! నూరుతుండా.

రాము—పెరుమాళ్ళూ! నాదగ్గిర యొకయోగముందోయి! అదేం టంటే! సెగలకి సాలమంచిదట. అదిగాక యిప్పుడెక్కడ నూసినా! సెగలే జాస్తోయి! సదవనా! వింటా.

పెరు— సదవు వింటా! యీలుగావుంటే సేద్దాం.

రాము—లచ్చీ! నీవుకాడా యినుము. యెప్పటికైనా తెలిసుంటే మంచిది.

ఉ॥ సప్పిడి మైలతుత్తమును ♦ సైందవమున్వొలిగార భాగమున్
ఉప్పియు స్వేతమూలమిటు ♦ నూడగ కానుగ యాపగింజలో

పప్పులు దిప్పతీగ సరి ♦ బాగము మర్దనసేసి మాతరల్
సప్పనకట్టి వాడ సెగ ♦ సంకటముల్ పుటమాగు బీముడా!

పె—ఈయోగం భలేగావుందోయి అయితేయేంగాని వాడాలి. వాస్తే గాని సర్కు తెలవదు.

రం—ఓరేయి! సూడంకోయి, అమ్మోరు అయ్యోర్లొస్తున్నారు. మందులకే ననుకుంటా

రా— రానీ! తన్నాదియ్యి అందరికీ బాగాలేనోయి.

పె—అట్టాగే! లచ్చి! అమ్మోర్ని నువ్వడుగు, అయ్యోర్ని మేమడ్గుతాం. నూస్టం మానంకోయి (అనియూరకుందురు)

(పూర్ణానందుఁడు, మదనరంజనిఁ ప్రవేశము)

మందులవాళ్లందరు లేచి దొరగారూ! గురుస్వాములు! దండమండీ దండమండీ, కూసోండీ యీపీటమీాద.

లచ్చి—అమ్మోరోయి! దండం దండం కూసోండీ యీగోటిమీాద (కూర్చుందురు)

రం—ఏంవోయి! అయ్యోర్తో నేమాట్లాడుతానోయి,

రాము—మనకంటె పెరుమాళ్లు మాటకారోయి. అతణ్ణిపలకనీ. ఏంవోయి పెరుమాళ్లూ, నీవే మాటాడాలి మాకంటె నువ్వు సదువుకున్నావుగా

పెరు—సరే! అట్టాగేలే! సామీా! ఏంపనిమీాద యేంచేశారు?

పూ—వరే పెరుమాళ్లూ? ఏ మేమియౌషధంబులు సిద్ధముగానున్నవిరా?

పెరు—సామోరికి ఏంకావలటాం! ఉన్నోటికియిబ్బంది లేదు యిత్తాం,

ఫూ—(తనలో) ఈవిషయము వీండ్లకుఁ దెలియనీయఁగూడదు (ప్రకాశముగా) ఇప్పుడు తయారుగానున్నయౌషధంబులేమి?

పెరు—సామీ? సంధిపాతం, వాతరాచ్ఛం, ఖాలకూటం, అబ్బరకం, లోహం మండూరం, వాతనొప్పులకు బాండన, కలిఖాలు, ఇంగిలీకమైనం, చిలాజిత్తు, కాంతం, చున్నం, తెగడ సూర్ణం తేగసూర్ణం జిల్లేడుసూర్ణం ఇంకాపెట్టుమందు మర్లుమందు దావకాలు కసాయాలు ఆసవాలు అరిష్టాలు వుబ్బుకు దగ్గుకు అనేకం ఉన్నవి.

మన—మనకుఁగావలసినవి సిద్ధముగ నేయున్నవి. నాయదృష్టము ఫలించినట్లుగనే యున్నది.

ఫూ—వీటిధరలెట్లున్నవిరా?

పెరు—అయ్యా! సొట్టు మొత్తంమీాద తులం పదియేనుగూపాయలు యిత్తండామండి మీాయిట్టం.

ఫూ—ఇవియన్నియు మాకెందులకు?

పె—కావల్చిన వరకే పుచ్చుకోండి.

ఫూ—మందులను దెప్పింపుము?

పె—ఒరే! రామా! రంగా! సంచుల్దెచ్చి కుమ్మరించండోయి,

(కుమ్మరించును)

ఫూ—మదనమంజరీ! మనకుఁగావలసినవి, చూడుము.

మ—తమకుఁ దెలియని దేమున్నది?

ఫూ—పెరుమాళ్లూ? కాలకూట మొకతులము, మర్లుమందు రెండుతులములును దెమ్ము.

పె—సామీ! అవి, యాదరకురావు. తులం ముప్పైవరాలు, అవి దావకాలు కాని, కుప్పెకట్లుకాదు,

పూ—నరేకానిమ్మా. మేమువచ్చిచాలసేపైనది, త్వరగానిచ్చి పంపుము.
పె—పైకమెంచండి.
పూ—మదనరంజనీ! క్రయధన మొసంగుము.
మ—ఒరే! అబ్బీ! ధనము గైకొనుము. (అనియిచ్చును)
పె—(మాదులసీసాలు చేతికిచ్చి) నీళ్లతోయివ్వాలమ్మోయి,
మ—లచ్చీ! (రహస్యముగా) దీనికి విరుగుడేమి?
లచ్మి—సున్నంనీళ్లు, యిస్తే దిగుతుంది.
మద—స్వామీ? మనమింక వెళ్లుదమురండు. (నిష్క్రమించును)
పె—రాండూ! రంగా! మీ బాగాలియిగో! (అనియిచ్చును)
రాము—(లెక్కపెట్టుకొని) ఐదేసితక్కువిచ్చినావేరా?
పె—మాట్టాడినందుకు కమీసనోయి,
రా—రంగా! మాట్టాటంనేర్చుకుంటే మంచిదే! యికనుంచి నేర్చుకో వాలోయి, గుడిసెల్లోకి పోదాంలెండే. యివ్వాల భలే లాభం వోయి. (నిష్క్రమింతురు తెర పడును)

—♦ రంగము విద్యుల్లతాభవనము ♦—

(సుదర్శనుడు, మధు, ధర్మపాలురు, ప్రవేశించును)

సు—మిత్రులారా! మదీయాగమనం బెఱింగించు వా రొక్కరును గానంబడరయ్యె. ఇందున కుపాయంబెట్లు?

మ—మిత్రమా! సుదర్శనా!

గీ॥ మనలగాంచుచు ముదమున ♦ మగువయొక తె
ద్వారముననుండి లోనికిఁ ♦ దరలియిపుడు
మందహాసంబు ముఖమునఁ ♦ గందళింప
మరల నేతెంచుచుండె న ♦ మందగతిని.

ధ—అట్లైన మన యాగమనంబు దెలిసియే యుండును.

(సుందరి ప్రవేశము)

సుం—(తనలో) వీరుముగ్వురెవ్వరై యుండవచ్చును! సుదర్శనుండైన తోడ్కొని రమ్మనిదేవి యాజ్ఞాపించెను. వీరలఁ బల్కరించు టెట్లు (కొంచెమాగి ప్రకాశముగా) తామెవరు?

మధు—మద్రగజుండు సుదర్శనుండు. మేమిద్దఱమతని సోదరులము.

సుం—సుదర్శనరాజా! ఇదేవందనము. తదీయ సోదరులారా! అభివాదనములు. మిమ్ము నాదేవియగు విద్యుల్లత యుద్యానవనాంతర ద్రాక్షాగుళుచ్ఛప శోభితంబగు నెలరాతిన్నెకడకుఁ దోడ్కొనివచ్చి యందుపవసింపఁ జేయుమని యుత్తరువొసంగెను. సత్వరంబున సదయులై దయసేయుడు.

(నిష్క్రమింతురు తెరపడును.)

రంగము : ఉద్యానవనము.

(సుద, మధు, ధర్మ, సుందరి, ప్రవేశింతురు.)

సుం—ఆర్యులారా! ఇదే చంద్రకాంత శిలావేదిక. దీనియందు సుఖాసీనులుగమ్ము.

సు—సోదరులారా! ఇటుగూర్చుండుడు. (కూర్చుందురు) సుందరీ! విద్యుల్లతాదేవి యెచ్చటుండెను.

సుం—ఇంతవరకును భవద్దర్శనార్థము వేచియుండి యొక్క క్షణకాలము క్రిందటనే సౌధంబునకు వెళ్ళియుండెను. నేఁబోయి తమరాక నెఱింగించెద సెలవిమ్ము. (నిష్క్రమించును)

సు—సఖులారా! ఈవిషయమందేమియును సందియమున్నట్లు దోచుట లేదు.

ధ—సఖా! సుదర్శనా! మేము భవనంబునకుఁ బోయెదము. సర్వవిష యములను సక్రమంబుగ నెఱింగి సత్వరంబున రమ్ము.

సు—మీరుకూడయుండి తద్విషయంబు నాలోచించుట యుచితము.

మధు—ఏకాంతస్థలమున మేముండు టనుచితము. ఉభయస్వేఛ్ఛా లాపంబులకు నిరోధకారణులమగుదుము. కాన భవద్దర్శనంబు నిరీక్షించుచు సౌధంబున వేచియుందుము (నిష్క్రమింతురు)

(విద్యుల్లతయు, సుందరియు, ప్రవేశింతురు)

వి—సుందరీ! నామనంబున సిగ్గును భయంబును బొడముచున్నవి. ఈ రసాలముపొంతనిలఁబడి యాదివ్యసుందర వదనారవిందుని వీక్షించెదను. నేనతని సమీపంబునకు రాసిగ్గగుచున్నది. చెలీ! (చిరునగవున) ముందుగా నేనెట్లాతనిఁ బల్కరింతును! అట్టుబలు కరించిన లజ్జావిరహితయని దలంచునేమోగదా? నీవుబోయి యాతనితో నన్ను బలుకరించుమని చెప్పెదవా?

సుం—దేవీ! నీకింతభయమేల? సిగ్గుగలదానివైనదియు లేనిదియు మొన్నటిదినమునఁబంపిన వర్తమానంబువలనఁదెలియదా? ఈ చాతుర్యంబునకేమిగాని శీఘ్రంబునమాట్లాడించుము.

వి—నన్నెత్తిపొడుచుటకు నీకు సమయము దొరకినదికాబోలు సఖీ? మెల్లగ నన్నటుదీసికొనిపొమ్ము.

సుం—చేయిపట్టుకొని ఇటునడువుము. నీమనోహరుండావేదికయం దున్నవాడు.

వి—( సిగ్గుతో )సుందరీ! ఆరాజమందారున కర్ఘ్యపాద్యాదు లొసంగతివా?

సుద—(తనలో) ఈమెను కొంచెము గంభీరముగ మాట్లాడించి చూచెద (ప్రకాశముగా) సుందరీ! నీదేవి నన్నురావించిన గతంబేమైయుండు!

సుం—అమ్మా! నీప్రియుండేమియో యనుచుండెను. ప్రత్యుత్తరం బొసంగుము నేఁబోయి శయ్యాగేహంబలంకరించెద.

వి—చెలీ! ఎక్కడికిఁబోదువు. నన్నుపరిహాసమాడుచుంటివా!

సుద—ఇందుఁ బరిహాసమేమియును లేదు.

మ॥ సుదతీ! దాపఁగనేల యిప్పుడు భవ ♦ చ్ఛిద్ధాంతసందేహమీ
వదనాబ్జాంచిత మాధురీరస లస ♦ ద్వాగ్బిందుసందోహ సం
పదనూన ప్రియభావదోహద మన ♦ స్మందస్మితాయత్తవై
ముదమార న్దెలియంగఁజేయుమిటు సం ♦ పూర్ణార్థసంసక్తితోన్.

వి—(చిరునగవున దలవంచి) నాసందేహ మేమియును లేదు. భవత్సందర్శనమునకై నామనంబు గుతూహలమొందెను. అకారణంబున వార్తనంపియుంటిని.

సు—దర్శనమాత్రంబునకే వార్తనంపి రావించుట మిగుల వింతగానున్నయది. అటులైననేనేగెద.

వి—(తనలో) ఓహో! ఈయన సంభాషణ మహాచిత్రంబుగానుండె. నామనంబుఁ బరీక్షింపఁదలచెనా! లేక నావలననే నాకోర్కె వినవలయుననియా యిట్లుబల్కుట! లేదేని పూర్ణాసందుఁడే మైన యుపదేశించియుండెనా! అయినం గనుంగొనియెద. (ప్రకాశముగా) మనోహరా! మీరాడుమాటలు భావగర్భితములుగఁ దోచుచున్నయవి. నాకెంతమాత్రమును దెలియుట లేదు.

సుద—బింబాధరీ! నేనెవరి మనోహరుఁడను! ఎవరిని మోసముజేసితిని!

విద్యు—సుందరీ! వినుచుంటివా! ఎట్లుబల్కుచుండెనో! అబ్బా! ఈశ్లేషల నిడఁదీయుట నాకుఁ దెలియదు. నీవేమైన మాట్లాడఁ గలుఁగుదువా!

సుం—అమ్మా! నావలనంగాదు. ఆశ్లేషలు గ్లిషలు నాకుఁదెలియవు. నేఁబోవలెను. పోదునా?

వి—ఎచ్చటకు?

సుం—కర్పూర చందన తాంబూలాది సుగంధద్రవ్యంబులు దెచ్చుటకు.

విద్యు—నిన్నెవ్వరు దెమ్మనిరి.

సుద—తద్ద్రవ్యంబు లవసరంబులేదా?

విద్యు—హృదయేశ్వరా!మీవాక్యంబు లతిచాతుర్యరసబిందువుల వెదఁ జల్లుచున్నయవి! నేనేమి తప్పానరించితిని?

చ॥ నను భవదీయ దాసిగ మ ♦ నంబున నెంచి ప్రియంబుతో సదా
యనుపమ దివ్యతేజ వద ♦ నాంబుజ! కౌగిటఁ గారవించి నీ
ఘనమగు భోగభాగ్య సుఖ ♦ కారణ సంకలితాంతరంగినై
యనయము భాసిలన్గని కృ ♦ తార్థ మనోరథఁజేసి యేలుమీ!

సుద—(తనలో) ఇమ్మత్తకాశిని చిత్తంబెంత పలుచఁబారెను. ఈమె పలుకులయందును ముఖమందును నిశ్చయముగ సాధ్వీలక్షణంబు లప్రయత్నంబుగనే బయల్పడుచున్నయవి. అయినను మదభిప్రాయంబెఱిగించుట కింకఁగొంత కాలయాపనంబు జేసెద (ప్రకాశముగా) తన్వీ!

చ॥ వినుమిటునాడుమాట నిను ♦ వేఁడుకలాడుటఁగాదు మున్నునీ
వనినటుఁ దల్లిదండ్రు లిది ♦ యాత్మనుమెచ్చి రె! దేశికుండు దా

ఘనమని యెంచెనే? యిదియు ♦ గల్పనలేక యెఱుంగఁజెప్పు మో
వనజముఖీ శిరోమణి య ♦ వారితధర్మనిరూఢబుద్ధితోఁ.

వి—(తనలో) ఆహా! ఏమీ! ఈతని చాతురీమహిమ! ఇప్పుడు నేనేవి
ధమునఁ దెలుపుదును. జననీ జనకులెఱుంగరని చెప్పినట్లైన
మత్కరగ్రహణంబున కితఁడు సందేహించునేమో? ఆమో
దించితిరన యనృతమాడినదాననగుదును. ఈసంధిని విడదీసి
యాతని మనస్సంతృప్తి యొనర్చుటెట్లు? అయిన సత్యమునే
వచించుట సర్వశ్రేయము కానిమ్ము (ప్రకాశముగా) చిత్తేశ్వరా!

మ॥ అరయన్ ధర్మవివేకశీలనయి నే ♦ నత్యంతమోదంబునన్
స్థిర సత్యవ్రతకీర్తికాముని నినుం ♦ బ్రేమింప నద్దాని నె
వ్వరు కాదంచు వచింతురో! యధిప! నే ♦ వారిచ్చఁ గైకొందునా
తరుణాంభోజదళాయతాక్ష! వరమున్ ♦ దథ్యంబు జేకూర్పుమా.

సు—ఈవిషయంబు మున్ను నేనుద్యానవనంబున బోధింపలేదా!
అప్పుడద్దానిం దిరస్కరించితివిగదా! ఇప్పుడు నేనెట్లొప్పు
కొందును? గురుతిరస్కారంబొనరించితివనియుఁగూడఁ దెలియఁ
జేసితివి. తిరస్కారమొనరించితివో! లేక, హితమొనరించితివో!
ఎట్లు తెలియును! ఇపుడు నేనంగీకరించుట ధర్మవ్యతిరిక్తమై
యుండునేమో! యోచింపవలెను.

వి—నాథా! తమహితోపదేశంబును దిరస్కరించితిననుకుంటిరా! అందు
నకు దేవీ సన్నిధానంబునందుంచిన పుష్పమాలికయే మీ
యంతరాత్మకు సాక్ష్యంబొసంగఁగలదు. నిశ్చయముగ గురుతిర
స్కారంబొనరించితిననుటకు సర్వాణీ మహాదేవియే రెండవ
సాక్షి, ఆపూర్ణానందుఁడు నన్నెన్నియోవిధంబుల శ్రమఁబెట్టు
చుండ నాబాధానివారణోపాయం బేమియునుదోచక యాసరస్వతీ
దేవిం బ్రార్థింప భక్తపరాధీనురాలగుటచే నన్ను వేగంబున

రక్షించెను. అంతె నాతఁడు నన్ను సుదర్శనస్పర్శసహితంజేసె దనని శపథంబొనరించి యేగినాఁడు. మద్దేవిసాక్షిగ నిందసత్యం బెంతమాత్రంబును లేదు.

(ఆకసమున)

చ॥ నిజముకుమార! యీపలుకు ♦ నిక్కము నిక్క మునిక్కమయ్య! యీ
గజసమయాన, సాధ్వి, తిజ ♦ గన్నుత సద్గుణశీల, చిత్తసీ
రజమునని న్నెగోరుచు వి ♦ రాజిలుచున్నది కానసింక నీ
గజిబిజిమాని, యీమెఁగొని ♦ ఖ్యాతివహింపుము రాజకోటిలోన్.

సుద—(వినుట నభినయించి తనలో) ఈ లేమవల్కునదెల్ల యదార్థముగఁ గన్పట్టుచున్నయది, అణుమాత్రమసత్యమున్నట్లు దోచుటలేదు. అశరీరవాణియు నిట్లేబల్కెను, నామనంబుగూడ, విరహావస్థం జిక్కుచున్నయది. నాగాంభీర్యమంతయు మెల్లగ సన్నగిల్లుచున్నది. ఇంక నితరవిషయంబుల మాటాడ మనసొప్పుటలేదు. (ప్రకాశముగా) కలహంసయానా! ఇంతవరకు సీతో ముచ్చటించుటంతయు, నాకుఁ దెలియదు. అందుఁగొన్ని మాత్రము సొలకువచేఁ బ్రసంగించితిని, లోపంబులున్న క్షమింపుడు (ఆశ్చర్యముతో) ఇదియేమి! నా దేహంబంతయు నొకవిధంబగు తాపంబు నొందుచుండె, దాహంబతిశయించు చుండె!

వి—చెలీ! సుందరీ! ఈసుకుమార శరీరునకు ద్రాక్షాఫలంబులొసంగుము.

సుద—ద్రాక్షాఫలంబులవలనఁ దృప్తి కానేరదు.

విద్యు—మఱియెద్దాని నొసంగ మనెదరు! తేనియ నొసఁగుమనెదరా!

సుద—మోవితేనియ నొసంగుము,

విద్యు—(సిగ్గునభినయించి) అదినాకుఁ దెలియదు (తనలో) ఆహా! మదను డెంతటి చతురుండు, నాయందాతని కిప్పటికి దయ కలిఁగినది

కాబోలు కానిమ్ము. ఇప్పుడు నేనుకొంచెముగట్టిగా మాట్లాడ వలయును (ప్రకాశముగా) నాథా! మీరేదియో యొక విధంబున మాటలాడుచున్నట్లున్న దేమి?

సు—గీ॥ కోమలాంగిరో! భవదీయ ♦ కుచముల నెడు
గనకనగసీమమధ్యకుఁ ♦ గదలిపోయి
మరలిరాకుండె నిపుడు నా ♦ మానసంబు
నేమి సేయుదు పూఁబోడి ♦ యెలమినేను.

వి—(తనలో) ఈతఁడు మిక్కిలి మోహాంబుధిని మునింగినాడు. పురుషులను నమ్మరాదు. పాణిగ్రహణంబునుగూర్చి ముచ్చటించి చూచెద. (ప్రకాశముగా) నిత్యసత్యవ్రతా! నన్నర్ధాంగినిగా నొనరుకొనుటకు సుముహూర్తనిర్ణయం బాచరించితిరా!

సుద—ముహూర్తం బేమి! మనోనిశ్చయమే ముఖ్యకర్తవ్యము. భగవన్నియమిత లగ్నంబిప్పుడని యే స్ఫురించుచున్నయది సతీ! మానవ నిర్మితంబైనది శ్రేష్టమా! అదికాదు. నృపులకభీష్టలగ్నమే శుభలగ్నము. అందిది స్వయంవరము. ఇందున కెంతమాత్రమును సందేహింపవలదు. ఇటురమ్ము భవదీయాధర సుధారసంబును గ్రోలనిమ్ము (అని పట్టుకొనబోవును)

వి—(ప్రక్కకుఁదొలఁగి) ఆర్యా! ఆగుమాగుము. పురుషవరులయాత్మ మిగుల చంచలమైనది. తద్బోధలఁ బుష్పంధయమేను లెప్పుడును జిక్కఁగూడదని యొకన్యాయంబుగలదు. సమయానువర్తులై స్వకార్యంబుల నెఱవేర్చుకొని తదనంతరంబా విషయంబునైనను దలంపరు. మీరు నట్టివారిలో నొకరని నాకనుమానము.

సుద—మానినీ! నన్నట్లుదలంపకుము. నిరంతర సత్యవ్రత నిష్ఠా గరిష్ఠుండను. ఇంతవరకును క్షత్రియ విహితమైన బ్రహ

చర్యావ్రత సమాప్తుండను. పితృవాక్య పరిపాలనాదక్షుండను. గృహస్థాశ్రమస్వీకారాపేక్షకుఁడను, ధర్మతత్త్వాన్వేషుండనై వర్తించి, యగణ్యకీర్తినార్జించిన నావంటి రాజపుత్రుండు సమయానువర్తనుఁడా! అధర్మమార్గప్రవర్తనుడా! ముమ్మాటికిట్లు దలంపకుము. రారమ్ము కౌఁగలిమ్ము (అనిపట్టుకొనఁబోవుచు) ఇటువినుము నీవేమదర్ధాంగివి, నాగృహలక్ష్మివి. మత్కులరాజ్య పరిపాలనా మహారాజ్ఞివి, మదీయ వంశాభివృద్ధికి మూలంబవు, ధర్మార్థకామమోక్షంబులకు నిధానంబవు, మనకు నీపంచభూతంబులును, సర్వదేవాత్మకుండగు నీదివాకరుఁడును, సాక్షులు. ఇంతకంటె వేరుదైవములు మనకప్రత్యక్షులు. మత్కరపద్మమందుకొనుము. (అని చేయిచాచును)

సుంద—(తనలో) నేనేమియో యనుకొంటిని, ఇమ్మదవతీలలామ మహాచతురగా నున్నది. తనచిత్తమునందాతనివరించి, సుమారు నాలుగైదురోజులనుండి స్మరతాపపీడితయై కొట్టుకొనుచు, నిప్పుడాతని నెన్నిప్రమాణంబులు జేయించినదో ఆహా! యువిదలెంతటికైనను దగియుందురుగదా?

వి—కామసంతాప సంతప్తులైయుండి యాడువచనంబులు ప్రసిద్ధంబులగునా?

సుద—అట్లైన మదీయాంగుళీయకంబు భవత్కరాంగుళిని ధరింపుము, (అనిధరించును) చంద్రాననా! ఇప్పటికినామనంబు గొంతశాంతి నొందినది.

సుంద—అమ్మా! నేఁబోయి శ్రీగంధాదిసుగంధ ద్రవ్యంబులాయత్తపరచుదునా?

వి—సుందరీ! నీవుచాలతొందరఁ గలదానవుగఁ గన్పట్టుచుంటివి,

సుద—ఇంకనాలస్యమేల యొనరింపవలెను.

విద్యు—(సిగ్గుతో) ఏమిచేయుమనెదరు?

సుద—నీకుఁదెలియనిదేమున్నది,అరుణపల్లవా(కాంతలతా ప్రభాసంబు లగు, నీపువ్వుఁదోఁటరంబుల నడుమ నన్నుఁగూడి,

సీ॥ కడుపారఁజూఁడవే ♦ వడిఁద్రావిమత్తిల్లు
కొందమ తుమ్మెదగుంపు ♦ సొదలువినుమఁ
జిగురాకు జొంపముల్ ♦ చెలువొంద మెక్కెడు
కోకిలారావముల్ ♦ కొసరివినుమఁ
గమలాకరంబులఁ ♦ గామిని సహచర
కలహంస కులరవ ♦ కలనవినుచుఁ
బూఁదుమ్ముఁబొరలుచు ♦ బూఁదావి గుప్పెడు
గమ్మతెమ్మెరగలచే ♦ సొమ్మసిలుచుఁ

గీ॥ కుచగుళుచ్ఛంబులురమున ♦ గుస్తరించి
పల్లవాధర సుధలనా ♦ యుల్లమిపుడు
మదనసుఖపారవశ్య స ♦ మ్మదమునొందు
గతము జేకూర్చువేవేగ ♦ రమ్యగాత్రి.

వి—(సిగ్గు నభినయించి తనలో) దేవీసాక్షిగ నా మనంబుననీతనినేనమ్మి యుంటిని, ముందేమిచేసినను జేయనిమ్ము (ప్రకాశముగా) నాథా! దేవీదర్శనంబున కేగుదమురండు.

సుద—(చిరునగవున) ప్రియసీ! కుసుమాస్త్ర సందర్శనంబు సేయ బోవు చుంటిమిగదా? రారమ్ము (అని చేయిబట్టుకొని) సుందరీ! నీవి చ్చటనే యుండుము (నిష్క్రమింతురు)

సుంద—(తనలో) ఆహా! ఏమీ ఈయాగడము తల్లిదండ్రులకైనను దెలియఁజేయక నాతనివరించి సిగ్గుసుమంతైనను లేక ముసిముసి నగవులునగుచు నాతనిఁదగుల్కొనిపోయెగదా! భళీ! ఈనాఁటి

ధైర్యము. ఇది స్వయంవరమట యిందుఁదప్పులేదట పోనీ! కామో, దేశకత పట్టోనర్చినదనుకొందునుగాక! ఎంతకాలమునుండియో తన్నుఁ గనిపెట్టుకొనియుంటిని గదా! నన్ను విడిచి వెళ్లుట ధర్మమనుకొన్నది కాఁబోలు, సరే కానిమ్ము వీరిద్దఱును నా చేతిలో మెలఁగవలసినవారలే. నేనొంటరిగ నోరూటలూరుచుకొనుచు నోతిదగ్గర నక్కవలె నిక్కెదనుకొంటిని? నేఁబోయి గృహకృత్యంబులయందు మెలంగెద (అటునిటుఁజూచి) కామసుఖ సంతృప్తులై అలకలుసవరించుకొనుచు స్వేదబిందువులు ముత్యంబుల వలె ముఖంబున నలరార నిటువచ్చుచున్నారు. నేఁగదలమెదలక నిలఁబడియుండెద.

(సుదర్శనుఁడు విద్యుల్లతయుఁ బ్రవేశించును)

సుద—సతీ! విద్యుల్లతా! చూచితివా! అప్పారిజాతవృక్షంబున బుష్పాసవంబునకై పెనగులాడు భ్రమరదాంపత్యకలహంబును మరల స్నేహంబును! ఇంతకుముందు మనకుజరిగిన ప్రణయకలహంబు వలెఁగాన్పించుచున్నయది.

విద్యు—(సిగ్గుతో) మనోహరా! గతించినవిషయంబు జ్ఞప్తికిదెచ్చి నన్నింక విరహాబ్ధినిముంపఁ బ్రయత్నించుచుంటివా! (ముఖము ప్రక్కకుద్రిప్పును)

సుద—సతీ! మనోహారీ! ఇటుజూడుము పాపము! ఇంతవరకును నీచెలికత్తె సుందరి యిచ్చటనేయుండినది. సుందరీ ఈ స్రగ్గై వేయకమును నీకంఠంబున ధరించుకొనుము.

సుంద—చిత్తము (ధరించుకొని తనలో) కీడులో మేలని యిదియొక శుభముగఁదలంచెద. ఆమెను వరించునపుడు దన ముద్రుటుంగరమొసంగెను. నన్ను వరించునపుడు కంఠహారంబొసంగెను. ఈ రెంటియందిదియే గొప్పది. అందువలన నాయందుఁగూడ ప్రేమయున్నదని యూహించెద. కానిమ్ము నిజము నిలకడమీఁదబయల్ప

మును. నాశొండ రెందులకు నాథాయని సంభోధించిచూతునా? ఇదిసమయముకాదులే (ప్రకాశముగా) ఆర్యా! నమస్కారము నేనుధన్యురాలను.

(తెరలో)

సీ॥ సూర్యబింబముగాంచ ♦ శోణమై బంధూక
కుసుమంబు విధమున ♦ మసలఁ దొడఁగె
జక్రదంపతులెల్ల ♦ జంట బాయుదుమంచు
వాసయోగ్యస్థలి ♦ కాసవడియె
దూరభూములయందు ♦ దున్నుటలను మాని
సేద్యగాండ్రిండ్లకుఁ ♦ జేరఁ దొడఁగె
బచ్చిక జొంపముల్ ♦ విచ్చలవిడి మేసి
యాలమందలు నింటి ♦ కరుగుచుండె
గీ॥ నరుణ కాంతులు దిక్కుల ♦ నలముకొనియె
బులుఁగుగములెల్లఁ దరులందు ♦ గలకలంబు
సేయుచుండెను బద్మముల్ ♦ చిన్నవోయెఁ
బ్రొద్దుగ్రుంకెను తరియయ్యె ♦ భూధవుండ.

సుద—(వినుట నభినయించి) సతీ! విద్యుల్లతా! మదీయమిత్రుఁడగు ధర్మపాలుఁడిదే వచ్చుచున్నట్లున్నది నేఁబోనలయును మరలఁ గలిసికొనియెద నీవును సౌధంబునకు జనుము. (క్రీగంటఁజూచుచు నిష్క్రమించును)

సుంద—దేవీ! ప్రొద్దు గ్రుంకుచున్నయది మనమకూడ భవనంబున కేగుదము రమ్ము.

విద్యు—చెలీ! సుందరీ! నాప్రియునిగూర్చి ముందుగా నింటఁ బ్రసంగించెదవే మోసుమా!

సుం—అమ్మా విద్యుల్లతా! నాప్రసంగంబెందులకు! మొగముగాంచినఁ జెప్పదా! మీగాళ్ళవాపు అను సామెత ననుసరించి చెదరిన

నీయలకలున్ను, చెక్కుటనుగాంచిన, యేమో జరిగినదని యూహింపవచ్చును. సరేకాని! నీయధరోష్ఠమందలి యంత పెద్ద దంతక్షతము లేమి! నొప్పిపుట్టలేదా! అబ్బా నన్నెట్టివరైన గొఱికిన నేనూరకుందునా!

వి—(సిగ్గుతో) ఇట్టిమాటలచే నన్ను బేలను జేయందలంచితివా?

మం—కాదు. కాదు. కపటబడుచున్నదిగనుక యంటిని. ఇంక పోదము రమ్ము. (నిష్క్రమింతురు)

(అపనీకపడును)

రంగము—ఆశ్రమము

(మదనరంజనీ, పూర్ణానందుడు ప్రవేశింతురు)

పూ——మదనరంజనీ! మనకార్యంబు వెంటనే సమకూడినది నీవు కడు జాగరూకతతో మెలగి యెట్లయినను నీనిని యాతనికిన్య వలయును. మందారమాలకీవిషయంబు జెప్పియుంచుము.

మ—స్వామీ! అట్లే చేసెదను. మీరుమాత్రము విద్యుల్లతను విడిచి పెట్టవలదు, ఈవిషయమెట్లయిన వారి తలిదండ్రులకెఱింగించి చెడగొట్టుటమంచిది. నేనిప్పుడే సుదర్శనుని మందిరంబునకుం బోయెద వందనమాచరించుచున్నదాన. (నిష్క్రమించును)

(మందారమాల ప్రవేశించును)

మం—స్వామీ! ఎచటనుంటిరి? వందనము.

పూ—ఇటురమ్ము. శుభమగుగాక,

మం—అయ్యో! ఏమిచేసితిరి! కాలము మిగులుచున్నయది. ఈదినము సుదర్శనుడు విద్యుల్లతాభవనంబునకు వేంచేసియున్నాడు. మొత్తముమీద యీవేళ స్వయంవరము జరుగునని భావించెద.

పూ——మందారామాలా! నీవు భయపడవలదు. నేఁజేయవలసిన విధు లన్నియు సక్రమముగా మదనరంజని కెఱింగించి యామెను నియమించితి నీవుకూడ నామెతో మాట్లాడుము.

మం——(తనలో) నాకిదియొక తె దాపరమైనది. దీనినెట్లయిన మోస గించి యామందును నేనాతని కుపయోగింపవలెను. నాకు ముఖ్యమైనపనియిది. ఇంతకంటె వేరేమియును లేను. (ప్రకాశ ముగా) స్వామీ! అట్లైన నే శీఘ్రముంబుగాఁబోయి యామె తోఁగలసికొనియెద. పోయెదను.

పూ——నేనును కాలకృత్యంబులు నిర్వర్తించుకొనుట కేగవలసియున్నది. నీవుబోయి కడుజాగరూకతతో నీకార్యంబు నెరవేర్చవలయును సుమా! ఇంకబొమ్ము. (నిష్క్రమింతురు) (తెరపడును)

—* సుదర్శన సౌధము *—

(మందారమాల ప్రవేశించును)

మందా——(తనలో) నాకంటెముందే, మదనరంజని యిక్కడకువచ్చిన దని పూర్ణానందుఁడు చెప్పియుండెను. ఇంతవరకును వచ్చినట్లు గనపడలేదు. ఇదినన్నేమైన మోసగించునా? దీనినికడు మెలకువ తోఁగనిపెట్టి యుండవలె. (కొంచెమాగి ఆలకించుచు) ఎవరో వచ్చుచున్నట్లున్నది.

(మదనరంజని ప్రవేశించును)

మద——మందారమాలా! ఒంటరిగాఁగూరుచుంటి వేమి? ఇంకను సుద ర్శనుండు రాలేదా?

మందా——అమ్మా! మదనరంజనీ! నాకుఁదోడెవ్వరుండిరి. గ్రుడ్డిదానను గదా! నేఁజేయవలసిన పనియేమున్నది. నాజీవము భవదీయహస్త

గతము ననెట్లుజూచెదవో! యని విచారించుచు గూరుచుంటిని. ఇంతవరకాతండు వచ్చియుండలేదు.

మద—మందారమాలా! నీకేమియు భయములేదు. మనసునులన్నియు నింతవరకుఁ జక్కఁగ నెఱవేఱినవి ఇక ముందు కార్యము మాత్రము జరుఁగవలసి యున్నది.

మందా—మదనరంజనీ? రాజుదలంచిన దెబ్బలకుఁగాదువా? యన్నట్లు నీవుదలంచిన కార్యము నెఱవేఱకుండుటయా! సరే నీయిష్టము వచ్చినట్లుఁ జేయుము.

మద—సఖీ! మందారమాలా! మార్గాయాసముచే శరీరము చాల బడలిక నొందినది, నేకొంచెముసేపు విశ్రాంతి గైకొనెదను. సుదర్శనుండు వచ్చినతోడనే లేపుము.

మందా—అమ్మా! అట్లే చేయుదును. కాని నీవుదెచ్చినది మాత్రము భద్రపఱచుము, నేనుగుడ్డిదానను ఇతరులుగ్రహించిన ప్రాణభయంబు గలుగును సుమా!

మదన—అద్దాని నాతలక్రింద నుంచుకొని నిద్రించెద. లోనికింబోవుచుంటిని. (లోపలికిం బోవును)

మం—దీనిగుట్టంతయు గ్రహించితిని. ఇంక భయంబులేదు నేనే ముందా యౌషధంబును బ్రయోగించెదను. ఈమదనరంజని నిద్దురఁ జెందినదో లేదో యనుసంశయంబువొడముచున్నయది. అయినను తెలిసికొనియెద (లేచి తెరదగ్గఱకుబోయి నాలకించుచు) గాఢసుషుప్తినిగాంచి గుఱ్ఱువెట్టుచుండెను. ఒకవేళ సుదర్శనుండిపుడే తెంచిన దీనిని లేవఁగొట్టకయుండవలెను (అని యావలికివచ్చి అతఁడువచ్చునరకు నిచట వేచియుండెద (కొంచెమాగి ఎవరోవచ్చుచున్నారు)

(సుదర్శన, ధర్మపాలురు ప్రవేశింతురు)

ధ—సఖా! భవదభిమతంబు ఫలగ్రాసంబునుబొందెనా?

సుద—మిత్రమా! ధర్మపాలా! కడుసులభముగ ఫలవంతంబయ్యె. ఇటు గూర్చుండుము (అనియిద్దఱును గూరుచుందురు) మధుసూద నుండింతవరకును రాడయ్యె. మందారమాలం బిలచి పానీయంబు దెప్పింపుము.

మందా—అయ్యా! ఎప్పుడువచ్చినారు! మీరాక నేనెఱుంగనుగదా!

ధర్మ—కానిమ్ము. ముందు సుదర్శనునకు మంచినీరుకొంచెము దెచ్చియిమ్ము.

మం—చిత్తము, చిత్తము, ఆలాగేదెచ్చెదను. (అని కొంచెమావలికేగి తనలో) మంచిసమయము సంప్రాప్తించినది. ఇప్పుడా యౌషధ మును సంధించవలెను (లోనికింబోయి మందునుదెచ్చి) ఆర్యా! నీటిని దెచ్చితిని త్రాగుము. (అనియిచ్చును.)

సు—(దీసికొని) (త్రాగుచు) మందారమాలా! ఈ యుదకమంత రుచ్యముగనుండలేదు, కారణమేమి?

మం—అయ్యా! నాకుఁదెలియదు. లోపలనుండునది తెచ్చితిని.

సు—ధర్మపాలా! (అనిగ్లానునుపడవైచి) నాహృదయంబదురుచున్న యది. నోటివెంటమాటవచ్చుటలేదు. నేత్రములు దిగ్భ్రమ నొందుచున్నవి. (అని మూర్ఛిల్లును.)

ధర్మ—(దుఃఖమునభినయించి) అకటకటా! ఇదియేమో! మహా దాశ్చర్యకరముగఁదోచుచుండెను. నాదేహము కంపమొందు చుండె. (కూర్చుని) సుదర్శనా! సుదర్శనా! ప్రాణమిత్రా! మాటాడవేమి? మదీయ సోదరుండు మధుసూదనుఁ దెచ్చ

టుండెనో కదా? అయ్యో! అయ్యో! మందారమాలా! నా ప్రాణమిత్రుండు సుదర్శనుండు మృతినొందినట్లుండెను.

మందా—(దుఃఖముతో) అయ్యో దైవమా! నా బ్రతుకికెట్లు? నేనుం జచ్చిపోయెద. నూతనవైవాహికుఁడు నన్నేలువాఁడు సుందరాకారుఁడు ధర్మదాత యిట్టిమహానుభావునికి యింతలో నిట్టి కష్టము సంభవించినది. నాయనా! ఏమిచేయుదము? ఏమిచేయుదము? అయ్యో! ఆమదనరంజని తలవైపున నేదోయొక పాత్ర వలెనున్నది. దానియందలివి నీళ్ళనుకొని తెచ్చియిచ్చితిని. ఇంతకంటె నేనేమియు నెరుంగను.

మదన—(మేల్కొనితనలో) ఏమిది! ఏదియో గందరగోళము జరుగుచుండెను. (ఈవలికివచ్చి) సుదర్శనునివలెనున్నది. నిస్పృహఁతో బడియుండెను. కారణమేమైయుండును. ఈగ్రుడ్డిముండ యా యౌషధం బిచ్చియుండెనా! (చూచి) నిజముగ నౌషధ ప్రయోగము జేసినది. ఇంక నాగుట్టంతయు బయలుపడును. ప్రస్తుతమాతనికి విరుగుడొసంగుట మంచిది. (సమీపించి) ఆహా! మందారమాలా! ఈనమోహనాకారుఁ డిట్లు పడియుండుటకుఁ గతంబేమి?

మం—మదనరంజనీ! నాకుఁదెలియదు. నీతలవైపున నొక గ్లాసువంటిది కనఁబడెను. దానియందున్నవి మంచినీళ్ళనుకొని తెచ్చియిచ్చితిని. అవి త్రాగినతోడనే యిట్లు పడియుండెను.

మద—ధర్మపాలా! ఆయనకువచ్చిన భయములేదు. ఈయుదకమును కొంచెము గొంతులో వేయుము. (అని నీటినిదెచ్చియిచ్చును)

ధర్మ—(దుఃఖముతో) సుదర్శనా! సుదర్శనా! ఈయుదకమును ద్రాగుము. (అని నోటిలోఁబోయును)

సు (పొరలి కండ్లు తెఱచిచూచి, సోదరా! ధర్మపాలా! దేహము శిథిలమైనటులుండెను (కొంచెమాగి కూర్చుండి) నాకేదియో విషప్రయోగమైనట్లు దోచుచుండెను.

ధర్మ—ఆవిషయమును విచారింతము. అదిగో! మధుసూదనుఁడు వచ్చుచున్నవాఁడు.

మద—[తనలో] ఈతఁడు నిజముగా మధుసూదనుఁడే! నాగుట్టంతయు రట్టగును. ఎట్లయినను నాకుఁ జావుమూడును. ఇదినిశ్చయము.

[మధుసూధనుఁడు ప్రవేశించును]

ధర్మ—అన్నా! మధుసూదనా! సుదర్శనునకు విషప్రయోగమై, మృత్యువాతనుండి తప్పించుకొనెను.

మధు—(సుదర్శనునిసమీపించి చేయిబట్టుకొని) అయ్యో! మిత్రమా! అట్లెల సంభవించెను.

మందా—(తనలో) ముందు నాకుఁజావుమూడును, ఇదియెట్లయినను మదనరంజని నెత్తినఁబెట్టి నేఁదప్పించుకొనవలెను. అటులైన పూర్ణానందునకును దీనికిని ప్రాణమోసము గల్గును. (ప్రకాశముగా) నాయనా! మధుసూదనా! నాకండ్లకగపడక, యీమదనరంజని మంచముకడ నుండుటవలనఁ బానీయమునుకొని దెచ్చియిచ్చితిని.

మధు—సుదర్శనా! ఇప్పుడు సుఖముగానుండెనా?

సుద—సుఖముగనే యుండెను.

మధు—మదనరంజనీ! నీకీవిషరసంబెట్లు లభించెను. నీసమీపముననుండుటకుం గారణమేమి? సవిస్తరంబుగఁ దెలియఁజేయుము.

మదన—(చేతులుసలుపుకొనుచు) అయ్యో! (కొంచమాగి) నేనేమియు నెఱుంగను.

సుద—(మెల్లగా) నీకుభయమేమియును లేదు. సత్యము జెప్పుము.

మధు—నిజముజెప్పుము. లేదేని, చంపివేసెద.

మదన—(తనలో) చెప్పనియెడల నిశ్చయముగాఁ జంపుదురు. అందు వలనఁ బూర్ణానందునిపైనఁ జెప్పి, నాప్రాణంబులుదక్కించుకొని యెద, (ప్రకాశముగా) అయ్యలారా! నాకీపని పూర్ణానందుఁడు జేయుమని చెప్పి, విషరసమొసంగినాడు. ఆకార్యంబునకు నేసమ్మతింపక, యద్దానిని దెచ్చి మంచముక్రింద నునిచి నిదురించితిని. తరువాతవిషయము నాకుం దెలియదు.

ధర్మ—మదనరంజనీ! నీకిష్టము లేనియెడల దీనినిచ్చటికెందులకుఁ దెచ్చితివి? (అని జడ లాగును. జడ యూడిపోవును)

మధు—అన్నా! సుదర్శనా! ఇటుజూడుము, దీనితలయంతయు, నాగ పీచువలెఁ దెల్లగ నెరసినది. మనలను మోసముచేయుటకిది వేసము ధరించినట్లున్నది.

సు—నిజముగానట్లేయున్నది. ఔరా! ఏమిరా! దీనిచాతుర్యము! చాల దినంబులనుంచి, నిన్నే వరించితినని మాయాలాపంబులనాడుచు,

మ॥ తనసౌందర్యముజూపి నన్నిపుడు మో ♦ దంబార పెండ్లాడఁగా
మనమందెంచి సురూపమొందనిటు సం ♦ భావించి, యీ వేసమున్
గొనబొందన్ ధరియించె, మిత్రమ! యహో ♦ కోపంబుపైకుబ్బెడున్,
(మదనరంజనింగాంచి)
జను మోకాంతరో, శీఘ్రమీ భవన సం ♦ చారంబుఁజాలింపుచున్

మధు—ధర్మపాలా? ఇంకేమైన మారువేసంబులు ధరించెనేమో పరీక్షింపుము.

మదన—(తనలో) నా వేసమంతయు బయలు పడినది. వీరి యెదుట నుండి తప్పించుకొను నుపాయ మేమియును దోచుటలేదు.

ధర్మ—మదనరంజనీ! ఇట్టి వేసంబూని సుదర్శనుని మోసగించి వివాహంబాడి యింకను కామసుఖంబు లనుభవింపఁ గుతూహల పడియుంటివా! (పరీక్షించి) అన్నా! మధుసూదనా!

చ॥ అరయ శిరోజముల్ ఫలిత ♦ మయ్యెను మేన వళీసమూహ సు
స్థిరమునుగాంచెఁ గన్నొమలు ♦ దెల్పెను వృద్ధవిశేషభావ మీ
తెరుణి, యసహ్యరూపమును ♦ దాల్చి విలాసమునొందు వేసమున్
గరము ధరించెనో యధిప! ♦ గాంచుము దప్పును జేష్టలెంతయున్.

సు—ధర్మపాలా! పూర్ణానందుని వాసమెక్కడనో యెఱింగి యీమెను దణిమివేయుము.

ధర్మ—మదనరంజనీ! నీమాయ వేసంబు నీనామస్వారస్యమునంతయుఁ జెడఁగొట్టెను. పూర్ణానందుని వాస మెక్కడ?

మద—(మెల్లగా) దేవ్యాలయ సమీపాశ్రమమున

మధు—మదనరంజనీ! ముందిక యిట్టి మోసంపు వేసంబులఁ దాల్పక రాజవంశ గౌరవంబును నేలఁ గల్పక యింటఁబడియుండుము. అడుదానివని సందేహించి యూరకుంటిని. లేనియెడల నీ ప్రాణంబులు మత్కరవాలంబున కెఱయెసంగ వలసినదే! పోపొమ్ము.

ధర్మ—ఇటుజూడుము!

గీ॥ ప్రథమ లోపంబటంచును ♦ బ్రస్తుతంబు
ప్రాణహరణంబు సేయకఁ ♦ బంపుచుంటి
బుద్ధి నేర్పునఁ బ్రతుకుము ♦ భూమిమీద
పొమ్ము పొమ్మిక మోసంబు ♦ పొసఁగ దిచట.

మద—(భయముతో నిష్క్రమించును)

సుద—మిత్రులారా! చూచితిరా! ఎంతటి ఘోర వైపరీత్యము సంభవించెనో! ఆజ్ఞాతసంగుండగు నేను దుర్మార్గుండనుగాఁ గన్పట్టుచుంటిని.

గీ॥ బుద్ధిబలమున ఫలసిద్ధిఁ బొందకుండ
దుష్టచారుఁ డెప్పుడు నిష్ఠముగను
పాప భూయిష్ఠకృత్యముల్ బరఁగఁ జేసి
కడకు దుర్గతి నొందుచుఁ గనలుచుండు.

మధు—సుదర్శనా! అట్లని యూరకుండఁజనదు. తత్క్షణంబాతని మడియఁజేసి లోకంబున కుపకారంబు సేయుటుత్తమ లక్షణంబు. కాన సత్వరంబునఁ బోదము లెమ్ము.

ధర్మ—ఆర్యులారా! ఈకార్యంబునకు మీరెందునకు? నేఁబోయి యాతనిఁ బరిమార్చి వచ్చెద, ఆజ్ఞాపింపుడు.

సుద—తమ్ముఁడా! ఆగుమాగుము.

మందా—అయ్యా! మిమ్ముల్లతా దేని యాజ్ఞంగైకొనుట యుచితంబని యెంచెద.

ధర్మ—గ్రుడ్డిముండవైనను యూరకుండవు. ఏదోయొక యాలోచనఁ జేయుచుందువు. నోరుమూసికొనుము. ఈవిషప్రయోగ ప్రయత్నంబున నీవుకూడ పాల్గొనినట్లున్నది. నిజము జెప్పుము.

మందా—(దుఃఖముతో) అయ్యా! నేనేమియు నెరుఁగను. నిశ్చయము. నిశ్చయము, నేను మిమ్ములనమ్ముకొని జీవింపఁదలఁచి యుంటిని. నాకేమియును దెలియదు. నన్ను రక్షింపుడు రక్షింపుడు,

సు—సోదరా! పాపమూఁ బెను భయ పెట్టుచుము. నేను విద్యుల్లతా మందిరంబునకుఁ బోయి వచ్చెద. ఆతరువాత యాతని విషయమును విచారింతము. మీరిచ్చటనే యుండుడు.

మధు—మంచిది, అట్లే కానిమ్ము. (అందఱును నిష్క్రమింతురు)

చతుర్థాంకము సంపూర్ణము.

—(o)—

# సుదర్శనీయము

## పంచమాంకము

——(౧)——

విద్యుల్లతా ప్రవేశము (తెరలోపల సుందరి)

వి—(విచారముతో) సుందరీ! ఏమిచేయుచుంటివి.

సుం—అమ్మా! నీనాథుండు వచ్చువేళ సమీపించినదని, పూలదండలఁ దయారు చేయుచుంటిని.

వి—అవి యటుంచి యిటురమ్ము.

సుం—వెంటనే రావలెనా! అంత తొందర పనియేమమ్మా! (అనుచు ప్రవేశించును.)

వి—సుందరీ! (విచారముతో) ఇంతకుఁ బూర్వము నాకుడికన్నదరినది. ఇప్పుడు మరల నెడమకన్నదరుచున్నయది. కారణం బేమై యుండును? దీనిఫలితము నీకేమైన దెలియునేమోయని పిలచితిని.

సుం—దీనికేమంత దెలియవలెను. స్త్రీలకు దక్షిణ నేత్రంబదరుట మంచిదికాదందురు. వామనేత్ర చలనంబు మంచిదందురు. మీకీ రెండును సంభవించినవి గనుక కీడును మేలును వెంటనే సమకూరును.

వి—సుందరీ! మదీయమనంబు మహాచాపల్యమును బొందుచుండె. పూర్ణానందునివలన నానాథునకేమైన కీడు సంభవించెనేమోయని తలంచుచుంటిని.

సుం—(తనలో) నేమెకు నాథునిపిచ్చి బాగాపట్టినదే!

సీ॥ తన్వి నీనాథుఁడైన సు ♦ దర్శనునకు
గపటదేశికుచే హాని ♦ గలుఁగు టెట్లు
సర్వమృగరాజు కోరల ♦ నూడఁబెరుకఁ
గలదె జంబుకంబది నట్టి ♦ తలఁపెగాక.

వి—నీ వచనంబులు నిశ్చయమేయగును. అయిననాతఁడు మహా తంత్రజ్ఞుఁడు. మంత్రజ్ఞుఁడు. అందువలన నించుకసందియంబు గలుగుచున్నయది.

సుం—అమ్మా! అట్టిలభయము జెందవలదు. ఇకెప్పుడు వేడిచేఁగూడ నట్టిదరఁగలదు.

వి—సుందరీ! నీమాటలన్నియుఁ బ్రతిములుగానుండును సుమా!

సుం—తల్లీ! చిన్నప్పటినుండియు నాపల్కులవైఖరి యిట్లేయుండును.

వి—(ప్రక్కకుజూచి) చెలీ! ఎవరోవచ్చుచున్నట్లున్నది. కాంచుము.

సుం—(చూచి) త్వదీయమనోహరుండువచ్చుచున్నాఁడు.

వి—అలాగా! ఇప్పటికి నామనఃపరితాపంబు జల్లాగనదిగదా!

(సుదర్శనుండు ప్రవేశించును.)

వి—నాథా! మదీయ ప్రణామంబుఁగైనుడు. ఇయ్యున్నతాసనం బధిష్ఠింపుడు.

సుద—(కూర్చుండును) సతీ! నీముఖభావ ప్రకటనము భయమొందిన విధమునఁ దోచుచున్నది. మఱేమియు లేదుగదా.

వి—నాథా! నీవుకుశలముగా వచ్చినందులకుసంతోషము. నాభయ కారణంబున కేమిగాని నీముఖంబుమాత్రము నిశియందవలి పద్మమట్లువైవర్ణ్యతనొందియున్నది. ఈసేవకురాలు కారణం బెఱుంగదగునే.

సుద—మనోహరీ! ఏమనిచెప్పుదును,

శా॥ కాలంబేమియొకాని యార్యజన సి ♦ ఖ్యాతిన్బలందూగిను
శ్రీ లెల్లప్పుడొసంగు భారతభువిన్ ♦ జిత్రంబుగా నిప్పుడో
బాలారత్నమ! తంత్రవేద్య సనితల్ ♦ పాపాత్ములౌ దేశికుల్
వాలాయంబుగఁ బుట్టి దుర్యశము సం ♦ ప్రాప్తింపఁ జేసెన్గదా!

వి—(ఆతురతతో) నాథా! అట్లనుచుంటివేమి? సర్వ దేశంబులకును మిన్నయై యున్నలగారు నీయార్యావర్త దేశంబు నీమనంబున కంతి కష్టంబుగాఁ గన్పట్టెనా? చెప్పుము. సత్వరంబునఁ జెప్పుము నాచిత్తంబు దత్తర మొందుచుండె! ఆ! మఱచితి పూర్ణానందుఁడేమైన యుపకారం బొనరించెనా!

సుద—ప్రియాసఖీ! ఆతఁడుమనయింటనుండు మదనరంజనీ పరచితుఁడై మనీయా ప్రాణంబుల హరింప విష రసముచే నిండిన యొక పాత్రనిచ్చి పంపెను.

వి—ప్రాణప్రియా! తరువాత నేమిజరిగినది?

సు—అయ్యది మదనరంజని మంచముకడనుంచి నిదురఁజెందెను. దానిని గుర్తిదియగు మందారమాల విషమని దెలియకనే త్రాగుటకు మంచినీరని దెచ్చియిచ్చెను.

వి—చెలీ! సుందరీ! వింటివా! ఆదురాత్ముని కృత్యంబు. అకటా! ఎట్టి దుష్కార్యంబున కొడిగట్టెను. శుభాంగా! తదుపరి యేమి జరిగినది.

సుద—

శా॥ పానీయంబనిఁ దాని ద్రావగను మ ♦ త్ప్రాణంబు మూర్ఛిల్లె నా
పైన న్మిత్రుఁడు ధర్మపాలుఁడు నను ♦ న్భావించి దుఃఖింపగాఁ

ప్రాణంబిచ్చెమహోక్కృయౌషధమునన్ ద్రావించి యానాతి యో
చానా! సౌఖ్యముగూడె నాకిపుడు నీ సౌందర్యమున్ గాంచగన్.

విద్యు—జీవితేశ్వరా! ఈదినంబున నా కుడికన్నదరినది. మరలకొంచె మాగి వామలోచనంబదరెను. అందువలన నాకేమియు దోచక భవచ్చరణకమల ధ్యానమ్మై మహాభయంబున కాలక్షేపము జేయుచుంటిని. త్రిజగదధిష్ఠాన దేవతయు చతురాననురాణియగు నావాణీమహాదేవి మిమ్ము రక్షించి నాకు శుభంబుఁ జేకూర్చె. నాథా! దుష్టుఁడగు నాపూర్ణానందుని నమ్మహాదేవి శీఘ్రకాలంబుననకాలమృత్యువాతంబడఁద్రోసిభారతసామ్రాజ్యరమాదేవికి ముదంబొసంగుఁగాక. భవదీయ మిత్రరత్నంబుల కాచంద్రతారక స్థాయియగు యశంబుఁ గూర్చుగాత! పాపము శమింపజేయుగాక.

(తెరలో పెద్దధ్వని)

ఆర్యా!ఏమి!ఆధ్వని. అటుచూడుము.(ఉభయులునుజూచెదరు) భయంకరంబులగు ధూమంబులు బయలువెడలినవి. ఇటు గాంచుము ప్రళయానలంబు విధంబున నగ్నికణంబులు పైకెగురుచుండు మంటలు దిక్కులయందు వ్యాపించుచుండె. పట్టణవాసులందఱు దుఃఖించుచుఁ బరుఁగిడుచుండిరి. ఇదియేమో విలయంబు సంభవించె. ఆపాపాత్ముండగు పూర్ణానందునిందుఁ బడఁద్రోసిన నామనంబు శాంతించఁగలదు.

సు—నారీమణీ! దుర్మార్గులతిశయంబగుటచే భగవంతుఁడగు నాశంకరుండు తనత్రినేత్రంబును దెరచెనోయనునట్లు గాన్పించుచుండె. పూర్ణానందు విషయమై నీయభిప్రాయంబుఁ దెలిసికొంటిని. ఇంక నాతని నాయగ్నియందుఁ బడఁద్రోసి భవదభీష్టంబు నెర

వేశ్చెద. మన్మిత్రులగు మధుసూదన ధర్మపాలురం గలసికొన వలెను. నేఁబోయెద నీవు సౌధంబున బ్రవేశింపుము.

(నిష్క్రమింతురు)

(ధర్మ, మధు, సుద ప్రవేశము)

సు—మిత్రులారా! చూచితిరా! పట్టణమంతయు భస్మీభూతమగుచుండెను.

మధు—మంచిసమయము లభించినది. పూర్ణానందుని విషయమై దేవ్యభిప్రాయ మెట్లుండెను.

సు—

మ॥ ప్రళయంబై జగమెల్ల నొక్కత్రుటిలో ♦ భస్మంబుగావించు నా
విలయాకారమహాగ్ని వహ్నిశిఖ ని ♦ ర్ఘృతిన్ జగద్ద్రోహు నా
చలచిత్తున్ యువతీవిమోహరతుని ♦ న్సాధించి యిప్పట్టునన్
బలవంతంబుగఁ ద్రోసి భారతభువిన్ ♦ ప్రఖ్యాతిఁ గామిన్మాయనెన్.

ధర్మ—అన్నలారా! అటులైన సత్వరంబేగి యాతని నామంటయందు ద్రోబ్బుటమంచిది. పోదమురండు, (నిష్క్రమింతురు)

(తెరపడును.)

—♦ రంగము ♦—

అరచుచున్న పూర్ణానందుని కాళ్ళు చేతులు బట్టుకొని యీడ్చుచు, సుద, మధు, ధర్మ, ప్రవేశము.

పూర్ణా—మహానుభావులారా! రాజకులావతంసులారా!ధర్మనిష్ఠులారా! ఇమ్మహాపాపుని రక్షింపుడు, రక్షింపుడు. ఆమహాగ్ని కీలలనన్ను బడద్రోయకుడు నాతప్పు. సైరింపుడు, నన్ను బాలింపుడు.

సు—సోదరులారా! ఈతనింగూడ ప్రథమలోపంబని యెంచిరక్షించుట మంచిదియని నేభావించు చుంటిని.

ధర్మ—రాజవంశతిలకా !

గీ॥ కుటిలచిత్తులనెల్లను ♦ గూలఁద్రోసి
శిష్టజనులను రక్షించి ♦ క్షితిని మనము
క్షత్రియాన్వయ సద్ధర్మ ♦ చరితమిపుడు
నిలుపవలయు సుదర్శనా ♦ లలితమతిని.

అందువలన క్షమించుట యుచితంబు గాదు. మధుసూదనా! చూచెదవేమి! అందుఁబడఁద్రోయక.

పూ—హరహరా! ధర్మాత్ములారా! వలదు. వలదు తప్పుక్షమింపుడు.

మధు—నీమాటలమేమువినునది లేదు. (అని నిలువఁబెట్టి) దురాత్మా

మ॥ విరిబోఁణీమణి, సాధ్వి, సువ్రతియునౌ, ♦ విద్యుల్లతా దేవినిన్,
మరుకేళిన్నవయంగఁజూచుచు మదో ♦ న్మత్తుండవై నాడు మా
సరసస్వాంతు సుదర్శను న్విసముచేఁ ♦ జంపింపయత్నించు దు
శ్చరితున్నిన్నిక వీడువారమె! శిఖి ♦ జ్వాలన్బడన్ద్రోయకే.

సుద—మిత్రులారా! అవిగో! అగ్నిజ్వాలలు పశ్చిమవైపునకేగుచున్నయవి. విద్యుల్లతా సౌధంబునుఁగడు శీఘ్రంబున ప్రవేశింపవలయును.

ధర్మ—అన్నా! మధుసూదనా! చూచెదవేమి? పట్టుము ద్రోయుము. హరహరా ! (అని కాళ్లును చేతులఁబట్టి విసరివేయుదురు).

సుద—మిత్రులారా! శివశివా! పాపముశమించుగాక! అబ్బా ఈఘోరకృత్యంబు నాకంటఁబడి నామనంబు నెంతయో సంతాపంబు గలింగించె అహో! ఈప్రళయాగ్ని! యదిగో యావైపునకుఁ బోవుచున్నది. మత్ప్రాణప్రియ యెంతదిగులొందుచున్నదోగదా!

శీఘ్రముగ బోయి యామెను దోడ్కొని యీపట్టణబాహ్యోద్యానంబులకుఁ బోదము రండు. (నిష్క్రమింతురు)

—♦ విద్యుల్లతా సౌధము ♦—

సుందరీ, విద్యుల్లతా ప్రవేశము.

వి—సుందరీ! అటుగాంచుము. మహారౌద్రాకారంబున పట్టణమంతయు భస్మీభూతంబుగావించి యీ యనలుండెట్టు లీప్రక్కకు వచ్చుచుండెనో! నామనంబు మహాభయంబు నొందుచుండె. ఏమి సేయుదుము? చెలీ!

మ॥ నను బోషింపుచు నుండు నావిభము ♦ న్గాక్షించుచుండు న్సదా
నను ముద్దాడుచునుండు గౌగిట మహా ♦ నందంబుగాఁ జేర్చుచున్
మునిపంటన్నను మోవినొక్కుచు ముదం ♦ బున్గూర్చుఁదానట్టిచో
నను రక్షింపఁగరాక యుండెనకటా! నా ♦ నాథుఁడిప్పట్టునన్.

సుం—అమ్మా! నీవట్లు భయమును జెందకుము. కానిమ్ము! మనమేమి చేయఁగలము. విధివిధానంబు దప్పించుకొనుట నేరితరము. నీ ప్రియుండార్తజన రక్షకుఁడు. ఈసమయమం దెందరు ఘోషించుచుండిరో వినుచుంటివా? అట్టివారలఁ గాపాడఁ బ్రయత్నింప నాలస్యమైనదేమో? తత్తరింపకుము.

విద్యు—సుందరీ! పట్టణంబంతయు నెట్టులుండెనో యటుగాంచుము ఇదియంతయుఁ గొండలుపగిలి యందుండి వెడలిన యగ్నిగాఁ దోచుచున్నది.

సీ॥ నవరత్న రచితమై ♦ నవ్య వైభవ మొందు
సౌధజాలము లెన్నొ ♦ సమసిపోయె
రచ్చపట్టులయందుఁ ♦ బచ్చఁగా వెల్గొందు
ఫలవృక్ష తతులెన్నొ ♦ భస్మమయ్యె

క్షీరథారలనిచ్చి ♦ సేమంబుగూర్చెడు
గోగణంబులవెన్నొ ♦ కుమిలిపోయె
బళ్వాన్నమైయొప్పి ♦ బ్రహ్మాండమునుదాకు
గసపురాసులవెన్నొ ♦ కాలిపోయె

గీ॥ బిడ్డతల్లుల గోడచే ♦ పెద్దపెట్టు
నకట వినబడుచుండెను ♦ నదియుఁగాక
పక్షికుల సంకులంబదె ♦ భారమయ్యె
నేమిసేయుదు మిప్పుడో ♦ యిగురుబోడి.

సుం—తల్లీ! మనకు శుభమగుగాక! (పరిక్రమకుజూచి) నీనాథుండును నాతని మిత్రులును శీఘ్రగమనంబున నిదే వచ్చుచున్నారు. భయపడకుము. మనల రక్షింపఁగలరు.

సుద, మధు, ధర్మ, ప్రవేశము.

వి—ఆహా! నాథా! మీరెంతయో బడలినట్లున్నది. మఱందులారా! మీశరీరకాంతి మెరుఁగు దగ్గినట్లుండెను.మీరీయున్నతాసనంబు నధిష్ఠింపుడు.

ధర్మ—అమ్మా! ఆసనంబులధిష్ఠించి సుఖముగా గూర్చుండు సమయముగాదు, (తెరలో పెద్దధ్వని)

సుద—(ఆతురతతో) మిత్రులారా! అదిగో! మనకా యగ్నిజ్వాలలు సమీపించినవి. ధూమంబులు జుట్టుముట్టుచున్నవి. నే విద్యుల్లత నెత్తికొనియెద.మీరాసుందరినిమాతృముజాగ్రతఁగాజూడుడు.

శా॥ రా! విద్యుల్లత! రావె సుందరి! యికన్ ♦ రా! ధర్మపాలా! సఖా!
రా! రా! మా!మధుసూదనా! సుచరితా!♦ ప్రాణంబు దక్కించుకో
గా! రండీ! పురబాహ్య సీమ కరుగం ♦ గా సౌఖ్యముల్ గూర్చిన
త్కారుణ్యామృత వార్ధియౌచు మనకున్♦దైవంబె తోడయ్యెడున్

(నిష్క్రమించుచును. తెరవాలును.)

పంచమాంకము, సమాప్తము.

శ్రీ

# విజయనిగ్రహము

(అనురూపవతి)

షష్ఠాంక విషాదాంత నాటకము.



శ్రీగిరాజు రామారావుచే.

రచింపబడె

నూజివీడు.

ఆయుర్వేద ముద్రాక్షరశాలలో

ముద్రితమైనది.



1926.



వెల రు 1—4—0.

# పీఠిక.

—(o)—

చదువరులారా !

నేనీగ్రంథమును వ్రాయుట నా యాంధ్రభాషా పరిజ్ఞానమును వెల్లడిచేయుటకు గాదు, నాకు నాటకాభినయంబు నందుండు కుతూహలతను కవిత్వంబు నందుండు ఉత్సాహంబును వెల్లడి చేయుచుంటిని. ఇందు నన్ను బ్రోత్సాహించిన నా [illegible] కృష్ణయ్య గారును, మురహరి [illegible] గారును వారికి నేనెంతయో కృతజ్ఞుడను.

ఇయ్యది యాంగ్లభాషా పండితుడగు స్కాట్ రచియించిన (కెనిల్వర్త్) అను నవలా గ్రంథము ననుసరించి కొలదిమార్పులతో భాషాంతరీకరింపఁబడియె. కవిత్వాంథమున నే గ్రంథమును రచించితిని. గాన విద్యాప్రవీణులు గుణదోషంబుల నెరింగి రేని నాకుఁ దెలియపరచిన తరువాత ప్రతులలో సరిచేసి కొనఁగలను.

ఇట్లు,

గ్రంథకర్త.

# పాత్రములు.

## పురుషులు.

విక్రముఁడు—కథానాయకుడు.

విజయుఁడు—కథానాయకుని మిత్రుఁడు

జయంతుడు } విక్రముని విరోధులు.
కాళిందుడు }

మదనమోహనుడు—[illegible] ప్రియుడు.

గాలవుడు.

వైద్యుడు.

మోహనుడు—తాగుబోతు.

జాఫర్—గారడీవాడు.

## స్త్రీలు.

రూపవతి—కథానాయకి.

జగన్మోహిని—దా[illegible].

కుసుమ—రూపవతి చెలికత్తె.

అవ. రసైనవాట [illegible]

శ్రీ

# నాంది.

ఉ. శ్రీరఘురామచంద్ర! సురశేఖర! ధీనిధి! లోకరక్షకా!
ధీరజనావళిన్ బరమధీసుతులన్ హరిభక్తులన్ సదా
గౌరవనీయులన్ మిగుల గానకళాధిపులన్ కృపాది వి
స్తారులఁ బ్రోవుమయ్య సుఖసంపదలిచ్చుచు దీనబాంధవా॥

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

(తనలో) ఆహా! నేఁ డెంతటి సుదినము! నేటి నాటక ప్రదర్శనమునకు విద్వాంసులు, మహామేధావులగు కవులు, పండితాగ్రేసరులు, గానకళానిధులు, నీతికోవిదులు, భక్తాగ్రేసరులు, తత్వజ్ఞులు, కళోపాసకులు, భూపతులింక నెందరో విచ్చేసియుండ నే నమితానందభరితుండనగుచున్నాను. ఇప్పుడు వీరి నే నాటకప్రదర్శనమున సంతోషపెట్టవలెనో తెలియకున్నది. నటి నడిగినచోఁ జెప్పగలదు. [ప్రకాశముగ] ప్రేయసీ! ఏమిచేయుచుంటివి?

నటి—(ప్రవేశించి) ప్రథమాంకమునవచ్చు పాత్రములఁ దయారుచేయుచుంటిని.

సూ—అసలు ప్రదర్శింపబోవు నాటకమెద్ది? దాని నెవరు రచించిరి?

నటి—గీ. రామరావు రచించెను రమ్యముగను
'విజయవిక్రమ' యని పేరు పెట్టెనతడు
కవితఁబోషించుకొఱకయి గ్రంథరచన
జేసె దైవంబు సాయము చేయుననుచు॥

దీనికే రూపవతి యను నామాంతరము

సూ—ఈ నాటకప్రదర్శనమువలన లాభ మేమి?

నటి—దీనిని చదివినవారికిని వినినవారికిఁగూడ నీతిబోధకముగానుండును మాతృభూమిసేవయు ఆత్మాభివృద్ధియునగును. మఱియు,

గీ. రసములన్నియునున్న పీ రచనయందు
నందరకు శైలి బాగుగా నర్థమగును
వర్ణనములచే నియ్యది వఱలుచుండు
తెలివినిచ్చును నీతులఁ దెలుపగలదు.

సూ—బాగుగానున్నది. నేఁడీ మహాజనసమ్ముఖమునఁ బ్రదర్శింపదగిన నాటకంబే. ప్రియుసీ! ఈనాటకమునందు నీ వేపాత్రము ను ధరించెదవు?

నటి—రాణి పాత్రమును ధరింతును.

సూ—ఏది! ఏదైన ఋతువర్ణనపద్యంబుఁ బాడుము.

నటి—మంచిది.

చ. "వలపువహించె గంధగిరివాతపరంపర భూరి భూజ శా
ఖలు చిగురించె నింపెసగఁగాకవికోకిలలందు జెక్కులం
బలుచని ఘర్మబిందువులు భామలకున్ బ్రసరించె నెయ్యెడన్
జెలువుఘటింపఁజాలదు విశేష వసంతసమాగమంబిలన్

(ధర్త్రుహరి)

సూ—మనోహరంబుగా బాడితివి. దీనికి నీసాటిగానం బొందుం గానను.

(తెరలో)

(అకటా! నాథుఁడు ... అన్న పద్యము వినబడును)

నటి—అదుగో! రూపవతి తన భర్త వివాహమాడిన నాటినుండియు దన్నుఁ జేరలేదని దుఃఖించుచున్నది. మనమేగి యామె నోదార్చుదము రమ్ము. (నిష్క్రమించుచును)

ఇది ప్రస్తావన.

---

# విజయవిక్రమ్

## ప్రథమాంకము.

### ప్రథమరంగము.

ప్రదేశము వనపుగభవనము—ప్రవేశము రూపవతి.

రూ—(తనలో)

మ. అకటా! నాధుడునన్ను జేరదుపివాహంబాడి యెందేగెనో
యిక నాతండ్రినిరాశచే భవనమందేయుండె గాబోలు నా
యకలంకుండగు సుందరాంగుపయి మోహంబెట్లు చల్లారునో
యకటా! స్త్రీపతిభార్యనై విడచి యీహార్మ్యాన నెట్లుందునో!

ఆహా! నాతండ్రి నావియోగంబున నెంత విలపించుచుండెనో
కదా! నన్ను బాల్యమునుండియు బ్రేమాతిశయంబున బెంచి పెద్దదాని
గా జేసెనుగాని యౌవనమంకురించినతోడనే గూటిలోని పిల్లవలె నాత
ని విడనాడి వచ్చితిని. అయ్యో! పితృఋణము దీర్చుకొనుటెట్లు? మరల
నాతని జేరుదమన్న నాకట్టి స్వేచ్ఛలేదు. మొదట నాతండ్రి నన్ను జ
యంతుని కీయదలంప విక్రమసేనుని కోరి వివాహమాడి యిట్లుంటిని.

ఉ. రాజకులంబునందు గడురంజిలజేసెడి సౌధమందునన్
నేజనియించి మోహమును నిల్పగ జాలక భ్రాంతితో మహా
తేజవిలాసమందు బడితిన్ అకటా! యిటుచేరినాను నా
నైజగుణంబెరింగియును నాధుడుతండ్రియునే లరారొకో.

అకటా! వివాహమాడిననాటినుండియు నామనోహరుడు నావంక
నాకంటబడడు, పలుకు పలుకడు. వార్తనైనంబంపడు. అయ్యో నాకట్టి.

మురవస్థకలైె ; నాతండ్రి దుఃఖాతులహృదయంబునకు నేనే కారణభూతురాలను కాబోలు. నాతండ్రిని జూచివచ్చెదమా యన్న జయంతుడు నన్ను దొంగిలించు నేమో యన్నభయముచేత నాపతి నన్ను విడువడు. తాను నాకడజేరి నన్నాదరింపడు. నేను నా పాతివ్రత్యమును విడువక నానాథునియందే బద్ధానురాగురాలనై యుంటిని. యెవ్వరికిని దెలియకుండ వికర్ణుని వివాహమాడితిని. నాతండ్రి నాయంతరంగం బెరుంగక విక్రముండు దొంగిలించెకదా యని యెంత దుఃఖించుచుండునో ఎంత దూషించుచుండునో? అయ్యో! నానాథుడు నన్ను బ్రేమించి వివాహమాడి భరతరాజ్యాధికారిణియగు జగన్మోహిని న్నాశ్రయించియుండె. ఇంతకాలమువరకు నాదరిరాకుండుట కేమిహేతువోకదా! వాని పేరు దలంచుకొనిన మనంబు చలించుచున్నది. హృదయ కవాటంబు బ్రద్దలగుచున్నది. నాపతి వచ్చువరకు నాకీ కారాగారమువంటి మందిరమే పుట్టినిల్లు కాబోలు అక్కటా! నేనెంత నిర్భాగ్యురాలను ఎంతహీనురాలను ఆహా! స్త్రీజన్మమెంత పాపిష్టిజన్మము?

సీ॥ తలిదండ్రులనుబాసి ధనమును గోల్పోయి
కష్టనిష్ఠురములఁ గూర్చు కాంతకాదె
మానహీనముచేసి మర్యాదహీనంబు
కలుగజేయు పిశాచి కాంతకాదె
ఆప్తమిత్రులఁ బొప్పి[illegible]పాటలమాన్పి
కాచియుండగఁ జేయుఁ గాంతకాదె
వానినిరిక సదా వైరముల్ గల్పించి
కష్టాలపాల్జేయుఁ గాంతగాదె
గీ॥ బలవిహీనునిగాజేసె యుల్లాయువుగల
వానిగాఁ జేయునయ్య మావనితకాదె
అట్టి దుర్మార్గజాతిలోఁబుట్టి యిట్టి
కఠిన పాపములోనఁ గూర్చుఁ గాంతకాదె

అకటా! నాకీ బంధికానవిముక్తి యెవరు చేతురు? నానాధుఁడాకాశవాణిచేతనైన కబురంపడే! నేనెన్నిదినంబులు సహింపఁగలను. చీమచిటుకనిన మనంబు చలించుచున్నది. నాకేమియో మహాభీతికల్గుచున్నది. ఓ పంచభూతములారా! నామొరాలించి నన్నానందింపజేయరా! నన్నీశోకసాగరంబునుండి దాటింపరా?

సీ. తరులార గిరులార తారలారా నన్ను
కావరే దుఃఖసాగరమునుండి
మాధవా నీవైన మందభాగ్యవతిని
కావవా దుఃఖసాగరమునుండి
చెలియ కుసుమ! నీవు చెంతరావా నన్ను
కావవా దుఃఖసాగరమునుండి
విజయ జయంతాదీ వీరులారా నన్ను
కావరే దుఃఖసాగరమునుండి

గీ. సుగుణధామ యోదైవమా! శోకశమన!
కావవే నన్ను దుఃఖసాగరమునుండి
సూర్యచంద్రాదులార యోయార్యులార!
కావరే నన్ను దుఃఖసాగరమునుండి.

విక్రమా! నాథా! నన్ను గొనివచ్చినప్పుడు మీరాడిన మృదుమధురవాక్యమ్ములెందుండె?

సీ. నీమోగనే సదానిలిపెద నాప్రేమ
యన్న నిర్ధారణ మున్నయమ్మో
నిన్నువిడచి యరనిముసముండగ లేన
ని వచించినపలుకులు నీటగలిసె
కళకాంతియందు నేకఫులు వర్ణింపలే
రన్నప్రగల్భము లడుగుజేరె
మురిపెంబుతో నన్ను ముద్దుగొనెడువేళ
నాడినవాక్యంబు లడపిగలసె

గీ. అక్కటా! యింతలోననె యంతరించి
పోయెనే ప్రేమ కరుణహృదయము దాల్చి
నాకిటుల బాధలఁగూర్ప న్యాయమగునె
నాతినిఁకఁగాని నన్ను రక్షింపుమోయి.

అయ్యో! నాయవస్థ దలఁచుకొనిన ప్రాణము తల్లడించుచున్నది ధైర్యము నశించుచున్నది. ప్రాణభీతి కలుగుచున్నది మతి యంతరించుచున్నది. అవివేకము వర్ధిల్లుచున్నది. మనోవ్యాకులము కలుగుచున్నది నామనోనాథుఁ డింతటికఠినహృదయము దాల్చునని కలనైనదలంపనైతి నాథా! నన్నుఁ జేరకుండుట కేమి హేతువు? నీమనంబెట్లు పాషాణమయ్యె? నన్నింతకాలము శ్రమబెట్టదలచితిరి? మీకింకనైన దయకలుగ లేదా? దుష్యంతునివలె వివాహమాడి సంగతి మరచితిరా? ఛీ, నేనెంతటి క్రూరురాలను! నాపతిని దూషించుచుంటిని ఎవ్వరినిదూషించి న నేమిఫలము? హృదయమా! శాంతిలుము. ధైర్యమా! మనంబునఁ జేరుము. వివేకమా! ముందుదారిఁజూపుము. జ్ఞానమా! జాగ్రతగవహింపుము. సువాసీ! మాటలఁ దూలనాడకుము. నా పురాకృతకర్మఫలంబ ననుభవించితీరవలెను కదా?

సీ. ధనవంతునైనను దారిద్ర్యునిగ జేసి
కనుబాధలనుబెట్ట గలదుకర్మ
రాముని నల ధర్మరాజాదులను రాజ్య
పదహీనులుగ జేసె బాపకర్మ
మొనశూరునకైన నింతలోగర్వాతి
శయములుపోవగాఁ జేయుకర్మ
ఘన కృష్ణార్జునుల్ భీమదుర్యోధనా
దులకు వైరముగూర్చె నిలనుకర్మ

గీ. మహితకర్మము నాదేవతామునైన
ననుభవింపక తీరనాయుహాహంబు
కాన నేను పురాకృత కర్మఫలము
ననుభవింపక తీరదనుట నిజంబు.

అయ్యో దైవమా బ్రహ్మాండంబులోనున్న జీవరాసులలో నీకంటికి నేనే యగుపడితినా? నే నేపాపము జేసియెరుంగనే! నీవు శిక్షింపదలచిన నెవ్వరు లేరు.

సీ. తలిదండ్రు లన్నదమ్ములను ధనాపేక్ష
చేఁ జంపి సుఖముగ చెలగుచుండ
అగ్నిసాక్షిగ పెండ్లియాడినభార్యను
వర్జించి వెలకాంత పజ్జజేర
భగవంతుడే లేడు పాపమన్ననుసున్న
యనుచు నిర్లక్ష్యత నాడుచుండ
గురుబోధలనువీడి కులవిధులనుమాని
పరవేషభాషల పరగుచుండ
గీ. ఆత్మరక్షణ శిశురక్షలారిపోవ
మానమేపోవ మర్యాద మాసిపోవ
వారి విడనాడి నావంటి హీనురాలి
కేలనిడుమలగూర్తు? గోపాల బాల.

కష్టములన్న నేవియో యెరుంగక త్రికరణశుద్ధిగ జీవించుచుండ నావంటి యమాయకురాలికా కష్టములు! నే నెన్నియో పూజా పునస్కారంబులను, దేవీ వ్రతంబు లిందుకొరకా చేసితిని! ఇదియా నాఫలము దైవమా! భర్తవివాహమాడిన నాటనుండియు నన్నుజేరమి నే నెట్లు సహింపగలుగుదును? ఓ పంచభూతములారా! నన్ను మీలో నైక్యము జేసి బాధలనుండి తొలగింపుడు.

సీ. భూదేవి! పాతాళమునకుఁగొనుము నన్ను
సంకష్టములనే నోర్వజాల
గాలిదుమారమా గగనంబుగొనిపొమ్ము
బాపవే బాధల పడగజాల
గగనమా గొనిపొమ్ము గంధర్వభూమికి
బాధలు పుడమినఁబడగలేను

జలధినాయకుఁడా! నిజహృదయమునందుంచుము
సర్వకష్టములు నేనోర్వలేను
గీ. అగ్నిహోత్రుఁడా నీవు మంటయందు నన్ను
క్షణములో మాయముం జేయజాలవయ్య
బాధలకు నోర్వజాలనో పంచభూత
సంఘమా నన్ను గొంపోయి సాకరాదె?

నా నాథుడు భరతరాజ్యాధికారిణియొద్దనే యుండెననిన ప్రాణములపై యాశవదలుకొందునుకదా? ఏటికీయనాథబ్రతుకు. యీ చెరసాలజీవనము. చీకునిమెకుట భోగముమేళవమాడినట్లు నా కీసుందరమందిరంబేల— ఈ యుద్యానవనంబేల— యాభటులేల— పతిలేనిసౌఖ్యములడవిగాచిన వెన్నెలచందముకాదా? నాథా మనోహరా ఇకనైననా చెంతఁ జేరుము అకటా మారాచకులంబునకు నేనొక్కదాననే కళంకము దెచ్చితినని జన్మజన్మముల నన్ను దూషింపుచుందురు కాబోలు. అయ్యో యికనైన నన్ను రక్షింపుము.

సీ. సర్వకాలములందు సంతోషమిప్పించు
హితుడగు చిత్రకముం డేడనుండె
సహకారుడైన సారసన జయంతుండు
నా మొరాలింప డదేమొకాని
చేతులారంగ నన్నేలిమితోఁ బెంచిన
తలిదండ్రు లెచ్చోట డాగినారొ
సౌందర్యమున నీకు జాలువారెట లేర
నడివారి కెచ్చోట నెలవు కలదొ
గీ. అయ్యయో యొక్కరైన నా యాపదలను
దీర్పరదయేమి చిత్రమో తెలియదకట
మొనసెంగినను మానవాయ కావనయ్యొ
[illegible] నాకేమి దిక్కు లేదు.

ఇట్టి కష్టములన్నియు నాకై వేచియుండనోపు. నేనవి యనుభవించి తీరవలెనుగాబోలు. అకటా స్త్రీజన్మ మెంతపాపమైనది.

ఉ. స్వేచ్ఛయెనున్న దుఃఖములు జింతిలుపొందుట మిక్కుటంబు మీ
యిచ్ఛకువచ్చినట్లు చరియింపగరా దకటా గృహంబులో
మచ్చిరమెత్తకుండగను మర్త్యుని బోషణచేయగావలెన్
స్వేచ్ఛయెలేని జీవనము జేయుటకంటె తెగింపమేలగున్.

(దిక్కులుపరికించి) అదుగో జయంతు డిందులకె వనతవదనుడై యేతెంచుచున్నాడు. నా కేవార్తదెచ్చుచుండెనోకదా ఆహా మొదట వీడు నన్ను బ్రేమించి నన్ను వివాహమాడదలచెనుగాని నామోహపాశములు విక్రమునే జుట్టుకొనియె. వీడు విఫలమనోరథుండయ్యె. నాతండ్రితలంపుకూడ నిష్ప్రయోజనంబయ్యె. నన్ను వివాహమాడినసంగతి రాజుకి దెలిసిన ముప్పువాటిల్లునని నాకాంతుడు నావివాహవార్తనెవ్వరికి దెలియనీయక కప్పిపుచ్చెను. అది నేనెట్లు వెల్లడిచేయగలను? పతియాజ్ఞమీరిన దాననగుదు.

(జయంతుడు ప్రవేశించును)

[ప్రకాశముగా] జయంతా! వీభవనమెట్లు చేరగల్గితివి? చీమలైనను రాజులవే నీవు విజయునిచే శిక్షకవచ్చినందుల కెంతయో ధన్యుడవు. నాకేవార్తను దెచ్చెదవు?

జయం—విచారవార్తయే.

గీ. నీవు వ్రాసినదాదిగా నీదుతండ్రి
మిగుల దుఃఖించుచుండెను వేగిరమున
బయలుదేరనిచో వాని ప్రాణములను
విడచుకావున నాతోడ వేగరమ్ము.

రూ—(ఆశ్చర్యముతో) నాతండ్రి మరణవేదనలోనుండెనా? అయ్యో నేననుకొనినట్లేయైనదే నేను కడసారిచూపైనను జూడనోచుకొనలేదు కాబోలు. జయంతా నన్నీ యనుకింకరులు విడువరు. ఈ భటులు నన్ను కడుజాగరూకతతో కాపాడుచుండిరి. నాకేస్వేచ్ఛయున్న నీతోడ నాతండ్రినిచూచుచుటకు రాకుందునె?

జయ—రూపవతీ స్వేచ్ఛలేకేమి? నీకేమియు భయంబులేదు. నీవనవ్యథా దలంపక నావెంటరమ్ము. నీతండ్రి యొద్దకు గొనిపోయెద. మరచితి నీతండ్రివ్రాసిన లేఖ నందుకొనుము. (లేఖనిచ్చును.)

రూ—(చదువుకొని తనలో) అకటా ఎంతకఠినముగ వ్రాసితివి తండ్రీ నీవు మృతినొందిననాడు నాదుఃఖాతులహృదయము పది వ్రక్కలు కాకుండునా? మరల నన్యోన్యప్రేమతో స్వర్గసుఖంబు ననుభవింపకుందుమా? (లేఖజూచి) అయ్యో తండ్రీ ప్రేమలేదనుచుంటివా? బుద్ధిహీనమగు జంతువులుకూడ తోడిజంతువులకు హాని కల్గిన పరితపించునే? నేనంతకంటె నధమురాలనా? బుద్ధిహీనురాలనా? తండ్రీ నేను విక్రముని వరించి వివాహమాడితినని నీకు తెలిసినచో నీవిట్లు విచారింపవుకదా! నాయుద్దేశ్యంబు నీకెట్లు తెలియును? నానాథుడు నావివాహవార్త నెవ్వరికిం దెలియక కప్పిపుచ్చెను. నేనిప్పుడు వెల్లడిచేసిన పతియాజ్ఞను మీరినదాననగుదును. చెప్పనిచో నీవు మరణింతువు. అయ్యో! ముందు గోయియు వెనుక నూయియున్నదే! కానిమ్ము. నాథునిమాట నే చెల్లించెదగాక. [ప్రకా] జయంతా! నీవెరుంగనిదేమున్నది? పతియాజ్ఞ పడయకుండ రాకాదనుసంగతి నీ వెఱుంగనిదికాదు కదా? మరియు నిందుభటులు నన్ను విడువరు విజయుండిందే యున్నాడు. నిన్నుజూచిన యుద్ధమునకు గోరునుగాన నామాట విని దయయుంచి యిందుండి వెడలుము

జయ—సరియేగాని నీతండ్రితో నేనుసి తెల్పునదేవు?

రూ—రూపవతి నంతఃపురంబున గడుజాగరూకతతో భటులు కాపాడుటవలన భవనమును దాటి యొక్కయడుగయినను బైట నిడజాలదనియు, సాహసించినచో విజయుం డాతని శిక్షించుననియు—

జయ—మంచిది అటులనే చేసెదను. (నిష్క్రమించును)

రూ—(తనలో) ఆహా! వీనితో నేగిన నిరుగుపొరుగువారలతో నేమి చెప్పగలను? మనోనాథా విక్రమా! నాదరికిరావేమి? నే నెన్ని

దినంబులో న్చియుండును ? నన్ను వివాహమాడినతరువాత కాకి చేతనైన గబురంపవేమి ? నీ స్త్రీవిపరీతాబ్ధిలో నెవరు ముంచిరి ? సంసరణసాగరమీదుట దుర్లభంబని వైరాగ్యంబు నొందితివా ? నాధా ! రమ్ము ; నా ప్రేమసుధాధారలం గ్రోలుము— నన్ను విరహతాపాబ్ధిలో ముంచకుము— (తెరవాలును)

## 2 వ రంగము.

(ప్రవేశము—జయంతుడు)

ఆహా ! కాలవైపరీత్యము ! వినాశకాలంబునకేగదా విపరీతబుద్ధులు కలుగుచుండును ?

సీ. రాక్షసప్రభువగు రావణాసురుఁ డారె
దుర్భరంబుగసీత దొంగిలించి
అత్యసూయాపరుడగు కర్ణుఁ డారెను
ఫల్గుణునిపయి కోపంబుచేత
పరశురాముని గర్వభంగంబుగల్గించె
రామచంద్రునితో పోరాడఁబోవ
బాలునిప్రహ్లాదు భగవంతు నెదిరించి
వానితండ్రి హరిచే నుడిసినాడు

గీ. అట్టులే విక్రముని కిప్పు డిట్టిబుద్ధి
కల్గె ; తథ్యముగ వినాశకాలమందు
వైపరీత్యంబగు జ్ఞానిమనముఁ జేరు
ననెడి యార్యోక్తి కావున నతఁడు కూలు.

విక్రముఁడు రూపవతిసి దొంగిలించి యాప కంటఁబడక మిగుల విచారమును గల్గియామె నీపురంబుననుంచెను. ఆమె కెంతమాత్రమును సంతోషము లేదు. అందులకామె దుఃఖాక్రాంతహృదయయై కుందుచున్నది పుత్రికావియోగదుఃఖమునకు మాధవుడు మరణించుట నిశ్చయ

ము. వానియసురు విక్రమునికి తప్పకకల్గును రూపవతిగొనివచ్చినపుడు పోషించవలెనుగాని విరహాతాపాబ్ధిలోముంచి యుంచుటనాయమా? అవిక్రముడు— క్రూరుని కెట్టిగుర్బుద్ధికల్గె? వాడెందరికి బాధలగల్పిం చుచుండెను— మాధవునికి దుఃఖంబుకల్గించె— రూపవతిని దొంగిలించి బాధలు పెట్టుచుండెను— నాపై నసూయకల్గియుండెను— నామిత్రుం డగు మదనమోహనునికి మందుపెట్టించెను భరతరాజ్యాధికారిణీయుం డజేసి యామెను మోసముచేసి రాజ్యాధిపత్యంబు వహింపవలెనని దు రుద్దేశంబుతో నుండెను. జగన్మోహినిపైగల ప్రేమసూత్రమ్ముల త్రెం పజూచెను. ఆహా! వాఁడెట్టికార్యములుచేయ సాహసించెను? ఆక్రూ రవిక్రముడు నాకు ప్రతివిషయమందు నడ్డువచ్చుచున్నాడు. రూపవతిని నేఁ బ్రేమించి వివాహమాడదలంచ తాను దొంగిలించి బాధనుండుం చెను. అచ్చటైన నాపెను సరిగాజూచుటలేదు. తాను రాణి యనుగ్రి హామునకుపాత్రుడై రాజ్యము సర్వము తానే పొందదలంచె నన్ను జంపిన రూపవతినిబ్రేమించువా రుండరని తలంచెనట నేను రూపవతిని పొందలేకపోయినను వానియంతంబు జూతును. (కొంచమాగి) ఆహా! వాని కెట్టి దుర్బుద్ధికల్గె? వానిని బట్టియె కళింగదేశంబంతయు.కూడ పాపభూయిష్టమై యున్నది.

సీ. ప్రతిమానవుండును ప్రాచీనవిధులందు
సంశయంబందగా సాగదోలె
చెవులకానందంబు చేయుచుండినగాని
శాస్త్రపురాణముల్ చదువబోరు
ప్రతివిషయంబును బాడిజూచినగాని
నలికమైనవిధుల నమ్మబోరు
మత్తుపదార్థముల్ మస్తుగొల్పెడునట్లు
తాగ్రి యశ్రద్ధతో దలరుచుండ్రు
గీ. దేశమంతయు నిట్టుల తేజరిల్ల
నైకమత్యమే యనుమాట లంతరించె

దయయు సత్యంబునాదిగా తరిగిపోవె
కారుభర్తలు వచిన కాంతలకును.

మరియు,

గీ. చోరగణములు వర్ధిల్లె క్రూరులెచ్చె
దోపిడులుమోడు; భార్యలదొంగిలించు
దేశమంతయు గలిత్రోడ దేఁరిల్ల
కారునాథులు వలచిన కాంతలుండ.

కానిమ్ము ఏమయినను సరే; నే నీక్షణము నామిత్రుఁడగు కాళిందునిగూడి రూపవతిసంగతి మాధవునికెరిగించి పిదప మణిపురంబునకేగి మదనమోహనుని వ్యాధి నివారణచేయువాడను. కాళిందుడు వైద్యశిఖామణియగుటవలన నావ్యాధి నివారణచేయగలడని నాకు దృఢనిశ్చయము. పరహితార్థఘాతకుండును, అసూయాపరుండునగు విక్రముని హతమార్పవలెను. నేను వాని యుదంతంబంతయు వెల్లడిచేసినచో నాకు తప్పక యూపిరివిడచును. లేనిచో నాదుర్మార్గుఁడు రూపవతిని నన్నును మదనమోహనునిగూడ నాశనముచేయును. మదనమోహనుని వ్యాధినిగురించి పిదప విక్రమునిరోగము కుదిరించెద. వాడు నిజముగా మిత్రద్రోహి— దేశద్రోహి— ఆద్రోహికి ప్రతిద్రోహమే ప్రతిక్రియ. అదియునుంగాక విక్రమునికి ప్రోత్సాహము జేయువాడు విజయసేను డుండెను. భరతరాజ్యాధికారిణియగు జగన్మోహిని నాశ్రయించి ప్రేమయు ననురాగంబును వడసి, రాజ్యంబు తానే పొందవలెననుకొని మోహనునేల చంపవలెను? రూపవతికేల దర్శనమీయరాదు? ఇదంతయు నిశ్చయముగా విజయుని ప్రోత్సాహమే. వానిదుర్బుద్ధియే "పుట్టుకలోపుట్టినబుద్ధి గిట్టినతోడనే పోవ" వలెనుకదా? వాని విపరీతంబులను నేనే వినాశనముచేతును. వానిపాలిట కాలుఁడ నేనే యగుదును. (బిగ్గరగా) ఓరీ! దురాత్మా! తుచ్ఛా! మ్లేచ్ఛా! నీచా! ఎంత క్రూరకృత్యములకు సిద్ధపడితివి! నాభాగ్యమా— నేనే— [illegible] కు దెలియకుండ దొంగిలించెదవా? నాకార్యముల కడ్డువచ్చెదవా! ని

వు నామిత్రునిజంపి రాజు కాఁదలంచితివా? చూడు నీయాగ డంబుబరిమార్చెద (కత్తిత్రిప్పును)

గీ. విక్రముని కంఠరక్తముఁ బీల్చువాఁడ
పేగులను మెడచుట్టును పేర్చువాఁడ
వీరనరసింహరీతిగా వెలయువాఁడ
లేనిచో తలగొరిగించుకొనెడువాఁడ.

(విజయుఁడు కత్తిదీసి చరుపుచు ప్రవేశించును)

విజ—ఓరీ!

ఉ. ఎవ్వఁడ వీవు నీదు పురమెయ్యది మాభవనంబుఁజేర నీ
కెవ్వడు దారిసూపె నిటకేతెర నీయధికారమేమి మా
జవ్వనిరొుద్దనేమిపని జాలముసేయక తెల్పు మీక్షణం
బివ్వనమందు లేనియెడ నిక్కడనే తెగవేయుదున్ జుమీ.

జయం—(తనలో) వీని విసరు సావధానంబుగా తెలిసికొనియెద. [ప్రకాశముగ] అయ్యా నే నొక సామాన్యమానవుఁడను. నాది విజయపురము, రూపవతికి వార్తఁదెల్పితి.

విజ—(బిగ్గరగా) ఏమని ?

జయ—రూపవతి తండ్రి మరణవేదనలో నుండెనని

విజ—అయిన నీ వేమిచేతువు?

జయ—తీసికొనిపోవుటకు వచ్చితిని.

విజ—(ఆశ్చర్యముతో) తీసికొనిపోవుటయా! నీవు కాదు— హాంహాంతాదులకైనఁ దరముకాదు. నీవువచ్చిన వార్తఁదెల్పితివి? క్షమించితిని పొమ్ము.

జయ—(కొంచెముకోపముతో) ఏమి! నీవు నన్ను క్షమించువాఁడవా! నీవు నాయెదుట నెంతవాఁడవు నాకార్యార్థము వచ్చినందులకు నీవు దూషించువాఁడవు నేను పడువాఁడనా? తాలనాడకుము.

విజ—ఓరీ! నీచాధమా! దుర్మార్గా! నిన్నిందులకే శిరఃఖండనము చేయవలసియుండ, క్షమించినందులకా మిగుల పేలెదవు? ప్రాణ

ములఁదక్కించుకొనిశేగ మేపొమొదవా లేక నన్నుబంధుమనెదవా?

జయం——విజయసేనా! పోనిచో నీవునన్నేమిచేతువు? నీకఠినవాక్కులు నావీనులందు ములుకులవలె ప్రవేశించుచున్నవి. అన్యాయముగ పేర్లి యెలసీయుక్కడగించు కొనెదవు? నీవాజియందునిక్కవం బుగ పరాజితుండవు కాగలవు. బ్రతికియుండిన బలుసాకు తిని బ్రతువచ్చును పేలకుము.

విజ —(కోపముతో) ధైర్యమున్నచో యుద్ధమునకు రమ్ము పిరికిపంద వలె—ఆడుదానివలె—మాటలుసెప్పెద వేటికిఇదియానీపౌరుషము నీధైర్యస్థైర్యములు.

జయం——నేను నీయెడల సామదానాది విధులఁజూపదలంచితినికాని సా గనట్లు కన్పట్టుచున్నది ముండమోయవచ్చునుగాని నిందమోయరాదనునట్లు నీమాటలువినిన మదీయరోషానలజ్వాలలు శరీరమునందు ప్రజ్వలించుచున్నవి. వానికినీవాహుతికాగలవు. నీ పల్కుల విని నే సహించలేను.

ఉ మానముకల్గు దీను డవమానముఁబొందిన నించుకంతెయున్
దానిని నోర్చఁగాగలడె తద్దయుకోపముచేత ముందుగా
కాననమందునుండు రవికాంతము ప్రాణములేనిదయ్యు తే
జోనిధి భాస్కరుండటకు సోకినమాత్రన, వెల్గకుండునా!

విజ —ఓరీ! నీకు కోపమువచ్చిన నన్నేమిచేయుదువురా? కోపమువచ్చి నపుడు పిరికిపందవలె మృదుమధురంబుగ నీతిబోధసేయు నీపలుకులెవరు పాటింతురు? మరియు నీవు నాకు బుద్ధిసెప్పువాడవా? నీవు రూపవతికొరకువచ్చియుంటివని నేనెరుంగకపోలేదు. నీదుర్బుద్ధి నాకు తెలియును. ఓరీ! నీచాధమా! ఎవడవురా నీవు? నీకింత పొగరేటికి—

చ. ఎవడవురాదురాత్మ యిటు కేందునిమిత్తము వచ్చినావు నీ
వెవడవొ కాని మాభవనవెక్కట నీ కధికారమేమి నీ
కెవరిటదిక్కు నీకు శిరమిప్పుడె భేదముచేసి మొండెమున్

భవనము పైనగట్టెద నహాయభయాంకర మీయనేరికిన్.

(ఇద్దరును కత్తులందూయుదురు)

జయ—(తనలో) ఈతండు ముందుగా కయ్యంబునకు గాలు దువ్వుచు న్నాడు. నే నదియే కోరుచుంటి వీడు మొరకుకుకయని నాకు తెలియును. ఈసమయమున వీని యుక్కడగించినచో మరల మరల వీని పోరుండదు (కోపముతో) ఓరీ! వినుము

ఉ. క్రూరుడు క్రూరుడంచు పలుకూతలుకూసెద వేమిరా సదా మీరినపల్కులేల? యని మిత్తుమహాత్మశివాదశీల! ని ష్కారణవైరమేల? సఖిగాం మటకై యిటురాగ నీతిర స్కారపుపల్కులన్ వినిన శాంతమునాహృదయాన నిల్చునే?

విజ—నిలుపనిచో యుద్ధమునకు రమ్ము. (దగ్గఱకుబోయి) ఓరీ! నీవు జయంతునివలె నుంటివే— ఆహా! నాకోపము ముంచితివిరా దు రాగ్రహా! కాచికొమ్ము (మీదపడును)

జయ—నాపేరు వీరజయంతుడు ఇదియే కాచికొమ్ము.

(ఇద్దరును యుద్ధము జేతురు)

(విజయుడు క్రిందపడును, జయంతుడు పైనమండికత్తినెత్తును.)

(తెలో) ఓరీ! మాభవనముం జేరి యెంతపని జేయుచుంటివిరా?

జయ—(లేచి తనలో) లోననుండి వీనికెవరో సహాయము వచ్చుచు న్నారు. నాకార్యము నేను పోయెదను. వీని పని మరియొక సారి చూతునుగాక.

(అని పరువిడును— తెరవాలును)

ఇది ప్రథమాంకము.



# విజయవిక్రమ

## ద్వితీయాంకము.



ప్రదేశము—లక్ష్మీపురము.

(మదమోహనుడు కూర్చుండును — ప్రవేశము జయంతకాళిందులు)

జయ—మిత్రమా మోహనా! కుశలంబుగా నుంటివికదా?

మద— అంతయు నీచేతిచల్లదనమే కదా?

జయ—మిత్రమా! పరాపకారపరాయణత దుర్మార్గుల సహజధర్మము గాదా? మరియు,

ఉ. పుట్టిననాటినుండియును బుద్ధులు తస్కరవృత్తిగోరు చే
పట్టిన దెల్లఁ బట్టుమగు బాటలఁ గొట్టి ధనంబుగూర్చుచున్
పట్టుగ నన్యకార్యముల పాడొనరించుటకు న్నసూయకున్
యొట్టల పొట్టనింపి చరియించుటకున్ జనియించుదుర్జనుల్

మద—జయంతా! మనమిప్పుడు చేయవలసిన కర్తవ్యమేమి?

జయ—యేమియు లేదు. నీవ్యాధినివారణమైనదికదా? ఇంకవిక్రముని తిక్కకుదిరించవలెను. నేను రాణియొద్దకేగి విక్రమునిసంగతి బయటపెట్టెద. వానికి గర్వభంగమును మానహీనమ్మును జేతును. వాడు మిగుల క్రూరముగా చరించుచున్నవాడు.

మద—రాణితో నేమి తెల్పుదువు? నాసంగతినేమియుజెప్పకుసుమా?

జయ—నీసంగతియేమియు గాదు అంతయు నాసంగతియే.

మ— సరే చెప్పుము,

జయ — నేను వనపురభవనంబు జేరినసంగతియు, నీవ్యాధినివారణ చేసిన సంగతియు, వినిన విక్రముడు మిగుల పరితపించును. వానికి వినాశకాలము వచ్చెను. అందువలననే విపరీతబుద్ధులుకలైను.

మద — మిత్రమా! నీవిట్టులైన వానిని రాణి దయకపాత్రుడుగా జేయవలెను. రాజ్యభ్రష్టత కల్గజేయవలెను జనులందరు వాడే రాజగునని తలంచుచున్నారు. వానిని విఫలమనోరథుగా జేయ సాధింపవలెను.

జయ — అటులనే. నీవిదియే జూచుచుండుము. వానిని ముప్పతిప్పల పెట్టెదను. కడకు వానితో యుద్ధమొనజేసి రూపవతికి సౌఖ్యమిచ్చెదను. లేనిచో మరణించెద.

ఉ ఎప్పటికైన విక్రముని నేబరిమార్చెద నింక వానినే
నెప్పటికైన కష్టగిరులెక్కగ జేసి హతంబుచేసెదన్
యిప్పుడమిన్ మనీయబలమేరికినైన నెరుంగజేతు రా
ణిప్పుడువచ్చినన్ దునిమినే జగమెల్ల భీకరంబుగాన్॥

మోహనా! సామదానాదివిధులు వానియందు బ్రయోగింపలేము. భేదదండోపాయములే యుత్తమము. వాడు దేశద్రోహి. భరత ప్రజాద్రోహి. వాడు చెప్పెడిదెల్ల కల్ల — చేసెడిదెల్ల మోసము— మిత్రమా! నేను బోయివచ్చెను. నాపనియందు నేనుండెద. నాకు సెలవొసంగుము.

మద — మంచిది విక్రమునికిని నాకును స్నేహభావంబు గల్పించెదనని రాణినుడివివెళ్ళినది తానుపోయియూరు గబుసంపువట నీవు రాడ నాసనుయమునే రమ్ము. అంతవరకు జాగ్రతగానుండుము. నీకు దైవసహాయము కల్గుగాక! నీ కార్యము బుద్ధిజయప్రదముగ నెరవేరుగాక!

జయ — మిత్రమా పోయివచ్చెద. (నిష్క్రమించును)

మద — (తనలో) ఆహా! మోహాంధతచేతను, అసూయచేతనే కదా విక్రమునికిట్టి బుద్ధికల్గె. మోహాంధకారాబంధురంబగుమంకు వారెట్టి కార్యమునైన సాహసింతురుకదా?

గీ. ఆత్మహత్యయు పరులకు హానిజేయు
భయము భక్తియు తిండి ప్రపంచకంబు
విడచు, వైరియై చరియించు వీధులందు
కడకు వైరాగ్యమనుచు శృంగారమనుచు
కోటినడుమను వేలాడుచుండి దారి
లేక కూలిపోదురు నొష్టలిఖితమనుచు.

నిష్కారణముగా— నిర్హేతుకముగ— అన్యాయముగ— నాకు మందువెట్టించి చంపించి తాను రాజ్యాక్రాంత వహింపదలంచెనా? అట్టి సంగతి నేను మున్ముందుగా తెలిసికొనిన దెల్పెడివాడను. వేళమీరినది. విరోధమున్నవారియెడ పౌరుషముజూపి యుద్ధమునకు బిలువవలెగాని యాడుదానివలె తెలియకుండమందుబెట్టించుటయా పౌరుషసూచకము

ఉ. మానవుడాజియందు నిసుమంతయు జంకక శౌర్యధైర్యమున్
బూనికతోడ జూపుటయె పూరుష పౌరుషకీర్తి వెల్గగా
దీనుడు పల్లుయందు తోలిదేవతలందరు మెచ్చునట్లు తా
కానక కౌరవాదులతో కయ్యమొనర్చి చెలంగలేదొకో.

ఆవిపౌరుషసూచకంబులుగాని, చాటుగకొట్టుట కోపమువచ్చిన బావులలో దుముకుట పౌరుషమా! ఔను— కూరులకు మంచియుద్దేశమెట్లుకలుగును? పరుల కపకారమందే వాంఛాపరివృద్ధులైయుందురు.

చ. సతతము దుష్టుడు పరసంపదజూచుచు నోర్వలేక వా
డితరులకార్యమందు దనకేమియు లాభములేకయుండినన్
హితముగజేరి నాశనము హెచ్చుగజేయుపదార్థమందు నీ
గ తన విషంబురాల్చి పరకార్యము పాడొనరించురీతిగా.

వీని మాటలన్నియు రాణికడ దేలగలవు. నామిత్రుడు వంతము బూని యున్నవాడుకదా? వానికినేను సహాయముచేతును. సాధ్యమై వంతవరకున్వానికి సద్విధులను బోధించి సత్సాంగత్యములో బెట్టెద. లేనిచో నాపైసంగతి నాలోచించెద. (నిష్క్రమించును)

2 వ రంగము.

(ప్రవేశము—విక్రమునకు)

శా. ఆరంభించి పరిత్యజించవిక నా వైశ్వర్యముల్ పోయినన్
మారాగ్రి పలుభంగినన్ ప్రబలపత్నా శోకాబ్ధిలో మున్గినన్
పారావారము జొచ్చినన్ విడవనా పాత్రిజ్ఞా వినాధమున్
ప్రారంభించిన కార్యముల్ విడతునా ప్రజ్ఞాదికముల్ జూపనా.

నారాణికి దెలియకుండ రూపవతిని వివాహమాడితినికదా! ఇక నాకేమి భయము. జగన్మోహిని నాయందసమానకరుణారసంబుజూపించి సర్వరాజ్యాధికారత్వమీయగలదు. నేను వివాహమాడిన కన్యాలలామను జయంతుడుకూడ ప్రేమించి దొంగిలించుటకు యత్నించుచుండెనని విజయునివలన దెలియవచ్చినదికదా! ఆదుర్మార్గుడు నాభవనంబునజేరుటయే కష్టము. నాభార్యను వీక్షించుట కష్టతరము. పల్కరించుట కష్టతమమని వేరె చెప్పనేల? నేనుచేసిన కట్టుబాటులను మీరి రూపవతి వానిచే జిక్కనుట స్వప్నగతవృత్తాంతము. నారాణిని ప్రేమించిన మదనమోహనుడుండెను. వానికి విషమిప్పించితినికదా? వాడిప్పటికే కాలగతప్రాయుడై యుండును. ఇంక నాకేమి యడ్డులేదు, భరతరాజ్యాధికారము వహించుటకు వారసత్వముండదు. ఆహా! నే నెంత టియదృష్టవంతుడను నాపు కాక్రుతకర్మఫలము మంచిదై యుండును. నిజముగా నేను రాజైనచో రూపవతిని పట్టపుదేవిజేతును. జయంతుని రాజ్యభ్రష్టునిగా జేతును. జగన్మోహినిని నాప్రక్కగూర్చుండబెట్టుకొనుట స్మృతినొందిన మదనమోహనుడు నన్నేమిచేయును? ఏమియును లేదు. అప్పుడు నేను బహునెమ్మదిగా పరిపాలించెద.

సీ. జ్ఞానినై పరమవిజ్ఞానినై ప్రజలను
కట్టుబాటులయందు బెట్టువాడ
స్వాంతనై విమల సుస్వాంతనై సభ్యుల
మంచియాదరణ గావించువాడ
గణ్యనై ధర్మాగ్రగణ్యనై దైవభ
క్తినభివృద్ధియొనర్చి గెలుచువాడ

శూరుఁనై విక్రమవీరుఁనై దేశదే
శముల సామంతదేశముల జేతు

గీ. దాంతుఁనై నేను పరమవేదాంతినగుదు
పాపినై క్రూరులకు మహాపాపినగుదు
రక్షకుండజనంబుల రక్షకుఁడను
ఇటుల జగమేలి కీర్తినహించువాఁడ.

ఇక నాకు స్థైర్యంబు కల్గుచున్నది.

సీ. రాజువై ధైర్యమా! నిజమనోరాష్ట్రాధి
పత్యంబు వహియింపు ప్రాజ్ఞతోఁడ
మంత్రివై జ్ఞానమా! మహితయశోండగు
నేలిక చెంగట నిలువుమిపుడు
భటులై వివేకసుస్వాంతంబులార! భూ
పాలచంద్రుని యండ నిలువుమిపుడు
ధీరవై ఖడ్గమా! దేశదేశంబుల
నీరాజుప్రఖ్యాతి నిలువుమిపుడు

గీ. హృదయమా! రాజ్యలక్ష్మికిసిందరండ
నుండనింక భయములేదు ఉత్తమపద
వి నిలువుమిపుడు నీకెట్టి వెతలుకూడ
గలుగనేరవు ప్రఖ్యాతి గాంచగలవు.

నే దలచినకార్యములు నెరవేరినవి. నేను ముందుగతి నాలోచింపవలెను. నన్ను మనసారవరించి నన్ను వెంబడించిన రూపవతికి— నా పూఁబోఁడికెట్లు సుఖంబు గూర్చెద. వివాహమాడిన నాటినుండియు దానిఁజేరలేదు. నాకై యెంతపరితపించుచుండునో కదా? ఆమెసంగతి రాణికిఁ దెలిసినచో నన్ను దూషించును. మిగుల తూలనాడును. అనురాగ మడుగంటును. ప్రేమసూత్రములు తెగును. నేను వృద్ధిఁ బొందుట కవకాశముండదు. నేను రాజ్యభ్రష్టుండనగుదు. సర్వబాధలు పడవలసియుండును. ఇది నిశ్చయము. ముమ్మాటికినిశ్చయము. కావున

నే నిప్పటిలో నా మోఁ జేరను. కొన్ని దినంబులయినతరువాత బోయెద. అప్పటికి నాకడ్డువచ్చువారుండరు. (ఆగి) వనపురంబుననుండి నేను విజయుఁడు రానికారణం బేమైయుండును. ప్రతిదినమును నాకువార్తఁ దెల్పెడువాఁడుకదా! నేఁడురాని విషయ మేమి? ఓహో! రూపవతికూడ నా కడకుఁ బయనమాయెనో లేక మదనమోహన మరణంబు జూచుటకేఁగెనో! మంచిది. వాఁడిందుల కిప్పుడే రాఁగలఁడు. ఆహా! నాకార్యములకు దైవసంకల్ప ముండనలెను. లేనిచో నెరవేరదు. ఇప్పటికైన నా ప్రతాపములు జయంతునకు దెలియకుండునా! వాని ప్రయత్నములు మంటగలియుచున్నను నాసామర్థ్యం బెరుంగఁడా?

శా॥ సామర్థ్యంబులు మంటగల్పినను నాశౌర్యమ్ములో గెంటినన్
నామిత్రుండికఁ దిట్టినన్ మరియు నానా బాధలందించినన్
మేమే పౌరుషవంతులౌదుమనుచున్ మీఱంగ గర్వంబు నా
కామక్రోధమదాంధులన్ అణచు నాఖ్యాతిన్ యెరుంగర్గదా.

నేను జగన్మోహినిని నావలలో నైచుకొని రాజ్యము సంపాదించి భరతభూమి యంతయు నాయిచ్ఛకువచ్చినట్లు పరిపాలించెద.

సీ. పీఠైనవ్యవసాయ వృద్ధిచేయింతును
భరతఖండము జేతు బాడిమూపు
పరదేశములతోడ వాణిజ్యముస్సల్పి
జగమంతయును జేతు లేగదూడ
మిగులపరాక్రమవీరుల నిర్మింతు
గోవులగా పాడ గొల్లలుగను
నేను శాంతుండనై సానుభూతినిజూపి
భీకరంబుని నధమించువాఁడ

గీ. అహాహా? నాకెట్టి యిక్కట్టులందవికను
చేతిలో బట్టియుంచెద చెలువుమీర
నాజయంతుని మదన మోహానునిఘూరి
బంధుమిత్రాదులందఱి బ్రతుకనీను,

(తెరలో) మిత్రమా! రక్షింపుము— రక్షింపుము—

విక్ర—(అదరిపడి లేచి వెదకుచు) యెవరది! నామిత్రుడు విజయుడువలె నుండెనే (కత్తిదూసి) విజయా! నీప్రాణరక్షణకై వేచియుంటిని రమ్ము. ఎవరు నీశత్రువు (దిక్కులుపరికించుచుండును.)

(విజయుడు పరిగిడి ప్రవేశించును)

విజయు—(రోజుచు) మిత్రమా! నా ప్రాణములు— కాపాడుకొని— వచ్చితి లేసచో— అజయంతుడు— నన్ను— జంపువాడే— మనము— భూరిపరాక్రమ— విక్రములమై— మిగుల— భుజాబలంబు— గలవారమై— యుద్ధమున ప్రవీణులమై— వీరులమై— బ్రతికియుండిన నేమిఫలము. ఏటికీ పాడుజీవనము—

గీ. బ్రతికియుండిన మాన్యుల మస్తక ప్ర
దేశములనుండవలెగాని దేశద్రోహు
లై పరాక్రమహీనులై యరికిలొంగి
బ్రతుకుటకంటె లక్ష్మీసము మరణము మేలు.

విక్ర—మిత్రమా! ఊరడిల్లుమూరడిల్లుము జరిగినవృత్తాంతంబు విపులముగా దెల్పుము.

విజయు—

సీ. అజయంతుడు పోయెననుకొన్న నీసతిన్
భవనంబులోపల బలుకరించె
పలుకరింపగవాని బట్టినరుకబోవ
క్షణములో కత్తినా జంపబోయె
మదనమోహాన మహావ్యాధిని గుదిరించె
మనలను జంపెదననియెనచట
శ్రీమహారాణితో జేసినకృత్యముల్
తేటతెల్లంబుగా దెల్పెదనని

గీ. నీదుభార్యనుగొంపోవ నెంచినాడు
మనల జంపంగబ్రతిమను బూనినాడు

భంగపడినాము మూర్ఖుని వలలలోన
జిక్కినారము వెలికెట్లు చేరగలమో.

విక్ర—(ఆశ్చర్యమున) ఎట్లు బంగపడితిమి? సత్వరంబుగ దెల్పుము.

విజ—మిత్రమా! జయంతుడు భవనములో బ్రవేశించి రూపవతిని దొంగిలింప బ్రయత్నించెను. కాని ఆపె చిక్కలేదు. వాడు—

విక్ర—అప్పుడు నీ వేమిచేయుచుంటివి?

విజ—నేనా! దక్షిణద్వారమునొద్ద నుంటిని.

గీ. దక్షిణద్వారమందుండి యక్షులైన
భవనముంజేర శక్యమె? ప్రాణమిత్ర
ఉత్తరద్వారమందుండి యువిదకడకు
పోయి యాపెను జూచెకాబోలు నయ్య.

నాకంటబడిన నూరకుందునా?

విక—అయిన నీకెట్లు హానికల్గె?

విజ—వీరాగ్రేసరుడా! అదియె తెల్పెదను. వాడు తిరిగి వచ్చుచుండగా నాకంటబడె కాని నాదగ్గర తోసుకొని వచ్చెను.

గీ. మిగుల కోపవేగముననే మీదపడితి
కాని చిక్కతి నాపరాక్రమునిచేత
నేమి చేయుదు సజ్జంపు నేమొయుని భ
యపడి కేకలుపెట్ట మోహనుడు వచ్చె,

అంతనా జయంతుడు పారిపోయెను.

విక్ర—ఏమి నీవంటిపరాక్రమవంతుడే యోడి పరాజితుండాయెనా? వానిని నేను జయించగలనోయని సందేహముకల్గుచున్నది, ఎంత పని— మిత్రమా! నీకేమియును భయములేదు. నీ వీక్షణమేగి జయంతుడెందుండెనో చూచిరమ్ము. నియాపద నేను రక్షించెదను. మనమిద్దరముగలసి వానిని సంహరించుదము. ఆలస్యము చేసినకొలది వాడు విషతుల్యమగును.

విజ—మిత్రమా వాడంతటితో నూరకుండలేదు. మదనమోహనుని వ్యాధిని గుదిరించెదను. నీసంగతి రాణికి తెల్పి మీయిద్దరకును స్నేహముగల్పించునట

విక్ర—(ఆశ్చర్యమున) ఏమి మదనమోహను డింకను బ్రతికియుండెనా? నిశ్చయమేనా?

విజ—నిశ్చయమే

విక్ర—(తనలో) అకటా ఎంతఘోరమాయెనది? రూపవతిని దొంగిలించి ననాడే జయంతుని నునుమాడిన మనకే మనస్సంతాపముండదు కదా? ఇప్పుడింత విచారించిన నేమిఫలము. (ఆలోచించి) యిప్పటికయిన మించిన దేమున్నది. [ప్రకా] మిత్రమా జయంతుడు రాణికడ కెప్పుడేగును?

విజ—మదనమోహనుని గూడ దర్బారున కేగును. మీయిద్దరకును స్నేహముగూర్చుననియు జయంతుని విషయమాలోచించుననియు రాణి వాగ్దానమొసంగినట్లు తెలియవచ్చినది ఆమెవారికై కబురంపినపుడు రమ్మని చెప్పి పోయెనట.

విక్ర—మంచిది విజయా ఇప్పటికయిన మించినదేమున్నది. జయంతుని బరిమార్చిన సంగతులేమియు బయటబడవు. పిదైన మదనమోహనునిగూడ నట్లేచేయుదము. నీవు సత్వరముగఁబోయి వాని యునికిపట్టు గనిపట్టుము. పోయిరమ్ము.

విజ—అటులనే పోయివచ్చెదను. నీ విచ్చోటనేయుండుము మరల వచ్చునప్పటికి ప్రయాణసంసిద్ధుడవు కమ్ము (నిష్క్రమి)

విక్ర—(తనలో) ఓసీ! జయంతా మాధవసంపెట్టకేలకు చేరితివిగా—

శా. ఓసీ నీచజయంతుడా యటకుమాయోపాయమున్బన్ని యీ
శూరాగ్రేసరు భంగపర్చగలవా చూడింక నీవిక్రముం
డేరీతిన్ జరియింపుచునో మదము నేనే బాపలేకున్న నా
పేరీవిక్రమవీరుడేల, తగునే పేరున్నమాత్రింబునన్

ఆహా! మదనమోహనుండింకను బ్రతికియుండెనా? ఇంకను ప్రాణములు విడువలేదా— నిజముగా జీవించియుండెనా— ఓరీ దుర్మార్గా దుష్టజయంతా ఎంతకార్యమునకు గాలుదువ్వితివి— ఎంతపనికి కత్తిగట్టితివి— నాయదృష్టమునకు పెద్దమ్మవలె నుంటివే! నిన్నెట్లు సాధింపగల్గుదును— సామము చిన్ననాడే పోయెను. దానముచేత సాధ్యముకాదు భేదదండోపాయములచేతనే సాధింపవలెను. నీవేమియు నెఱుంగని యమాయకుడవని తలంచితినే! శాంతమూర్తివని తలంచితినే! నివురుకప్పిన నిప్పువలెనుండి యిప్పుడు జ్వాలలఁ బ్రజ్వలింపఁజేయుచుంటివా? ఎంతమనోవ్యాకులము కల్గించితివి? నాకు ప్రతివిషయమునం దడ్డువచ్చుచుంటివా? నానోటికడజీవనము దీయఁదలంచితివా? నేను ప్రేమించినకన్యాలలామను— సౌందర్యతిలకను— నీవు మోహించి నాయొద్దనుండి యపహరింపదలంచితివా? రాజ్యాధిపత్యము వహింపదలంచి మదనమోహనుని నాకు వారసునిగా బంపెదవా? రాణిపై బరపిన ప్రేమ రజ్జువుల దెంపదలంచితివా? ఏమి నీధైర్యసాహసము— నీమనోనిబ్బరము— నీచాకచక్యము— అన్యహితకార్యఘాతక నిపుణత్వము— నీవు నాప్రక్కలోని బల్లెమువలె నుంటివే! దానినిప్పుడే పెరికి నీకెదురుపెట్టెదజూడుము. నాపేరు విక్రముడు— సార్థకనామధేయుడని నీవెఱుంగవా? సరియే కాచికొమ్ము, నాయుదంతంబంతయు రాణికడ జెప్పకమునుపే నీయంతంబు జూపెదలెమ్ము. అరెరే! నీకీదుర్బుద్ధి— విపరీతమెవ్వరు కల్గించిరి. నీవు గ్రేను పుట్టెనా లేక వెనుకజన్మంబుగో క్రూరమృగంబవై జన్మించితివా? నీదుర్బుద్ధి నేనే బాపెద. జూడుము. (లేచి) ఆహా! తన తప్పులెన్నుకొనక నాతప్పులెన్ని రాణికడజెప్పునుగా! వాడెంతటిదేశద్రోహి కాడు!

సీ. ధూర్తుండయి పరమదుర్మార్గుడై జరా
వళికి పెద్దపులివై వఱలినావు
మోహాంధకారమున్ మునిగి జనావళి
కట్టిత్రోవను జూపగల్గినాఁడు

కుట్రలుద్రోహము కుచ్ఛితంబునసూయ
నేర్పినగజదొంగ నేర్పరితడు
పరకొంపలనిధిలోపల ముంచుదమటంచు
తిరుగుచుండెడి దేశదిమ్మరితడు

గీ. అట్టిద్రోహాత్మకుండీతడన్యకార్య
ఘాతకుండు నీచాధముండితడుచూడ
నేనువానిని గూల్చెద నెలదినముల
లోన లేనిచో విడుతు నా ప్రాణమపుడు

అట్టి ద్రోహికి ప్రతిద్రోహమే తగినశాస్తి. నే నిదేపోయి విజయుని గలిసికొనియెద. ఇద్దరముకలసియుండిన మంచిది.

(సేవకుడు ప్రవేశించును)

సేవ—అయ్యా భరతరాజ్యాధికారిణియగు జగన్మోహిని అమ్మగారు మిమ్ములబిలువుమని యాజ్ఞాపించినారు. కాన సత్వరంబుగ మణిపురంబునకు బయలుదేరరండు.

విక్ర—సేవకా! ఆమె నీకుచెప్పుచుండ నవరెవరుండిరి.

సేవ—చిత్తం. మదనమోహనయ్యగారు

విక్ర—సరియే వచ్చుచుంటినని తెల్పుము. ముందు నీవేగుము.

సేవ—చిత్తము (నిష్క్రమించును)

విక్ర—(రొమ్ముపై చేయివైచుకొని) అకటా నాకనర్థకదినములు చేరుచున్నవి కాబోలు. నేను జగన్మోహినికి ప్రియుండనై సర్వరాజ్యాధికారత్వము వహింపదలంచి మిగుల సంతోషముగా నుండ నా కీదుర్వార్తయేమి— నాయాశలన్నియు నిరాశలయ్యెనే— నాసుఖజీవనంబంతయు మంటగలిసెనే— నిస్సందేహముగా మదనమోహనాదులు నాపై రాణితో గొండెములుచెప్పియుందురు. అది విచారించుటకే నన్ను బిలచెను. అక్కటా! తలచినకార్యములు భంగపడునెన్న డెరుంగనే— నాకెట్టి యిక్కట్టు

సంభవించె— నా ప్రాణమునకందరు విరోధులాయెనే— నారూప వతికూడ నన్ను దూషించుచుండె కాబోలు. కానిమ్ము. రాణి తోఁ యాబద్ధమాడి నాకేమి తెలియదందును నా ప్రియురాలు నాకు కష్టముల గూర్చునా? నాకష్టములు తానుసహించునా? నగముకష్టము తానుగూడ ననుభవింపవలసినదేకదా! భగవం తుని కృపవలన రాణి నామాటనమ్మినా నాయంతటివాఁడుండు నా! జయంతుని ముక్కలుగాఁ గోసి. కాకులకెగర వేయునా? ఒక వేళ నాపై యపవాదుకల్గినను నన్నేమిచేయును? నన్ను కాంతా గారాంతరంబునసుంచి తానేమి చేయును- అట్లెన్నటికి జరుగదు. అదినాకు బాగుగా తెలియును. (ఆలోచించి) నా ముత్తుండింక ను రానికారణంబేమైయుండును? మరల యుద్ధము చేయుటలేదు కదా? సరియే వానినెట్టులయిన బరిమార్పవలసినప్పుడెన్నియు ద్ధములు జరుగకమానవు? ఎందరు మోసపోరు- యెందరు హతు లు కారు- నాకుఫలముకల్గిన నంతియేచాలును. నేనిదేపోయి రా ణిని దర్శించెద. దైవయుక్తముండిన మరల రాణియనుగ్రహ ము వడసిన భరతరాజ్యాధిపత్యము వహించి మదనమోహన జయంతాదుల రాజ్యభ్రష్టులుగాఁజేసి రూపవతిని పట్టపుదేవిగా జేతును, రాజ్యమును నూతనకట్టడములతో నవీనచట్టములతో విరాజిల్లఁజేతును. (నిష్క్రమించును)

ఇది ద్వితీయాంకము.

---

శ్రీ

# విజయవిక్రమ

## తృతీయాంకము.

---

### 1 వ రంగము.

ప్రదేశము—మణిపురము—దర్బారు.

(రాణియు (జగన్మోహిని) మదనమోహనుడు సింహాసనముల నధిష్ఠించియుందురు)

రాణి—ప్రియుడా? మీరిద్దరును నన్ను ప్రేమించి నన్నాశ్రయించి మీ రిద్దరు విరోధముగా నుండుట పాడియా? నేను మీకు స్నేహంబు కూర్పుటకే యిందులకు రాపించియుంటిని. అందులకొప్పుకొని మెదరా!

మద—నా కేయాటంకము లేదు. జగన్మోహినీ! విక్రమునిమిత్రుడు విజయుడు నాకై వెదకుచుండినట్లు తెలియవచ్చినది. నీ విప్పుడు స్నేహంబు కూర్పనిచో తప్పక వైరంబు కల్గును. జయాపజయంబులు దైవధీనంబులుకదా!

రాణి—అదియంతయు నిప్పుడే విచారించెద. విక్రముని రానిమ్ము.

(విక్రముడు—ప్రవేశము)

విక్ర—(తనలో) ఈ దుర్మార్గుడిందు దాగియున్నవాడు. జయంతుండెందుండెనో విజయుడిప్పటికి వానిని బరిమార్చియుండును. ఇక నాకు ధైర్యమే. అందువలననే యింతవరకు రానికారణము [ప్ర

కాళముగ] ప్రేయసీ! నీకు జయంబగుగాక.

రాణి—ఎందు? పరులకపకారనిపుణత్వమునందా!

విక్ర—(ఆలోచించుచుండును)

మద—(తనలో) వీనిగుండెలో బండపడినది. వీనికి రాజ్యభ్రష్టతదగ్గరకు సమీపించినది. వీనిదుర్మార్గప్రవర్తనము నామనోహరి యెరింగె. వీనిని బ్రతుకనీయదు. వీడింక బదిమందిలో దలనెత్తడు. అది ముమ్మాటికి నిశ్చయము. ఈ సమయమున జయంతుడిందుల కేతెంచిన ధన్యుడను. వాడదృష్టవంతుడు

రాణి—విక్రమా! ఇది రాజదర్బారుకావున సరిగా జవాబీయుము. యిచ్చోట గూడినసంగతి నీకు తెలియునా?

విక్ర—నాకు తెలియదు.

రాణి—మీరిద్దరును విరోధముగా నుండిరని నాకుతెలిసినది. నీవు వీరిని బాధపెట్టదలచితివట. ఇంకనెన్నియో చేయదలంచితివట. నీకదిపాడిగాదు. శూరధర్మముకాదు. ఆర్యధర్మముకాదు. అసూయాపరులెన్నడును బాగుపడరు తమకై యన్యహితార్థఘాతకు లధమాధములు. వారు వృద్ధిబొందరు. కావున నామాటవినుము. మీరిక నన్యోన్యంబుగానుండుము. నీకట్టి యుద్దేశ్యమున్నదా?

విక్ర—(ఊరకుండును)

రా—ఊరకుండుట నిజమనియా భావము. నీకేమియును భయములేదు తెల్పుము.

విక్ర—(తనలో) అయ్యో! నే నేమిచెప్పినను బాధకరమే, అబద్ధము చెప్పిన నీమె నాశిరమును ఖండించును. నిజముజెప్పిన యనురాగము తగ్గును జయంతుడు మొదలయినవారు నన్ను మిగుల తూలనాడుదురు. సరియే నిజము తెల్పిన నిష్ఠురముండదుకదా? నిజమే తెల్పెద [ప్రకా] నిజమే,

రా—నీ చేయి వానిచేతియందుంచి నేనెప్పుడును క్రూరబుద్ధులందలం

పక నీతో స్నేహముగా నుందునని ప్రమాణపూర్వకముగా వ
ల్కుము.

వి|క—(ఊరకుండును)

రా—ఏమి? తప్పునియొప్పుకొనిన తరువాత సందేహించెద వేమి? ఇది న్యాయస్థానము. న్యాయాన్యాయ విచక్షణచేయు శాల. నేను విచారణచేయుదానను. మీరు విచారణచేయుబడువారు. దీని యందు మనయపూర్వ పూర్వ ప్రేమ పనికిరాదు. దీనినివిచారించిన మీరు కఠినశిక్షకు పాత్రులగుదురు. కాన నేజెప్పినటుల చేయుము. అట్లుచేయనిచో నాకపవాదుకల్గును. ఇకనాయాటలు సాగవు కావున నిప్పుడు మిమ్ముల నన్యులువలె చూతును. త్వరగా జవాబుచెప్పుము, లేనిచో శిరఃఖండనమే దీనికి శిక్ష.

వి|క—(మదనమోహానునివైపునడచి యూరకుండును)

రా—ఏమి నిలుచుంటివి. నేజెప్పినట్లు చేయుము. లేనిచో శిరఃఖండనమున కాజ్ఞ నిచ్చెద.

వి|క—(ఊరకుండును)

రా—మోహానా! నీఖడ్గమునందీసికొని వీనిశిరంబు ఖండించుము. (కత్తి నీయగా నొసగును)

మద—(కత్తినందుకొనక) న్యాయాధికారిణీ! పోనిమ్ము. వానిబదులు నే నసెదను

వి|క—(మదనమోహానునిచేతిలో చేయిబెట్టును)

రా—పల్కుము. లేనిచో నిదే నీశిరంబు ఖడించెద (కత్తి నెత్తును)

వి|క—నేనిప్పుడు నీ స్నేహముగానుందును.

రా—ఇప్పుడుకాదు ఎల్లప్పుడు

వి|క—ఎల్లప్పుడు

రా—(నెమ్మదిగా) ఇకనయిన స్నేహంబుకల్గినదా! (మోహానునితో) మోహానా! ఇంక నీకేభయమునులేదు. వీనివలన నీ కేయపాయముండదు. వి|క్రమా! నీవిక దుర్బుద్ధులను విడతునని నమ్మ

చున్నాను. నీకెవ్వరైన విరోధముగా నున్న యుద్ధమునకు బిలువుము గాని కత్తి బెంచుకొని కృశించుట న్యాయముకాదు.

విక్ర—ప్రియురాలా! పొరబాటైనది క్షమించుము. (ఆసనము నధిష్ఠించును)

రా—ప్రియులారా! మీరుశూరులైనపుడు శూరధర్మమిదికాదు, మీరు నాదగ్గరనున్నపుడు మీ రన్యోన్యమైత్రి గల్గియుండవలెను. లేనిచో చెరియొక దేశము బంపివేసెద.

(జయంత కాళిందు లొకవైపునుండియు—విజయసేనుడు భటులొకవైపునుండియు ప్రవేశింతురు)

మద—కాంతా! ఇతడే జయంతుడు. నావ్యాధి గుదిర్చినవాడు.

రా—జయంతా! నీవెచ్చటనుండి యేకార్యార్థము వచ్చియుంటివి?

జయ—అమ్మా! నావల్కుల సరిగా నాలకించుము.

గీ. వసపురింబునుండి నే వచ్చుచుంటి
రూపమునసాటిలేనట్టి రూపవతిని
బంధకానయందుంచిన వార్తవిన్పు
డా పతిండ్రి కెరిగించి యరిగినాను.

రా—ఆమె నెవరుబంధించిరి? విపులముగ జెప్పుము.

జయ—గీ. తండ్రియామె పెను నాకీయదలచుకొనగ
విక్రము డామె గొనిపోయి వెసగొట్టి
పుత్రికావియోగమునకు పొగిలి పొరలి
యేమియుంచక తలిదండ్రు లేడ్చుచుండె.

విక్ర (తనలో) అయ్యో నాకెంతదురవస్థకల్గె! ఒకటితప్పినది కదా యనుకొన్న—

రా—విక్రమా! నీవు దొంగతనముకూడ సాగించితివా? ఇదెంతవరకు నిజమో తెల్పుము.

విక్ర—దేవి! నే నాపెసంగతి—

విజ.—తల్లీ! ఆ పెనాభార్యయే యన్నడుగుము నే జెప్పెద—

విక్ర—ఛీ దుర్మార్గా!—

రా—ఏమి వానినేల తిట్టితివి ?

విక్ర—మరేమియును లేదు. సాక్షము వచ్చినందులకు

(తెరలో)

ఉ. భానుడునీటికై వెదకి పశ్చిమసంద్రము చేర పోయిగా
గానముసేయపక్షులు సుఖంబుగ జంతువులింటికేగగా
మీనులకు న్నదీధ్వనులు విందొనగూర్పగ చల్లతెమ్మెరల్
మానుగవీవగా జనులు పాడుచు నాడెడువేళ యయ్యెనే

రా—(ఆలకించుటనభినయించి) సాయంసమయమయినది ఇంక నే నే గవలెను. (లేచి) జయంతా! నీసంగతి మరియొకసారి విచారించెద. వజ్రపురభవనంబునకు నాలుగురోజులాగిరమ్ము. ప్రియులారా! మనమింక నేగవచ్చును. విక్రమా! నీవు రూపవతిని వజ్రపురంబునకు గొనిరమ్ము మరువకుము. ఇదినాయాజ్ఞ. సభాసదులారా! ఇక మీరేగవచ్చును. (అందరు నిష్క్రమింతురు)

(విక్రముడు నిలువబడియుండును)

విక్ర—(తనలో) అకటా! నాగతియెట్లులాయెను. నేనేదిక్కు జూచిన నంధకారంబుతే కన్పట్టుచున్నవి. నాప్రేయసిని రాణికెట్లుబజూవగలను. నేనాపెను దొంగిలించితినంటినా నేను రాజ్యభ్రష్టుండనై సర్వకష్టములను బొందెదను. అపుడు జనులు నన్ను వారకంటనయిన జూడరు. నామాటనమ్మరు. నేను మర్యాదహీనుడనగుదు. నాకువృద్ధికల్గుటకల్ల. రూపవతిని భార్యకాదనినచో నాపె సకలయిడుముల బొందవలసియుండును. ఆపె నాకై దుఃఖించి కృశించి మరణించును. ఆపె యుసురు నాకు దగులును నేను నరకప్రాప్తుండనగుదు. నావలన నాపెకు సుఖమేడ? కేళీవిలాసంబులేడ! మరియు నావలన ననేకపుంది ప్రాణములను విడతురు. మనోవ్యాకుల చిత్తులగుదురు. నాప్రయత్నంబులన్నియు మంటగలియును, అయ్యో నేబ్రతికియుండిన లాభమేమి! నేనెవ్వరి నాదరించి యెరుంగ, సుఖంబిచ్చియెరుంగ.

సీ. దేశాంతరంబుల దిరుగుటయేకాని
పురములో దర్బారు జరిపియెరుగ
నాముఖసందర్శనమునకు వచ్చిన
భూపాలురకు మోము జూపియెరుగ
ధనమంతయును సమితంబుగా వ్యయము చే
సితిగాని దానంబు చేసియెరుగ
జనులకొంపలముంచి జంపించుటేగాని
ఉపకారమున్న దేదో యెరుంగ

గీ॥ రాజ్యమంతయు మిగులనరాజకంబు
చేసినాడను నాకట్టి సిగ్గులేక
ఛీ ఛీ! కందర్పశరముల చేతనేను
కొట్టబడితిని సుఖమును గోరుచుంటి

అట్టి దుర్మార్గపుబ్రతుకు బ్రతికిన ఫలంబేమి? రూపవతిని రాణి యెదుట జూపించకుండ నేమైన నుపాయమున్నదేమో యాలోచింపవలెను. (ఆలోచించి) అయ్యో నాకు మనోవ్యాధి హెచ్చుచున్నది. నాకేమియు దోచుటలేదు. రూపవతి నాకనుకూలపర్చుటకు బ్రతికియుండెకాబోలు. జయంతుని విజయసేనుల యుద్ధము నామనోవ్యాధికొరకై జరిగియుండెగాబోలు. మదనమోహనుని వ్యాధి నివారణ నాదరిద్రహేతువుగాబోలు. కట్టా! నాకందరు శత్రువులైరే! ఇంక నెవ్వరినిబలుకరించను. రూపవతిని రాణికిజూపి తలనెత్తగలనా? పదిమందిలో నిలువగలనా? దైవమా! నాకెంతకష్టము సమకూర్చితివి? నీదయయున్నచో నాకే యుపాయముండదుకదా! నీవార్తతో నుపాయముంచవుకావా? నాకెట్టి యిక్కట్టు కల్గినను నిన్నే నమ్మెద. నాకెవ్వరేది చెప్పినను నమ్మెద. అట్లుచేసెద.

గీ॥ కందకంబున బడువారు గడ్డిపరక
బట్టి బ్రతుకందలంతురు ప్రతిభలేక
అటులనే దుఃఖరూపంబునందు నాకు
గడ్డిపరకైన నేలకో యడ్డుపడదు!

(ఆలోచించి) అకటా! తలంచుకొనిన ప్రాణము తల్లడిల్లుచున్నది. నేను మొదటబుద్ధిహీనుండనై విజయుని దుర్మార్గపుబుద్ధికేల లొంగి రూపవతిని దొంగిలించితి. ఇప్పుడు నాప్రాణముమీదకు వచ్చినపుడు నాకెవరడ్డునత్తురు— రూపవతి రాణికిజూపిన నామెను శిరఃఖండనము చేయును. అకటా నాకేమియు దోచుటలేదు. న న్నీశోకసాగరమునుండి యెవరుదాటింతురు—

సీ. విజయుడా నాకిట్టి వెతలనుగల్పించి
చోద్యంబుజూతువా శూరుడవయి
వీరజయంతుడా వెతలను గల్పింప
న్యాయమా రక్షింపుమయ్య నన్ను
రూపవతీ నాకు నాపదకల్పించి
నామృత్యువునుజూడ న్యాయమటవె
దైవమా నావృద్ధి దరిగించినీచుని
జేయదలంచుట న్యాయమగునె
గీ ఓ జగన్మోహినీ నీవు నైజమనము
నెరిగి నాయంబు నమకూర్పు మిప్పునాకు
అకట నాయాపదలకు మీరడ్డురారె
గంపు గాదరిజేరి రక్షింపరయ్యె.

ఎంతలో నెంతాయె. ఎంతయాలోచించినను ఎంతదుఃఖించినను ఫలంబులేదు హృదయమా పరితపింపకుము. ధైర్యమా! నిజమనోత్సాహంబు నేలుము. వాయిదానాటికి తోచినపని చేసెద. భగవంతుడే దయిన వెర్రిదారినైన జూపింపడా!

(గాలవుడు విజయుడు ప్రవేశము)

విజయు—మిత్రమా విక్రమా! జయంతునికై వెదకివెదకి రాణిసభకు వచ్చితిగాని వాడందు తప్ప మరెక్కడను గనుపించలేదు.

విక్ర— అదియంతయు నాకెందులకు నేనదితలంపను. రూపవతిని రాణికి జూపకుండ నేదయిన నుపాయముం దెల్పుము.

విజ—ఉపాయమూలోచించియే యుంటిని. రూపవతికిమందునిచ్చి వ్యా

ధిపీడితురాలుగా జేయువలెను. అందువలన మన క్షేమంబుం డదు. రాణి సమ్ముఖంబునకు బోవునాటికామె రోగపీడితురా లై యుండునుగావున నామె నందేయుంచవచ్చును.

విక్ర—మంచిది. అట్టులనే చేయుము. మం దెవరిచ్చును.

విజ—ఈవైద్యుడిచ్చును. వీనిపేరు గాలవుడు. వీనితో నేనిదివర కే మాట్లాడియుంటిని. నీవు చెప్పినచో నిప్పుడే పంపెద.

విక్ర—నీ వేదిచెప్పినను నమ్మెద. నీపై భారంబునిల్పితి. నీవే నన్ను రక్షించువాడవు. ఇంతవరకు దెచ్చినవాడవీవుకావా?

విజ—సరియే అట్టులనే చేసెద. (గాలవునితో) గాలవా! నీవేగి రూపవతికి మందు దయారుచేయుచుచుండుము. ఆమె కెట్టులయిన వ్యాధి గల్పింపవలెను. మరణంబుఁ గూర్చరాదు. నిన్నెవ్వరైన నాపిన విక్రముండంపెనని తెల్పుము. నీ క్షేమయంబునులేక వనపురంబునంజేరి రూపవతి శయనమందిరంబునజేరి దగ్గరనే యుండి తారిగించుము, విసువకుము. లేనిచో నేవచ్చెదపొమ్ము సత్వరంబుగ బోయిరమ్ము.

గాల—చిత్తము. (నిష్క్రమించును)

విక్ర—విజయా కార్యసాఫల్యము కాగలదని తోచుచున్నది, నాకిప్పుడు కొంచము ధైర్యము కలుగుచున్నది.

విజ—సరియే కాని మరింత ధైర్యంబిచ్చు సాధనమును జెప్పెదనెదవా?

విక్ర—నీవుచెప్పిన నేను వినకపోయెదనా? తెల్పుము నీకు బద్ధుడనయ్యెద.

విజ—ఆమెకు మందిచ్చినచో వ్యాధిపీడితురాలగును. అందువలన లాభంబేమి? ప్రస్తుతము మనగండము తప్పునుగాని యెప్పటికయిన నపాయముకలదు. జయంతు డున్నంతకాలము మనకు గండమే, మరల మరికొంతగాధ జరుగుచునేయుండును. కావున నెల్లపుడును నీకపాయములేనిదియు సులభసాధ్యమైనదియు దెల్పెద వినుము. కొన్నిదినంబులు రూపవతి నాభార్యయని తెల్పుము.

రాణియెదుట నాభార్యయనిన చో నీ కేయుపాయముండదు, త రువాత నీ భార్యయని పిలచుకొమ్మి బాధలందిన నేనే పొందె దను. లేనిచో నిద్దరము సౌఖ్యమందుదము. మిత్రుడిది యేకదా చేయువలసినది?

విక్ర—విజయా నేనాపదయం దుంటిననియా న న్నన్యాయముజేయ జూచితివి! ఇదియా నీమిత్రత్వము— నీగుణము— నీచెలిమి— మిత్రునిభార్యను తల్లిగా నెంచవలెనని నీకు తెలియదా! మి త్రుడన నెట్లుండవలెను—

చ. తెలియనికార్యముండినను దెల్పు రహస్యముదాచు సద్గుణం బుల బ్రకటించు నాపదలు బోయెడునట్టుల జేయు మిత్రుడే తొలివిజయుండు కృష్ణుడును తోడయి భారతయుద్ధమంత తా ర్పలుపరె యుద్ధమందు హరి సారథియై కడతేర్చెనేకదా.

ఇట్లుండవలెను. ఇట్టిమాటలెన్నడను పలుకకుము. నీవు నిజమ యిన మిత్రుడవైన చో నిజము పల్కుము మనమునం దొకటియు బై కినొకటియు బలుకకుండుము చెప్పెడిది యబద్ధము. చేసెడిదెల్ల మో స మనసెంచుకొనుము. నిజము పల్కుము. ఆభరణాదులు భూషణము లు గావునుపుమా! సువాణియేమంచిది.

ఉ ఇమ్ముగ భాగ్యభోగ్యములు నెప్పుడు కల్గెడువానికంటె యే సొమ్ములులేక మానవుని సోయగ మొప్పెడు నోటిమాటలే సొమ్ములదెట్టులన్న గడుసొంపుగ పాడెడు పాలపిట్టకం టిమ్ముగ పాడుకోకిలలనిమ్మడి చూచుటలేదె మిత్రమా.

విజ—మిత్రమా! ఇంతకాలముండి మనము కలసియుండినను నాయం తరంగంబిప్పటికిని గన్పట్టలేదా? నీక్షేమము గోరువాడను. నీ వృద్ధి నాశించువాడను. నీకు సహాయముజేయువాడను కాన నీకు జెప్పదలంచితిని. లేనిచో నీతోడ మాటలాడను. నీవన్య థా తలంచిననే జెప్పదలంచలేదు. నీవనెడిమాటలు నాహృద

యమున ములుకులువలె ప్రవేశించుచున్నవి. నాయంతరంగంబు మిగుల పరితపించుచున్నది. ఒక్కమాటలో ప్రేమ రజ్జువుల ద్రెంచితివే— ఇంతకాలమునుండి యన్యోన్యప్రేమతోనుండి చివరకిట్టిగతి సంభవించె— నేను చెప్పినట్లొప్పుకొనుము. లేనిచో నీకే యవస్థపట్టును గాని నన్నేమి యనకుము నేను నిన్ను నిర్భంధించను.

విక్ర—మిత్రమా క్షమించుము— ఇప్పుడు నన్నేమి చేయుమనెదవు?

విజ—ఈసంగతి నామెతో జెప్పవలెను.

విక్ర—నేను వచ్చుటకు వీలులేదు. లేఖనిచ్చెద గైకొనిపోయి యామె కిమ్ము.

విజ.—సరియే వ్రాయుము. (లేఖనందుకొని నిష్క్రమించును)

విక్ర—ఈ రెండుపాయములు తప్పక సఫలంబులు కాగలవని తోచుచున్నది లేనిచో నొక్కటైన సఫలము కాదా? ఇపుడు నాకు ధైర్యము కల్గుచున్నది. ఆహా నాకు రణనీతివిశారదుండును, సుజ్ఞానుడును, ధీశాలియు, సమర్థుండగు సుమిత్రుండులభించినాడు అతడు నాయుండనుండ నాకేమిభయము నాకష్టదశలు పోవుచున్నవి. కష్టములు కలకాలముండునా?

౧. పగలు తరువాత చీకటి వచ్చినట్లు
సుఖము వెంబడి కష్టముల్ జూడగలము
మరల కష్టముల్ సుఖముగా మారుచుండు
కాని కలకాలముండునా కష్టదినము.

రాణి నాకు సర్వరాజ్యాధికారత్వమిచ్చెను. రూపవతిని బట్టపుదేవిం జేతును. మరల నాసామర్థ్యమును చాకచక్యమును జూపనా? మరల వీరి నొక నాటక మాడించనా? భగవంతుడయిన దిక్కరించకుండునా— (నిష్క్రమించును)

---

2 వ రంగము.

(పనపుర సౌధంబులో రూపవతీ కుసుమలు కూర్చుందురు)

(కాళిందుడు మందులమ్ముకొనుచు ప్రవేశము)

కాళిం—(తెరలోనుండి) వాతరోగాలకు- కుట్టిరోగాలకు- చెవులోపో టికి- చెవ్వులోచీముకి- మోకాలునొప్పులకు- కండ్లకలకలకు- క డుపులోనొప్పికి- (ప్రవేశించును) తేలుమందెచ్చి- పామ్మందె చ్చి- గోరోజినందెచ్చి- రసకర్పూరందెచ్చి- వాయుబస్మందెచ్చి- (రూపవతినిజూచి) ఓ అమ్మా నాదగ్గిర బలేకిర్రలున్నాయి- మొ న్ననేబాబు శ్రీశైలం కొండమీాద తెచ్చా- కొత్తకిర్రలుబాబు- ఓబాబు నాపేరు కాళిందుడుబాబు- నాపేరు సెప్తేనేసాలు పో వాలిబాబు రోగాలు- ఓ మొన్ననే బాబు జయంతు అయ్యో క్క- పంజరం-పంజరం- కిస్కి-నాపట్టలేదుబాబు- ఓ దెబ్బకి తీ సేసినాబాబు- ఓ అమ్మా ఖాళిందుడుమందు ఖనకాలమందు- కిలకాలముండాల బాబు-

కుసుమ:—ఓకీ! దగ్గఅకురమ్మ.

కాళిం:—సిగ్గం బాబు. పలినోరికటాటుం బాబు. సూపిచ్చయంటారా సుంచికిర్రిప్పిత్తా! యింత పాతచొక్కా దయిచేయిద్దురూ (కూర్చునును.) అమ్మయ్య అంబాళి కొండదేవతా! వనలక్ష్మీ.

కుసుమ:—నీదగ్గిరేమి మందులున్నవి?

కాళిం:—ఓఅమ్మ నాదగ్గిరన్ని న్నడాయమ్మ ఓ మీారడగండి తీసిస్తా. ఎంతమందికో యిచ్చా చాలమందులు కిర్రలు (ఒకదానినిదీసి) ఓబాబు యిది యేయిమ దికిచ్చా. యిదేసుకుంటే పత్తెమక్కర లేదు బోంగ నమక్కర లేదు బాబు. యిదేనమ్మా మొన్నరాణి గారి మొగుడు రోగంకుదిరించింది బాబు ఓ అమ్మా మాామం దెవరు సూద్రమ్మా- డాసరులంటబాబు పెంకుటిల్లయితేనే వ త్తాడు లేకపోతే రాడు. మాాకది లేదుబాబు-

రూ—చెలీ సర్వరోగనివారిణి యున్నదేమో యడుగుము

కుసు — ఓరీ సర్వరోగనివారిణి యటయున్నదా?

కా . ఓ బాబు ఉంది బాబు- ఆదితీస్కోండి డబ్బుతక్క వే- అన్నిరో గాలు కుదిరిస్తది (సంచిలో చెయ్యిపెట్టి నవ్వుచు) హాహాహా ఎంకొన్నరికటాక్షం కొండదేవత కటాక్షం హా రావే- రావే- నీ దూపతెగా అమ్మోరికి సుఖంగావుండాలి. (తీసి) ఓ యిదిగో సమ్మా. దీన్కి ఓ సాక్కా గుడ్డియ్యండి బాబు-

కుసు—మంచిదేనా!

కా—ఓ ఆమ్మా అది అడగక్కరలేదుబాబు ఇదిచ్చేటప్పుడు నన్ను తెలుసుకోండిబాబు. ఇది సంజీవిపుల్లతో సమానంబాబు_ నాద గ్గిర సెడ్డవిలేవు బాబూ_

కుసు—దీని నెప్పుడు వాడవలెను?

కా—మీయిట్టం- మనసులో కట్టంగావున్నప్పుడు తాగమ్మా— ఓదె బ్బకి పోవాలబాబు. మళ్ళామీకు రోగంరాదుబాబు—

కుసు—సరియే తెమ్ము. చొక్కాయికి రేపురమ్ము.

కా—ఓ యీ ప్రాణం శెమ్మాలి- కూటికిలేదు. ఓ అమ్మా రూపాయి య్యండి సాలు.

కుసు—దానికినీ రేపే

కా—సరిలెండి (లేచి సంచిసద్దుకొనుచు) ఓఅమ్మా మాగుడిసె మీగే టుదగ్గిరేనమ్మా మీయిట్టొవచ్చినప్పుడు కేకేత్తే వత్తా.

కుసు—నీపేరేమి?

కా—కాళిందోసు అమ్మా- బంకుబుచ్చోడి పెద్దోణ్ణి అమ్మా-

కు—గురుపుసేమి?

కా—గాలవుండమ్మా

కు—ఇది పనిచేయునిచో నిన్నేమిచే కుసునెరవు?

కా—ఓ బాబు నాపేరుసెప్తేసాలు లేకపోతే మాయింటికొచ్చి నాపె ట్టనడగండి బాబు- నేనుంటే అప్పుడేవత్తా. ఇది విసంతాగినో ళ్ళకి బలేగపనిచేస్తదిబాబు. కాళ్ళకి సీముకి తేలుకి అన్నింటికి

నుంచిది బలేబౌమదంబాబు. ఓ యమ్మా అయ్యగారికి సూపి
చ్చమ్మా లోఘూలేసినముందు ఓఅమ్మ నేపోతా చెలివియ్యండి
కుసు.— మంచిది. నీవిందేయుండెదవుగదా?
కా—ఓ సిత్తంబాబు- అప్పుడప్పుడొస్తా లెగంచమ్మా. (వెనక్కుతిరిగి
మూటబుజానవేసి) వాంతరోగాలకు- చెవులోపోటికి- చెవులో
సీముకి- మోకాలు నొప్పులకు- (నిష్క్రమించును)
రూ—చెలీ వీనిమందు మంచిదని నాకు నమ్మకమే.
కు — నమ్మకముండిననేమి లేకపోయిననేమి? మనమాపదలోనున్నప్పుడు
తాగుదము, మనకు ప్రాప్తియుండిన బ్రతుకుదుము. లేనిచో
లేదు.
రూ—ఇదేమైన విషము కాదుగదా?
కు— మనకు విషంబిచ్చుటకు మనవిరోధులెవ్వరు? ఓహో నీయుద్దేశ్య
ము నాకు బోధపడినది. వాడు మతిలేక మరియొక టిచ్చెనే
మోయని భయపడితివా! కాదుకాదు వీనిసంగతి నే నొకసారి
వింటిని. వీడు మంచిమందులిచ్చును. అమ్మా నేను పోయివచ్చె
దను. వంటవాండ్ర కాజ్ఞనిచ్చి మరల వచ్చెద.
రూ—మంచిది పోయిరమ్మా
(విజయుడు లేఖనిసికొని ప్రవేశించును)
రూ—(లేఖనందుకొని చూచి తనలో) కట్టా! నాగతి యెంతకు వచ్చెను?

ఉ. ఎంతెటిరాజకూతునయి యెంతటిరాజకులంబువానికే
గాంతను రాజసౌధముల క్రమసుఖంబులగాంచినాను నా
కెంతటిపాట్లు గల్గె కులక్రీడను దుర్మదుడు వీనికిప్పుడే
గాంతను కమ్మటాచు నిజకాంతుడు వార్తెనికేమిచేతునో॥

అహో! నాకు మరియొక పతివచ్చునా? నా సౌభాగ్యమే మగును
ఛీ, ఇదివిచారించిన నాటకమువలె నున్నదే! విచారించిన ఫలంబులేదు.
ఇదెంతవరకు నిజమో తెలిసికొనెద. (ప్రకాశ) విజయా విక్రముడు నీ
కేమని చెప్పెను.

విజ—నీవు నన్ను భర్తగా గొంతకాల మెంచవలెనని చెప్పెను. నీవం
దానికంగీకరించెదవా?

రూ—విజయా నీ వేమియో సద్గుణుండవనియు, యోగ్యుడవనియు, నీ
తిపరుండవనియు తలంచుచుంటిని. నీ విట్టివాడవనియెరుంగ
ను. పూర్వము చేసినవన్నియు తప్పులేయని నేను తెలియవచ్చి
నవి. నీగుణగణంబులు నేటితో స్పష్టపడినవి. ఇక నిన్ను జూ
డను. నీ వీయుత్తరమును వ్రాసితివని నాకు తెలియును. నానా
ధుండు నాదరికిరాకుండుటచేత నీవు నన్ను భార్యగా నెంచదలం
చి యీపన్నుగ బన్నితివా? నీపన్నుగడలన్నియు మన్నుగలి
యును. నీవు మాటుమాటాడక వెడలిపొమ్ము. నీతోడబలుక
ను. (లేఖ బారవేయును)

విజ—తరుణీ! ఏలకోపించుకొనెదవు నీబాగునకే తెల్పుచుంటిని.

రూ—నేను నీభార్యననుకొంటివా? తరుణీయని పిలుచుచుంటివి? నీకు
దేశవాట స్వప్నవృత్తాంతము. నీముఖంబుజూచిన పంచమ
హాపాతకంబులు చుట్టుకొనును పరస్త్రీయందు మానత్వము
వహింపవలెనన్న నీకు నీతుచ్ఛపుబుద్ధియందేమైనది. నీవు బుద్ధి
హీనుడవా? పరస్త్రీని గోరుటయా నీ తెలివి— నీపౌరుషము
నీచాతుర్యము— ఛీ, ఇక పొమ్ము.

విజ—(స్వగతము) ఈ చిన్నది నన్నుజూచిన లజ్జయు నాసంకము కల్గుచు
న్నటులున్నదే నాకు! నేనదియే కోరుచుంటి. మరల కొంతకాల
మునకు విక్రముని భార్యగనేయుండును. నిన్ను విక్రముడు వి
వాహమాడినసంగతి రాణికి దెలిసిన మనలకందరకును హానిక
ల్గును కావున కొద్దిదినంబులు నాభార్యయనుము. నీకేయాపద
లు కలుగవు. నీకు సౌఖ్యంబు గూర్చెద.

రూ—నాకేహానికల్గినను నిన్నొల్లను. నాభర్తకు హానికల్గిన నేనుకూడ
ననుభవించెద. భర్తగారు కష్టములు నేను సుఖమును బొందు
దునా! చాలు చాలు నీ యాగడము. నీవు నన్ను సంతోషపె
ట్టువాడవా? నీసంగతి యెవరెరుంగరు

సీ. నన్ను వేరుగఁజేసి నాతండ్రికైన లేని
దుఃఖంబుఁగూర్చిన ధూర్తుఁడెవఁడు
నాముఖ సందర్శనమునకు వచ్చిన
వారలఁజంపిన వాఁడెవండు
నాతండ్రిఁబంపిన ధూర్తునుఁజంపంగ
దలఁచిన జగదేక తుచ్ఛుఁడెవఁడు
పరకాంతలను నిజ భార్యలుగానెంచి
నిర్బంధపెట్టెడు నీచుఁడెవఁడు

గీ. అట్టినీచుఁడు మూర్ఖుఁ డవనిలోన
నెవ్వఁ డున్నాఁడు నీకంటె నెంచిచూడ
నిన్ను వివాహమాడిన సుఖంబనుభవించె
దనెడి పలుకు కిల్లరో యధమ! తులువ!

ఓరీ మిత్రద్రోహీ! తోఁచినవారికెల్ల భార్యనగుటకు నేను వేశ్యననుకొంటివా? మీరు పెట్టుబాధలనుబడయుటకు మీదాసిననుకొంటివా? సూర్యచంద్రాదులు దిగివచ్చినను పాతాళంబు క్రుంగినను నిన్ను భర్తగాఁ దలఁచను. ఈ విషయంబంతయు రాణితో జెప్పెద జూడుము. నా మనోహరుఁ డుండఁగ కార్యమునకు తలంచునా? అది కలలోనివార్త. చాలుచాలు నిక పొమ్ము. ఈయుత్తరమును చించితిననుము పొమ్ము. నా శాపము నీకు తప్పక తగులఁగలదు.

విజ—నీవెంతభయపెట్టినను నేను భయమందువాఁడనుకాను సుమా! ఇదిదొంగతనముకాదు నీయుడతయూపులకే చింతకాయలురాలును? హనుమంతుని ముందా కుప్పిగంతులు? నేను చెప్పినట్లొప్పుకొనెదవా లేదా? లేనిచో నిన్ను చేతులార హతంబుచేయుదురు ఇదియె నాప్రతిజ్ఞ.

రూ—నాచేనొప్పించుట దుర్భగము దుస్సాధ్యము దుస్తరము దుర్లభము.

విజ—ఏమి నేజెప్పినట్లొప్పుకొనెదవా లేదా? లేనిచో నిప్పుడే ఖండించెద. (కత్తినెత్తును)

రూ—(తనలో) అకటా! దైవమా నన్నీకూౄరుడెంత నిర్బంధ పెట్టు చుండెను. నన్నిప్పుడుఖండించు నేమోకదా! నా కెవ్వరడ్డువత్తురు.

సీ. పంచభూతములార! ప్రతికింప రేమీరు
కూౄరవిజయుడు నన్గూల్చుచుండె
భగవంతుడా యిప్డు ప్రతికింపవా నీవు
కూౄరవిజయుడు నన్గూల్చుచుండె
చెలియరో భటులార చెంత జేర రెనాకు
కూౄరవి:యుడు నన్గూల్చుచు :డె
నను గన్నతండ్రిడిగో నాకడ్డుపడరావె
కూౄరవిజయుడు నన్గూల్చుచుండె
గీ. అయ్యయో యొకౄరైన నాపదలకు
నడ్డుపడరారదేలకో యరయలేను
చెలియ కుసుమరో నీవైన జెంతరావె
కూౄరవిజయుండు నన్నిప్డు కూల్చుచుండె.
(కుసుమయు భటుడును పరిగిడి ప్రవేశింతురు)

కుసు—అమ్మా! నీ కేమియుపాయము కల్గెను నీకెవరు హానిగల్గించిరి

విజ—(వెనుకంజవేయును)

భటుడు—నీకేమి మొప్పవాటిల్లినది. సత్వరము దెల్పుమమ్మా.

రూ—(నేౄలుసూపి) ఆదురాత్మర్ధుండు తిన్న వివాహమాడమని నిర్బంధించుచున్నాడు.

భ—అటులనా ఇక మాటలాడ మనుము (విజయునితో) ఓరి దురాత్మర్గుడా కాచికొనుము (కత్తిదూయును)

విజ—అహా ఇది చిక్కుగనే యున్నది. కాలికిబుద్ధిజెప్పెద (పరిగెత్తును)

భటు—ఓరీ తుచ్ఛా! ఆగుమాగుము (వెంబడించును)
(తెరలో) హా చచ్చితిచచ్చితి రూపవతీ విజయుడునన్నుచంపివేసెను.

రూ—చెలీ వానివెంటబోయిన భటుడు మృతినొందినట్లుండెను. మరల మనలను జంపును. కావున పా పోయి మరియొకగదిలో నుందము రమ్ము. (భయముతో నిష్క్రమింతురు)

3 వ రంగము.

రూపవతి, కుసుమ, ప్రవేశము.

రూ—చెలీ! నీవు నాపాలిదైవముచలెవచ్చి నాప్రాణములనిల్పితివి నీకు సర్వదాకృతజ్ఞను.

కుసు—నీయార్తధ్వనివినిన నీకేమిహానివాటిల్లెనోయని తత్తరపడి యచ్చోటికివచ్చితిని. జరిగినవృత్తాంత మేమి?

(గాలవుడు ప్రవేశము—రూపవతి కుసుమ లేచి భయముతో పారిపోవ జూతురు)

గాలవుడు—అమ్మా మీకు భయములేదు. నేనుమందిచ్చుటకు వచ్చియుంటిని.

(రూపవతి కుసుమ కూర్చుందురు)

గాల—సాధ్వీమణులారా! నాయొద్ద మంచియౌషధరాజములున్నవి. అవి మిగులబలమిచ్చును. అవి లోహపూరితములై యున్నవి. (బుడ్డినొకదానినితీసి) దీనిని విక్రమునికిగూడ నిచ్చితి. ఇది సౌఖ్యమొసంగును. వారు మూడునాళు గొంతపయికం బిచ్చి మీకు దీనిచ్చిరమ్మని నారు కావున దీనినివ్వాకు తాగవలెను.

కుసు—విక్రముడు నీకెచ్చట కనుపించెను?

గా—(ఆలోచించి) లక్ష్మీపురమున

కు—(రూపవతితో) చెలియా వీను మంగులమ్ము వైద్యుండయినే మాటబేధములేదే? అదియునుగాక విక్రముడు లక్ష్మీపురమునలేడే ఒకనేళమనకు దెలియకుండ నేగనేమో (గాలవునితో) ఏమి మా కీమందీయమనెనా? మరేమయిన జెప్పెనా

గా—నీకుగాదు ఈమె కిమ్మనెను. ఇతరవిషయములు నాకేల చెప్పును.

కు ఈమెపేరేమి?

గా—తెలియునుగాని మరచితిని.

కు—నీదగ్గిర నేయేమందులున్నవి?

గా—నాదగ్గిర చాలమందులున్నవి కాని మీకుపనికివచ్చునదిద్దియే.

కు—(రూపవతితో) చెలీ వీనినిజూడ నాకు సందేహము కల్గుచున్నది. వీని తెలివితక్కువమాటలు, నిర్లక్ష్యపుపల్కులు, వినిన విజయుడు పంపినట్లు కన్పట్టుచున్నది. అయిన మనము మంచియారోగ్యస్థితిలో నుంటిమని విక్రమునికి తెలియకుండునా? దీనిలో నిది విషమైయుండును. అందువలననే దీనినేత్రాగుమనుచున్నాడు. తత్క్షణము త్రాగవలెననుచున్నాడు. అయిన వీనిసంగతి దెలిసికొందము. (గాలవునితో) వైద్యుడా మేము సర్వరోగసివారిణిని నింతకుముందే కొంటిమి. మాకేమందు నక్కరలేదు. మేమారోగ్యముగా నుంటిమి; ఈసంగతియే విక్రమునికి దెల్పుము నీపేరేమి?

గా—నీవు త్రాగనక్కరలేదు లెమ్ము.

కు—(రూ॥తో॥) చెలీ కనిపెట్టితివా వీనివడత! (గాలవునితో) ఓరీ నీ పేరేమి?

గా—గాలవుడు

కు—కాళింకుడు నీ కేమగును?

గా—నాకత డెవండో తెలియదు.

కు—నీ శిష్యుడటకదా?

గా—అదిమీాకేలగాని దీని నామిాకీయుము. నేను పోవలెను

కు—నీవు మందులమ్ముకొనువాడవు. మమ్ములనాశ్రయించియుండువాడవు. నీవు నిర్బంధించిన త్రాగుదుమా? చాలుచాలు నీయాగడము. దీనిని మేము త్రాగము పొమ్ము.

గా—నీవు త్రాగనిచో నామె కిమ్ము.

కు—నే నొకటియు నామె యొకటియా? నీ కేటికి యసంబద్ధప్రలాపము— దుర్భాషణ—

(కత్తిదీసి మెల్లగా విజయుడు ప్రవేశము)

గా—నేను కడుదూరమునుండి వచ్చితి నాకార్యసాఫల్యము కానిచో నాకు విచారముగానుండును. ఇంతకాలమువరకు నామందులను మిారుతప్ప యెవ్వరును దూషించలేదు.

రూ—కుసుమా! వీనితో ముసలేటికి. లోనికిబోవుదమురమ్మా.

(వెనుకకు మరలుచుండగా విజయుడు రూపవతిచేయిపట్టుకొని)

విజ—పోయెదవా ఓసీ ధూర్తురాలా! త్రాగెదవా లేదా! (కత్తిసెత్తి)

గీ. త్రాగుమిది విషమైనను నేగమిగను
లేనిచో నీతలందున్చించి, దాని బైకి
నెగరవేసెద కాకుల కెరవుగాగ
త్రాగు మారుమాటాడక త్రాగుమింక.

(కుసుమ పారిపోవును)

రూ—తండ్రీ త్రాగెదనాగుము. ఒక్క మాటవినుము. విక్రమునికై దుఃఖించి దుఃఖించి ప్రాణముల విడచితినని తెల్పుము.

విజ—మారుమాటాడక త్రాగుము—

రూ—త్రాగెద నెమ్ము. (త్రాగి) హా దైవమా! విక్రమా! ఎంత పనిచేసితిరి? (పడును)

విజ—గాలవా! ఇది యామమునకు ప్రాణాపాయమును గల్పించదుకదా?

గా—మరేమియును భయములేదు. దీనికి విరుగుడుమందీయనిచో నెలదినంబులవరకు మత్తుగనే యుండును.

విజ—ఇంక మన వేగి రేపటిదినముచూచి వజ్రపురంబునకు బయలుదేరుదము రమ్ము. (నిష్క్రమింతురు)

కుసుమ ప్రవేశించును.

కు—అయ్యో దైవమా! నాప్రియురాలికెంత కష్టం బొనగూర్చితివి. జననమందిన నాటినుండియును సుఖమన్న నేదియో నెరుంగదుకదా! భర్తను కనులార చూచియెరుంగదే. అందులకే విలపించుచుండ నీ విజయుని పోకేటికి? ఇదియంతయు మాదురదృష్టము కాబోలు. విజయుడీపెకు మందునిచ్చెనుకాని ఖండించిన నీయాళిలుండవుకదా? (చూచి) ఇప్పుడు స్మృతితప్పియున్నదా సికొరకై విలపించిన నేమిఫలము. విషమునకు మందేమైననున్న దేమో యాలోచింపవలెను. లేనిచో నీ మెయ్యుతినొ దుట ని

క్కవంబు. (మరల నాపెజూచి) అయ్యో ఈపెకదలుటలేదే! ప్రియుకాలా రూపవతీ! అమ్మారూపవతీ? అయ్యో ఇంకెక్కడి రూపవతి. తల్లీ! రాచకులంబునందుద్భవించి యుష్టదళభాషలం దసమానపాండిత్యంబు గల్గిన నీగౌరవమేమైనది. నీ సౌందర్యమేడ ముఖవిలాసము మారుచున్నది. మరణకాల మాసన్నమగుచున్నది కాబోలు.

ఉ. రూపవతీ మదీయప్రియరూపవతీ కనువిప్పి చూడు నీ
యాపద బాపుదాన విషమంశయు నేర్చుగదీయుదాననో
రూపవతీ చెలీ! యకట! రూపము మారదొడంగె నింక నే
నీపెను బల్కరింప బలమేమిటి? యెట్టియవస్థకల్గెనే.

దైవమా చిరకాలమునుండియు నొక తల్లిబిడ్డలవలె పెరిగినాము న న్నెడబాటుచేయుట న్యాయమా? (ఆలోచించి) మరచితిని. నాదగ్గర కాళింమడిచ్చిన యౌషధ మున్నదికదా అది సర్వరోగనివారిణి అది యిచ్చిన వ్యాధి కుదరగలదు. లేనిచో భగవంతునిదయ. పైన సర్వేశ్వరుడేకలడు. లోనికేగి తెచ్చెదగాక. (తీసికొనివచ్చి బిగ్గరగా) చెలీ! దీనిని త్రాగుము. నీకు మందిచ్చుచుంటిని (నోటిలోపోయును)

రూ—(కనుదిప్పి) ఎవరునీవు?

కు—అమ్మా! నేను కుసుమను. మాటలాడకుము.

రూ—చెలీ నాకింతవరకెట్టులోయున్నదికాని యిప్పుడు ప్రపంచకజ్ఞానముకల్గుచున్నది. ఇది కల్లయా లేక నిశ్చయమా?

కు—అమ్మా నిశ్చయమే. నేను మందునిచ్చి వ్యాధి నివారణచేసితిని.

రూ—అమ్మా దానికినేనెంతయో కృతజ్ఞురాలను. నాకుధైర్యము కల్గుచున్నది.

కు—రూపవతీ! నీకొకొకమాట జెప్పవలెను. వినగల్గుదువా?

రూ—చెప్పుమమ్మా వినెదను. (మెల్లగా లేచి కూర్చుండును)

కు—మనము సౌధమునందుండరాదు. రాణికడకు వజ్రపురముబోయి విక్రముని గలిసికొని యీవృత్తాంతంబంతయు రాణితో జెప్పితి

రవలెను. లేనిచో నీవు బ్రతికితివనిన విజయుం డీసారి ఖడ్గము నకు బలినిచ్చును.

రూ—నేనందులకు సంసిద్ధురాలనై యుంటిని.

కు—చెలీ! జరిగినదంతయు నాకెఱింగఁజెప్పి ముందుమన కేయపాయముఁ గలుగకుండ జేయవలెను.

రూ—అట్లనే చెప్పెదను నీవుఁగూడ వచ్చెదవు కదా?

కు—అమ్మా! నాకు కొంచెము పనికలదు నేనురాఁజాలను. వినుము. నీతో కాళిందుని బంపెద వాఁడు మనకు ముందుల వేషధారియైయుండవచ్చి పోయెను. గాని వాడిడం జయింతుని మిత్రుఁడు వారుమ దిచ్చునని తెలిసియె మనకా మందమ్మి పోయెను. వాని సాయముచేతనే నీవు బ్రతికితివి. మన దర్శనము లభింపమి యీ తీరున లభింపఁజేసుకొనియె మనలను వజ్రపురసౌధ రాజమ్ము నకు రాణి సమ్ముఖమ్మునకుఁ గొనిపోవుటకు వచ్చియుండెనని తెలియవచ్చినది.

రూ—చెలీ? నిజమేనా?

కు—ఇకఁబట్టం బేమియులేదు? మమ్మాటికి నిశ్చయము నీకిక భయము లేదు.

(కాళిందుఁడు యథాప్రకారముగా ప్రవేశించును)

కాళిం—అమ్మా! నీకుకల్గిన దురవస్థను వింటిని. నేను మీకిచ్చిన మందుసహాయము చేసెనట! మీరీ భవనమునమండి జనదు వజ్ర పురంబునకుం బయలుదేరుము. నేనందులకే మందుల వేషధారి నై యుంటిని. నేను జయింతుని ప్రాణస్నేహితుఁడను నాప్రాణ రక్షణకై వచ్చితి విజయుడింక చాలబాధల బెట్టదలంచెను.

రూ—చెలీ వీనిపల్కుఁ జూడ నిజమునియోతోచుచున్నది నేను వీని తో నేగగలనని ధైర్యంబు కలుగుచున్నది.

కా—అమ్మా మీ కేమియును భయంబులేక. మీరునాకు తల్లివంటి వారలు మీకేయపాయమును కలుగనీయను. మీరు సత్వరం బుగ బయలుదేరనిచో విజయుడు వురలవచ్చును.

రూ—కాళిందా! లోనికేగి చెప్పిరమ్మనెదవా?

కా—అమ్మా అదియే మనకొంపముంచును. మనము నేడే వజ్రపురం బునకు బోవలెను. లేనిచో నితరులకంటబడుదుము. వారు మ నలను బట్టుకొందురు.

రూ—చెలీ నేనిదే పోయివచ్చెదను. మనము చాలకాలమునుండి కలి సియుండుటచేత నిన్ను విడువ మనంబు సంకోచించుచున్నది. మరల ని న్నెన్నిదినంబులకు చూడగలుగుదునో నాచరిత్రి మె ట్టుల మారునో కదా?

గీ. చాలకాలమునుండియు సరస నుండి
యొక్క తల్లిబిడ్డలవోలె నొకరికొకరు
కూడియుంటిమి నిన్నిపు వీడజాల
కాని వెతలకతీరదే కాంత నేను
చిన్ననాటినుండి మనము చెలిమితోడ
నొక్కశయ్యపై నిదురించి యొక్కకంచ
మున భుజించుచుతిరిగినాము నినుబాయ
గుండెలో నేదియో యొక్క బండ పడియె.

వెళ్లితీరవలసి వచ్చినపు డెంతవిచారించిన ఫలంబేమి? చెలీ నీ వొక పనిచేయుము.

కు—ఏమది!

రూ—ఎవరయిన నన్నడిగినచో నాశయనాగారమునందుండి నిద్రించు చుంటిననుము. మిగుల రోగపీడితురాలై యున్నదనుము.

కు—అటులనే కాని నీవు సరిగానేగుము. సాధ్యమైనంతవరకు నీసంగ తి యెవ్వరికి దెలియకుండ నేగుము.

సీ. అలసట కల్గువో నచ్చటచ్చట నాగి
మంచినీడల విశ్రమించుమమ్మ
క్షుద్బాధకల్గునో జూతఫలంబుల
భక్షించిబాధల బాపుకొమ్మ

దప్పిగ యైనచో దాపునుండెడి నిర్మ
లోదకంబును దాగివి యోర్పుకొమ్మ
సాధ్య మైనంతలో జనులకు గనుబడ
కుండునటుల నేగుచుండు మమ్మ
గీ నీకునామము నీయూరు నెవ్వరైన
నడుగుచో మాటలాడక యరుగుమమ్మ
ఆపదలు కల్గుచో ధైర్యమూపుకొమ్మ
దైవమున్ సర్వవేళల దలపుమమ్మ

మరియు,

సీ, తొట్రుపాటుగ రాణితో మాటలాడిన
కల్లలాడినటంచు గట్టివేయు
ప్రల్లదంబుగ రాణి పల్కరించినవేళ
వినవిధేయతల్ వెల్లడించు
భూపసభామధ్యమున వాక్సుధారస
మును గడునెమ్మితో మొనువంచి
పల్కము లేనిచో బహుపాగ్రభవను చు నీ
మాటల వినకుండ బారద్రోలు
గీ విజయసేనుని దేశప్పు నిజముగాను
వానివలననే నాక్కిట్టి హానికల్గె
ననివచింపుము నీకేమి హానికలుగ
నేరదు మనము విష్ణుపై నిలుపుమమ్మ.

అదిగో కోడికూయుచున్నది. తెల్లవారబోవుచున్నది. మీరు త క్షణము బయలుదేరుడు లేనిచో నుదయమగు కొడనే విజయుడు వ జ్రపురంబునకుం బోవుచుమిమ్ములజూచును కనుక చాలకష్టములుకల్గును.

రూ — చెలీ పోయివచ్చెదను నాజ్ఞాపకార్థమై యుంగరము నీయొద్ద నుంచుము. (ఉంగరమిచ్చును)

క — (అందుకొని) సరియే పోయిరమ్ము, నీకు శుభముకల్గును.

(అందరు నిష్క్రమింతురు)

4 వ రంగము.

(ప్రవేశము—రూపవతి కాళిందుడు)

రూ—కాళిందా! మనమెంతదూరము వచ్చితిమి. ఇప్పటికెంత వేళ యైనది?

కా—అమ్మా మనము చాలదూరము వచ్చినాము.

చ. విరివిగచల్లతెమ్మెరలు వీవదొడంగెను వెన్నెలంతరిం

చె, రవిభువిన్వశించు నరజీవుల జూచుట కోయనంగతా

శిరమునునెత్తె వరిచేనులపై హిమబిందువజ్రముల్

మెరయగ జొచ్చె జంతువులమేతకు బోవజగంబులేచెనే

రూ—ఆ కనబడు సమూహంబేమిటి- వారుమనలఁగూడి యందరకును తెల్పునేమో కదా?

కా—నీ కేమియును భయంబులేదు. వారికి దెలియకుండ బోవుదము. వేగముగా నడువుము. (నిష్క్రమింతురు)

5 వ రంగము.

(జాఫర్ సాహెబ్ - మరికొందరు గారడీవాళ్ళు ప్రవేశింతురు,

జాఫర్—(డోలువాయించుచు పాడును)

గోదావరి తీరంబు - బెజవాడవరపురంబు ।గో॥

జాఫర్ గాడి సంగం - బల్ బలేబలే సంగం

వస్తు పోతూవుంటాం మీాకు - సారంచేసి పోతాం ।గో॥

జా—(డోలునుకొంక్కడికిచ్చి) అరేమాామ నూకొట్టు. (అడుగు వేయుచు)

పాట.

నీచిన్నిచిన్ని చేతులకే నారాయణమ్మా

నీ సిలుకుగాజులందామే నారా॥

నీషోకుషోకు నడకలకే నా॥

నీకు సుప్పనాతి తనమేలా నా॥

ఒకడు—వురే! మాామ! అదొద్దు. గారడి మొదలెట్టు.

జా—సరేకొట్టు- డోలుకొట్టు- (మాటమాటమధ్య కొట్టుచుండును)
హారేమామ- డోలుకొట్టు- బాగాకొట్టు- పైనాకొట్టు కిందా
కొట్టు- మామకొట్టు- హోంతామండీ- పెద్దామడిసి- సిన్నామ
డిసి- పొట్టిమడిసి- పొడుగుమడిసి- యిద్దామంతులు-గొప్పోళ్లు-
గోడోళ్ళు- కూకుంటే- ఘూరడీసేస్తా దేఖోరేభాయీ- తప్పిం
డా మెడ యిరుగుద్దిరో డోలోడా (అనిదీర్ఘముతీయును)

ఒకడు—సరేలే కానిరా

జా—(సంచిలో చేయిజెట్టి) ఆయామాయాగారడీ - అల్లిబిల్లిగారడీ

ఒకడు—రావెరావె బొమ్మా - నీమొగుడు ముసలోడమ్మా
గణగణగంటా - కడుపులోమంటా

జా—ఆఁ రావెరావెబొమ్మా (అనిసంచిలో చేయిబెట్టును)

(రూపవతి - కాళిందుడు ప్రవేశము)

అందరు—బాబో యీాడు మనుసుల్ని బోయినంసేస్తడు- వుర్యా-రే
బాబూ- వుర్యా-- (అందరు పరిగెత్తును జాఫర్ పరిగెత్తి గం
తులువేయుచు కాళిందుని కౌగలించుకొనును)

జా—హారే భావా! యీహాజ్వడిక్కి యెక్కడీజే?

కా—ఎవరయిననేమి?

జా—హిది యెక్కడ్డి సెప్తావ్ లేదాబే- యీావ్వూరీమీ హాందర్కిబు
లాతే హాంకూ- కబడ్దార్-

కా—(తనలో) వీడసాధ్యునివలెనున్నాడు (ప్రకాశముగ) వద్దువద్దు.
నిన్ను బ్రతిమాలెద. మమ్ముల విడువుము.

(తెరలో ధ్వని వినఁబడును)

కా—(రూ॥తో) ఏదయో ధ్వని వినబడుచున్నది. తెల్లవారినతోడనే
విజయుడు వచ్చునని కుసుమ చెప్పియుండెను. వాడిటుల వచ్చు
చుండెనుకాబోలు. (లోనజూచి) అదుగో విజయుడే వచ్చుచు
చున్నాడు ఇపుడు మాకువైరంబుతప్పక కల్గునుకావున నిచ్చో
ట దాగియుండు టుత్తమము (జాఫరుతో). బాలకా! మేమిటు

దాగియుండెదము. ఎవరయిననడిగిన వైద్యులమనియు నూరిలోని కేగితిమనియు జెల్పుము.

జా— క్యా బాల్కా క్యా కొత్తపేరు పెట్తావ్ బే నాకీ- దీన్కి నువ్వ దొబ్కాస్తున్నావ్ బే- ఆఁ నాకు అచ్చా మాలుం- తెల్సిందితె ల్సింది ఇది మసిద్దరికి చెర్సగం ఏ-

కా— సరియే కాని నాయుద్దేశ్యము తెలిసినదా?

జా— నాయువ్వారం తుంకూ మాలుం? జల్దీబోలో! ఇది యెవరుబోలో జే కబుర్లు సెప్తావ్?

కా— వారు వెళ్లినతరువాత చెప్పెద.

జా— నై రే బచ్చేనై హిడ్డా హోడ్వాడ్ హాపు ఎక్కడ్డి- హెందుక్కా తీస్కెడ్తున్నావ్ అంతాబోలో నైతో దీన్కి నీకు వాడ్కిసూ పిస్తా. మీాకిమీాకి లడాయి పెడ్తా తమాన్ సూస్తా- హాది యేం టిబోలో లేకపోతే నీకుంపా మొదల్కి తెంపుతా దేఖో- హా కట్టీబోలో- హాది మొప్పుగు అప్పుగ్ నీసంగతిబోలో- బోల్తురే బచ్చే క్యాగడిబిడ సేస్తావ్ నీదొంగతనం తెల్సిందిలే.

కా— నన్ను క్షమింపుము. నీకు గంపెడంబు బెట్టెద. నీవట్లు చెప్పనిచో మే ము విస్తారముగా జబ్బుపడినాము పారిపోవుటకు వీలులేదు. నాకు మనుష్యుల జూచియుండెనన్నను. కావున నీవిందుండి వా నినిపంపి పుణ్యము గట్టుకొనుము. లేనిచో నీవలన ప్రాణముల విడతుము.

జా— హాబ్బో హాబ్బో- పంజరం పంజరం- దొంగజంపం- సెస్తావుసరే అక్కడకూకో. నూ సస్తే నాకుతగులది. హాటుసాల్— (కా మినుకు రూపవతి మూలుగుచుండును) అహహా యేంపిల్ల గాయింపిల్లా— ఆగ్ చల్ చల్ చగ్ తిప్పిస్తా మడిసికి- మడిసి మడి సి రావే - గొంగోరపచ్చడి పెట్టా.

(విజయుడు ప్రవేశించును)

విజ బాలకా ! వెవరు?

జా—బాల్కా లేదు గీల్కా లేదు. పల్కీ హైంతో ఎక్కిచ్చుకో నాపేరు బహదూరీగారు సారడికి జమూదార్. బాలకానై పాలకానై (కొంచమాగి) ఊ ఎంటి నీయువ్వార రం జల్దీబోలో—

విజ—నీకధిక ప్రసంగము చాలయున్న దే?

జా—సంగంక్యా నీకు బుద్ధిలేదుబే— సంగం పక్షుత్తుకుపోయింది. ఇంకే ది మేమాడం జావో ఇందాక ఆయూతో మాయు శేకోవా ళ్ళం నీకి.

విజ—పలుకరించిన బహువిధములఁ బ్రేలెదవే?

జా—ఏంసెప్తావ్ పేల్టవేంటి? మాటల్గీటల్ జాగ్రతగారానీబే— హెవ్వ న్కున్నావ్ నేను సుల్తాన్ వాలాగారి బావని నవాబ్‌దర్గా దేఖో రే— పేల్టం గీల్టం చెప్పకూ యిక్కడ ఇందాకవస్తె మీాదపడి తేత్తో హానగారి పోటాన్ బే,

విజ—అది నిన్నెవరడిగిరి?

జా—హడ్డితే బోల్తుం లేకపోతే యెవడుబోల్తుంబే నాకు సెప్పకోస్సిన క్యా కాదు దేఖో

విజ—ఈ త్రోవ నెవరయిన నిద్ర రేగిరా?

జా—ముఖం ముక్కు సెప్పకుండా బోల్తేక్యా సెప్తాన్‌బే. ఎవరు? ఎట్లావుం టార్? ఎక్కనుంచి ఎక్కాకి? దేన్మీద? హెందూబోల్తేహంబోల్తుం.

విజ—ఇందింతయునేఁ జెప్పిన నిన్నేలనడుగవలెను సరియేకాని యీా త్రోవ యెటుపోవును.

జా—దీన్కి హిక్కేవుంటుంది హెక్కడికిపోదు.

విజ—ఎందాక వెళ్ళును?

జా—హరి బోల్తుంనై క్యా? దీన్కిపోదు, నీకిపోవాలగాని

విక—ఒకయాడుమనిషియు నొకపురుషుడును వజ్రపురంబునకు రాణిఁ జూచుటకై పోవుచుంట కన్పించినారా?

జా—కన్పించావులేదు నీవుచెప్పిదాంట్లో సగంతప్పు సగంరైటు. జూ టామత్ బోలేరేబే! ఏం గోంగోరపచ్చిడి తినివచ్చావా? ఈ త్రోవ మేం తప్ప ఎవరూ పోలా—

విజ—మీరు కాదు– ఇప్పుడిద్ద రీతో త్రోవను బోవుచుండగా జూచితి. ఇంతలో నెచ్చోటి కేగెను?

జా—ఓహో వాళ్కా తెల్సింది ఒక మొగోడు. ఒకాడ్డి– ఎఱ్రగా పొట్టిగా పొడుగ్గా రెండు ముక్లూ–

విజ—అదేమి విచిత్రము?

జా—హిద్దర్కి కల్పి బే–

విజ—వారెచ్చటనుండిరి? త్వరగా చెప్పుము, నీకు డబ్బిచ్చెద. నాకు ప్రొద్దెక్కినది.

జా—(నవ్వుచు) అచ్చా అచ్చా పొద్దుయెక్కుతారు ఎవాళ్ళు ఎవాళ్ళు గుఱ్రం ఎక్కుతారూ గాడ్డి ఎక్కుతారూ మక్ సుల్ ఎక్కుతారుగాని పొద్దు ఎక్కుతారు బే. క్యాడిబ్బిస్తావు తే చెప్తా.

విజ—(వానికికొంత పైక మిచ్చును)

జా—అద్దో హోవూళ్లో ఎవికోరోగంవ స్తే మందేయటానికి పోయారు పో–

విజ—నీవు కూడ రమ్ము నూదివచ్చెదము. వారు మాకు చుట్టములే.

జా—హాక్కా గుఱ్రంలు హేన్గులు వుండాయి తుంజావో హాం నై యాతుం ఆకన్నడేనో జా బే–

విజ—నన్ను వారిలకు జూపింపవా?

జా—నై గాని డబ్బడగవుకదా? హాళ్ళు డాసన్ లై తో నీకెందుకు (వెనుకకుజూచి) హాద్గో మేరాబాబుకూ బులాతాహై నూ అమ్మవారు చెప్తావుండార్ పోతా బే– (నిష్క్రమించును)

విజ—వీరు ధనము నార్జించుటకే పన్నుగడపన్నెను. బహుశః వారు ముందుకేగి యుండవచ్చును. తొందరగా వారిం గలిసికొనియెద

(నిష్క్రమించును)

(రూపవతియు కాళిందులు లేచును)

కా—అమ్మా రూపవతీ ఈబాలుడు మనలను రక్షించినాడు. బోవుదము రమ్ము. (నిష్క్రమించును)

శ్రీ

# విజయవిక్రమ



## తురీయాంకము.



### 1 వ రంగము

(వజ్రపురభవనము—రూపవతి కూర్చుండును కాళిందుడు ప్రక్కన నిలువబడును,)

రూ—తండ్రీ కాళిందా! నీవొనరించిన కార్యమునకు నేనెంతయో కృతజ్ఞురాలను. నీమేలు నేనెన్నటికైన మరువను. నీకొక లేఖ వ్రాసియిచ్చెద. దానిని కుసుమకీయుము. ఆమెనన్ను పరిణయమాడదలంచెను. కాన నీవందులకేగి యామెను కృతార్థురాలుగా జేయుము. మరియొక లేకనిచ్చెదను. దానిని మనతోడ వచ్చిన జాఫర్ సాహెబుగారికిచ్చివేయుమనుము. సత్వరముగ పోయిరమ్మా. (లేఖనువ్రాసియిచ్చును)

కా—అమ్మా అటులనే చేసెద (నిష్క్రమించును.)

రూ—ఆహా! నాతండ్రియొద్ద చారువిభూషణాహార శయ్యాసనభోగంలందు విముఖినై - అష్టదశపాండిత్యములందగ్రగణ్యురాలనై యుంటినిగాని, కష్టములన్న నేమియో నెరుంగనే— సుందరాకారుండును— సమస్తవాఙ్మయప్రకాశితుండును- ధీరోదాత్తుండును- వీరాగ్రేసరుండగు విక్రముని ప్రేమించి కందర్పశరాబద్ధురాలనై సంసరణసాగరమీదుటకు వాంఛాపరివృద్ధురాలనై

మోహపాశాబద్ధురాలనై - ప్రేమరజ్జువులచేతఁ గట్టుబడితిని ఇప్పుడు నాకెవరుదిక్కు- దప్పికమైన దాహంబిచ్చువారుకూడ లేరుకదా?

(తెరలో కలకలము).

అయ్యో! యేదియో యుద్ధమువలె నున్నదే? విక్రమ జయంత యుద్ధముకాదుగదా? (లోనఁజూచి) మోహనుఁడును భటుఁడెవ్వఁడో త్రప్రాగి తూలుచు వచ్చుచున్నవారు. వారునాపైఁబడిన నేనేమిచేయగలను?

(మోహనుడు భటుడు తాగి ప్రవేశింతురు)

మో—(తూలుచు) రూపవతీ! యేయ్ రూపవతీ! డూ యూ నో హు అయామ్? గోల్కొండమహరాజ్ హంకు దేఖో. రాణిగారి హాస్పెండుని- నిను మారేజి చేస్కోవాలసి నాకైడియావుంది గోన్ కన్సెన్టు ఎట్ ఫస్టు. నిన్ను క్వీన్‌చేస్తా దెబ్బలో బల్ జోరుగావుండుగాని నీకెంతమందినో సర్వెంట్సునిస్తా. ఎందుకిందులో వీప్ చేస్తావు? కమాన్ మై డియర్ లేడీ!

భటు—ఓరీ! మోహన్ యేమిటికోస్తున్నావ్రా- నీసారకాయలిక్కడ తెగవు. రూపవతీ! అసలునేను బీజాపూర్ మహారాజును. నే సంటే నేకాదు- మై ఫోర్ఫాదర్సు— వీడుడాబుసరి, యీడు గుర్రిబ్బండి తోలుకుంటాడు కోచిమాన్-

మో—చీ, నీవు మిమన్ కుట్టుకొనేవాడవుకావా? ట్రూ వీ యుఆర్ ఎ టైలర్

భటు—మనమిద్దరం పోట్లాడుకోటం బాగాలేదు. మనమిద్దరంకల్సి పెళ్లి చేసుకుందాం-

మో—రూపవతీ! మాట్లాడవేం ఒప్పుకో నీకు బలేగాచేస్తాను-

రూ—(తనలో) అయ్యో! దైవమా వీరెంతపిచ్చివారలు— వీరునన్ను విడువరుకాబోలు. నాకిప్పు డెవ్వరడ్డువత్తురు- ఈభవనమునం దె

వ్వరును లేరు. చీటిపడుటచే యూరు సర్దుమణిగియున్నది. ఈ మూర్ఖులచేతిలో నాకు మరణము కల్గునేమోకదా? అయ్యో దైవమా నీవేతోడు.

భ—ఏం గప్చిప్పుగా వూరుకున్నావ్ నిన్ను విమువము అది నిజము

మో—ఊఁ మాట్లాడు. గోన్ స్పీకు. ఊఁ అను అంతేచాలు. నాషోల్డర్సుమీద ఎక్కించుకెళ్తా

భ—నాన్ సెన్సు చెరి ఆఫ్.

మో—ఆల్ రైటు రూపవతీ ఊఁ అను (దగ్గరకుపోవును)

రూ—భటులారా మీరు నాకు తండ్రివంటివారలు నేను మీకు తల్లిని కావున నన్నట్టి యుపసందమాటలనకుడు. నేను పతివ్రతను.

భ—ఓరీ! వెల్ స్పోకెన్. మనము దీని తండ్రిలమట. అదిమదరట.

రూ—(తనలో) అయ్యో నామాటలకు వీరు మరియొకయర్థముదీసిరే. వీరికెవ్వరు జెప్పకల్గుదురు. సుకితెప్పియుండెను. (ప్రకాశముగ) తండ్రిలారా!

మో—నాన్ సెన్సు మొగుళ్ళారా అను. ఆల్ మైడియర్ హాస్బండ్సు అను.

రూ—మీరిప్పుడు మతివిహీనులై యుండిరి. కొంచెమూగుడు. మీకు తెలివి కలిగినతరువాత మాటలాడెద.

మో—ఓరీ! మనమంటే దీని కిష్టం నే రోయ్ ఇంకేంకావాలి బలేపాచి కేశాం నక్కనితొక్కొచ్చాంరా నాకొండి. వెరివెల్ వెరివెల్ పరే పట్టుకొని ఎత్తుకెళ్దా ఆమోపుకాస్కో—

(ఒకద్వారపాలకుడు పరువిడివచ్చును.)

ద్వా—క్యారే మోహన్ నీకీ నాదికావాలాబే. ఒహాను మిస్సివాలా ఒకడు ఛట్కావాలా. మీకీ ముండాకావలా లగాలగా ఎస్కో

ఎసో- (మోహానుని త్రన్ని పారిపోవును. మోహానుడు భటుడు పైబడును. ఇద్దరు గుద్దుకొనుచుండగా రూపవతి పారిపోవును తరువాత అందరు ఆమెవెంట బడుదురు)

## 2 వ రంగము.

(వజ్రపురప్రాంతవన్యభూమి—రూపవతి కూర్చుండును)

రూ—(తనలో) అకటా! నాకష్టములు కడతేరిన వనుకొంటినిగాని యింకను సంభవించుచునే యున్నవి. వారెవ్వరో నన్ను జంపువారలే కదా? నేను బంధువులతోడనుండి రాచకులమందు జనించి యష్టకష్టముల నేల బొందవలెను? నాకెవ్వరులేరు.

సీ. భూపాలచంద్రుడు భూరిపరాక్రమ
విక్రము డైన నావిక్రముండు
ప్రేమించి లాలించి పెద్దగా జేసిన
తలిదండ్రులను నేను కల్గియుంటి
ఆప్తబంధువులుండ నాప్తమిత్రులుకలిగి
యొక్కన్నెయుంటిని దిక్కులేక
రాజ్యసౌఖ్యములుండె రమణీయవనులుండె
ఈ ఘోరవననమిప్పు డిల్లునాకు

గీ. అకట! యెందరుండినను నా యాపదలను
బాపజాలరు నాకర్మఫలమదేమొ
పలువురుండిన నాకేమి ఫలము కలదు
గీత లేకున్న గల్గునా గిల్లుకొనిన.

ఇందరుండనుండినను నెరుక లేనాదులవలె నీ భూరిభూజశాఖల క్రింద నశింపవలసివచ్చెకదా? అయ్యో శాఖలు విరిగిపడిన నాకెవ్వడు దిక్కు- త్రాచుపాములు పట్టుకొనిన నే నేమిచేతును- చోరులునన్ను నిర్బంధించిన నడ్డుపడువారెవ్వరు! నా మొరాలకించువారెవ్వరు- అయ్యో దైవమా జీవుని బొందినుండి లేపుము. ఈకరకుముండ్లపై సుకు

ఘోరదేహం బెట్లు సహించును! ఈ కారుచీకటి ఘాడజాల. దీని కేమ
వి తెల్పుదు.

సీ. కండ్లుమూసినయట్లు కారుచీకటిగ్రమ్మె
కొమ్మల బుర్వులు గుయ్యి మనగ
బందిపోటులకు చేవాడికాళ్ళు వెడల
కూటికై గూబలు గూండ్లువిడువ
కాచుపాములవికంతలనుండి వెడలగ
వనమంతయును బుస్సురనగవణిక
క్రూరజంతువులింక నెమ్మకై వెడలుచు
ఘోండ్రుఘోండ్రించును గ్రమ్మరిల్ల
గీ. చాలముండ్లు నేలను వెదజల్లియుండ
ధరణియంతయు ధ్వనులతో దద్ధరిల్ల
పెద్దవక్షులు నక్కలు వెలికిరాగ
బ్రతుకజాలను నేనిట్టి వనమునందు.

అయ్యో దీనిఁజూడ శరీరము వడకుచున్నది- ఇంక నేఁ బ్రతుక
లేను- ఇంక నామనోనాథుడు- నాప్రాణకాంతుడు- నన్ను జేరడు. నా
నాథుడు విక్రముండై ధీనిధియై విజయుని మోహనమునకు లొంగియుండె
నా? ఇంకనైన వానిమాట బెడజెవిబెట్టడా? నానాథుడు న న్ననాథ
జేసిన నాకెవరు దిక్కు — అయ్యో నాథా!

సీ. విజయవిక్రములార వీరజయంతుడా
నన్ను రక్షింపు మనాథ నేను
ననుగన్నతండ్రిరో నాదరిజేరవే
బ్రతుకజాలను ఘోరవనమునందు
ఓజగన్మోహినీ యోయమలచరిత
బ్రతికింపవా మృత్యు బారినీవు
భూజంబులార యోపూవులుగులార న
న్నోనిపోయు నాపతిగూర్పరయ్యొ

గీ. దైవమా తొలిగింపవా కష్టదారినుండి
పంచభూతంబులార యోపార్థ్జులార
మాన్యులార యోపభులార మగని జేర్చి
వినరె చూడరె తలుపరె వేగరారె.

అహా! నే కష్టములబొందుటకై బ్రతికియుంటిని కాబోలు. హా నాథా హృదయకవాటము బ్రద్దలగుచున్నది. (మూర్ఛిల్లును)

(తెల్లవారినతోడనే రాణి ప్రవేశించును)

రా—రాత్రియంతయు నీవనంబున నేదియో యార్తధ్వని వినవచ్చినది. కాని నామనోహరుండగు విక్రముని విడవజాలనైతి. ఎవరై యుండును. (చూచి) ఎవ్వరో స్త్రీవలెనున్నది. ఈపె యొంటరి గనీయుగారణ్యంబున నిద్రించుట కేమి హేతువై యుండును? ఈమె ముఖవిలాసమునుజూడ నంతగీపుర కాంతవలె గన్పట్టుచున్నది. ఈమె ముఖము దూళిదూసరంబులచే గప్పబడియున్నది ఈనిర్జనభూమి నొంటికిగా పరుండుట కేమి హేతువైయుండును అదియునుంగాక నీపె కెవ్వరో హానిచేసినట్లు కన్పట్టుచున్నది. అందువలన ప్రాణముల దెగించి మనము శిలజేసికొని నిర్భయంబుగ నిందున్నది అహా స్త్రీత్వంబెంతదిట్టమైనది వారెట్టికార్యములకయిన సాహసింతురుకదా!

సీ. భర్తలవిడనాడి పరపురుషులఁగూడి
సకలకార్యములను సాహసించు
కోపంబుకల్గిన గొడుకుల గూతుల
జంపింపగా స్త్రీలు సాహసించు
దుఃఖంబుకల్గిన దుముకు బావులలోన
దేహంబుగాల్పగా సాహసించు
పాతివ్రత్యముచేత బరమేశునైనను
సాధించి విడువగా సాహసించు
గీ. పూరుషత్వముదాల్చుచు వీరులవలె

శత్రులనుగూల్చు ధైర్యంబు సాహసించు
కష్టసుఖములు సమకూర్చగలదుపతికి
చదువులందును మించగా సాహసించు.

(దగ్గరజేరి) ఈమె గాఢముగా నిద్రించుచున్నది. అయినను బలుకరించెద. (బిగ్గరగా) అమ్మా తెల్లవారినది లెమ్ము—

రూ—(మెల్లగాలేచును.) అమ్మా నీవెవరు? నాయాపదలు బాపుదానవా కల్పించుదానవా?

రా—(తనలో) ఈమెకెవ్వరో బాధలను గల్పించిరికాబోలు (ప్రకా) ఆపదలు బాపుదాననే. నేను మీరాబాలని నాపేరు జగన్మోహిని

రూ—అమ్మా వందనములు.

రా—నీ వెవరు?

రూ—నేను మాధవుని కుమార్తెను నాపేరు రూపవతి. తరువాతసంగతులన్నియు నే జెప్పజాలను. నీప్రియుండగు విక్రమునడుగుము.

రా—(ఆశ్చర్యముతో) విక్రమునికి తెలియునా— నీసంగతి విక్రమునికి తెలియునా— వానికేల తెలియును— నీ పతి యెవరు?

రూ—విక్రమునడుగుము తెలియగలదు తల్లీ

రా—సరియే నీవు చెప్పనిచో విచారించెద రమ్ము నీకేహానియు గల్గనీయను. సందేహింపక రమ్ము.

రూ—అమ్మా! నేనా రాజు సభామధ్యంబునకు రాజాలను. నన్నుజూచిన వారలందరు హేళనచేతురు. నే నాడుదాననగుటవలన సభాంతరంబున దొట్రుపాటుగా మాటలాడుదును కాన నన్నుతిమించిన నిందవిడచి విక్రముని విచారింపుము.

రా—కాదుకాదు నీకేభయమును లేదు నిన్నెవ్వరును హేళనచేయరు నీవునిర్జనస్థలమున నుండజనదు కావుననాతోడరమ్ము నీకు మేలుచేసెద. నీవృత్తాంతంబు నాకెరిగింపవా?

రూ—అమ్మా! చెప్పితినికదా! నావృత్తాంతంబంతయు విజయవిక్రములకుదెలియును. వారికిదెలిసినచో నేనుచేయునుదెనవు.

రూ—(మాటలాడదు)

శా—(తనలో) నామనోహరుండగు విక్రమునిపై గొండెములసెప్పి శి క్షింపవలెనని దుష్టోద్దేశంబుతో నున్నదో లేక వెర్రియైయున్న దో? లేనిచో నిట్లుపల్కుట కేమికారణము. ఇంతవిపరీతముం డునా? (ప్రకా) అమ్మా! ఇఁక లేచి నావెంటనడువుము లెమ్ము రమ్ము.

రూ—(లేచినడచుచు) అమ్మా! నేనుదిక్కులేనిదాననై నీవలన సహా యము కలుగునని తలంచి యిటుకరిగినాను.

ఉ. నిమ్మతినమ్మనిన్ను భువనంబున నాకడదిక్కులేక నీ
సమ్ముఖమందుఁ జేరితిని జంపినఁబోషణచేసినన్ నినే
నమ్మితినామనమ్మున ఘనమ్ముగ నుండెడి నీదుసాధుతా
జమ్మున దాస్యవృత్తులనొనంగుము చేసెదనమ్మమోహినీ!

శా—(రూపవతి చేయిఁబట్టుకొని) నీకేమియు భయములేదురమ్మ (ని ష్క్రమించును.)

రంగము. 4



[ ఒక వైద్యుఁడు విజయుడు ప్రవేశము ]

వై—హల్లో గుడ్మార్నింగ్ మైడియర్ విజయా వాట్ న్యూస్.

వి—అయ్యా! మీకొరకై తిరిగితిరిగి వచ్చితిని. విన్నటిరేయి జరిగిన వృత్తాంబు వినియుంటిరా!

గీ. శాత్రియుంతయు నెవ్వరో రాణికొరకు
నరచియరచి పరుండె నా యటవినంను
ఉదయమున కనకొక్క యువిదనచట
ఆపెమే విక్రమునిభార్య రూపకాంత.

వై—వాట్ షీమేలు అంతపనిచేసిందా?

వి—ఆమె సాహసించినదికాదు. జయంతుఁడు తీసికొని వచ్చియుండును.

వై—అయితే జయంతుడు రూమ్‌లో వుండాలికాని ఫారెస్టులో ఎందు కుంటుంది?

వి—కొన్ని కార్యాంతములవలన.

వై—అయితే మనకిది అన్నెసిసరీ లెట్ అస్ గో అను.

వి—నేను చెప్పెదవినుము. మనకాకవయమే ప్రస్తుత ప్రసంశనీయము. లేనిచో మరెందుకు.

వై—దానిలో నేనుండాలా? యీ బిసినెస్‌లో వుండటానికి నాకేంనెసి సిటీవుంది.

వి—ఆమె విక్రమునివివాహమాడుటకు వచ్చియుండెను ఆసంగతియే రాణియెదుట జెప్పదలంచెను. రాణియొద్ద మాటలాడకుండగజే యవలయును.

వై—నన్ను క్లోరోఫారం యియ్యమంటావా?

వి—కాదుకాదు ఆమెకు కిచ్చియున్నదని చెప్పవలెను.

వై—ఐడోన్టు డూసో నీవుచెప్పరాదా ? ఆనస్పీకింగు ఆనాకీనువక్రైన కనిపెట్టుదుక్వేను అప్పుడు నాగిడ్డికి తీసేసి వ్రాస్టుచెయ్యరూ? మోర్ వోవర్ విక్రమునివైఫ్ అయితే నేనెందుకు చెడగొట్టాలి. దటాస్ సిన్ ఓమైగాడ్ అంతయనిచేయను

వి—నీకువేయిరూప్యంబులిచ్చెదను నీవుచేయనిచో మేమందరముహ తులగుదుము. మమ్మెల్ల జంపించుట నీకువాడియా? నామాట వినుము. నీకు పుణ్యమును కలుగును. మరియొకసారి తెల్పెదను వినుము. జన్మజన్మముల నూపేరును మీపేరునుగూడ జెప్పు కొనుచుందురు. మనము గొప్ప కీర్తిమంతులమగుదుము. మన మొనరింపవలసిన కార్యములు చాలగలవు. ఇప్పుడు హతుల మైననేమిలాభము.

వై—(తనలో) వీడి స్పీకింగువట్టి చూస్తే వీడు క్రిమినల్ డేంజరస్ పొసిషన్‌లోవున్నట్టు కనబడుతోంది. వీళ్ళదగ్గరనుంచి కావల

సీసంటి మనీ లాక్కోవచ్చు వీరిరువుర మానరు. దట్స్మై చ్చీస్ స్యూరు దాంతో నాసైషంతా లీడ్ చేయుచ్చు లైఫ్‌వాళ్లు బలే హాపిగా వుండవచ్చు. వీరుచెప్పినది ట్రూయే. ఒక్కఫీమేలుకై ఇంతిమందికి డిఫికల్టీస్ కల్పించటం జస్టిసుకాదు. లైఫ్‌కోసం ఎన్నయినా అబద్దాలడొచ్చునుకూడా! ఆమెకు మాడ్‌నెస్ వున్నదంటూ లేకపోతే నాదేమిస్టేకంటారు. నాకేమి యుపాయము లేదుకదా! డాక్టర్సందఱు వైద్యంబాగా చేస్తారు ఏడ్సి—కాని దీనికి డబ్బుకు మాత్రము. మంచితెరుణము ఓ మాడాక్టర్సు సంపాయించే దెప్పుడు యిప్పుడేఎవరిగుడ్ ఆపర్చ్యూనిటీ! (ప్రకాశ) విజయూ! సరే అట్లాగే చేస్తాలే. సీకేం ఫియర్ లేదు.

వి—నీవామెతో గట్టిగా నిర్భయముగాఁ జెప్పవలెను లేనిచో యును మానంబు కల్గును. నీవు సరిగా పరీక్షచేసి యీామెను మాట్లాడనియవద్దు.

వై—ఆ స్మ చ్చా స్పాపబుల్. (సిగిరెట్టు జేబులోనుండితీసి నోటిలో పెట్టుకొనును)

(విక్రిముఁడు ప్రవేశించును.)

వై—హాల్లో గుడ్‌మార్నింగ్ మైడియర్ ఫ్రెండు. (అనిటోపీపైకెత్తి దింపును. సిగిరెట్టు చేతిలోఁ బెట్టుకొనును.)

విక్ర—మిత్రులారా! సభకింకను రాణి రానికారణంబేమి? మీారెంత కాలమునుండి యిచ్చోట మాట్లాడుచుండిరి.

వి—దానికేమిగాని నిన్నటిసంగతి తెల్సినదా.

వై—వాటేమాన్ యు ఆర్ యువాంటు టు డిస్కరేజే హింమ్.

విక్ర—ఏమది?

వి—రూపవతి రాణిని గలిసికొన్నదట! నేఁడు మనలను విచారించునట.

విక్ర—ఎట్లు వచ్చియుండును.

వి—జయింతుఁడు కాక మఱెవ్వరుండును."

విక్ర—(తనలో) అయ్యో! దైవమా! వీఁడు నాప్రక్కలోని కత్తి యనినందులకు సార్థకమున కించుకొనుచుండెనే నేనిప్పుడేమి చేయఁగలను. (ప్రకా) విజయా! నన్నుఁ బ్రేమించిన రూపవతి కూడ నా ప్రాణములకు శత్రువాయెనే కట్టా! ఇంక నాగతి యేమి. నన్నెవరు పాటింతురు.

గీ. అష్టకష్టసర్వసమూహ మాప్తబంధు
వులవలె నన్నుఁజుట్టుకొనఁగ గాలచక్ర
మతిరుగఁగ జెడుదినంబులు ముందునుండ
ఏల బ్రతికియుంటి నిలనాకేమిదిక్కు.

వై—డోన్టుపీఫ్. దేరీసెలేమాన్.

వి—ఏమది?

వి—నేనొక యుపాయమాలోచించితిని ఈ వైద్యుఁడాపెకు పిచ్చియు న్నదని చెప్పెను. వీనికి వేయిరూప్యంబు లిచ్చెదనంటిని. అంత కంటె మంచిది నాకుఁ దోచలేదు.

వి—నీవేమి యూలోచించినను నాకు సమ్మతమే. అది బాగుగనే యు న్నది కాని వైద్యుఁడందుల కంగీకరించెనా?

వై—ఓయస్.

వి—అంగీకరించెను.

విక్ర—వానికిప్పుడే ధనంబీయుము. అందువలన శ్రద్ధగాఁ బనిచేయును.

వై—వెరివెల్ (సిగరెట్టుతీసి నోట్లో పెట్టుకొనును)

వి—వైద్యుఁడా! ధనంబుగ్గికొనుము. (జేబులోని సంచియిచ్చును.)

విక్ర—అయ్యా! మీరు ధైర్యముగాఁ జెప్పవలెను. మీదే భారము నేను మీమేలు మరువను. మా జీవనంబంతయు మీమీదనే యాధారపడియున్నది. రక్షింపవలెను.

గీ. దైవమైనను నీవెనాతండ్రినైన
రక్షకుఁడవైన నీవెనాశిక్షకుఁడవు

నీ వెబొ్రవుము నీమీాద నిలిపియుంటి
నాదు యాశలు బ్రొవుమనాథ నిపుడు.

వై—సర్. తమకేమియు భయమక్కరలేదు. నా అట్ వోర్స్టుపాసి బుల్ నేచైర్చేస్తా. నేచెప్పిన తరువాత ఏమిజరుగుతుంది? (సిగిరెట్టు మరల చెవిలోఁ బెట్టును.)

విక్ర—ఏమైననుసరే. మనపై యనుమానముండదు కదా? అంతియే చాలును. ఆమెకు పిచ్చియున్నదను నప్పుడు పల్కు మాటలన్నియుఁ బిచ్చగానేయుండునని భావింతుముకదా! అట్టి సమయమున మనకేమి భయము. మన యిష్టమువచ్చినట్లాడవచ్చును.

(రాణి రూపవతితో ప్రవేశము. అందఱు ప్రక్కనిలుచుందురు.
కొంత సోబుదారి జమానులుకూడ ప్రవేశింతురు)

దర్బారు.

సోబుదారులు—జై జగన్మోహిని రాణిగారికి జై.

అందఱు—దేవివారికి స్వాగతము. దేవివారికి జయమగుగాక. జయమగుగాక.

రా—(సింహాసము నధిష్టించును.) విక్రమా! నేటి దర్బారు కారణం బెఱుంగుదువా?

విక్ర—తెలియును.

(విక్రముఁడీక్రింది ప్రశ్నల కుత్తరంబీయఁడు.)

రా—ఈపె మెవ్వరో నీకు తెలియునా?
పలుకవేమి?
ఏసంగతియుఁ దవ్వరగాఁ జెప్పుము
ఈమె సంగతిఁ జెప్పుటకు నీకు భయమేటికి? మీాయిద్దఱికేమైన
సంబంధము కలదా? ఈమె నిన్నెరుంగునట!
రూపవతియనిన నీపెయేనా?

నీవు వివాహమాడ దలంచి కన్యారత్నమిదియేనా? పలుకుము (రూపవతితో) ఇట్లు నైన మీ పరస్పర సంబంధంబులం దెల్పుడు

రూ—అమ్మా! నేను మాధవుని కుమార్తెను. నన్నుఁ జయంతునికీయ దలంపగా నేను విక్రముని బ్రేమించి వానితోడవచ్చి వనపురంబున నుంటిని. ఆయిన నన్ను వివాహమాడెను. తరువాత వనపురోద్యాన వనమందున్న భవనమునందుంచి నా నాథుఁ డొకనాఁడైనను ప్రేమపూర్వకంబుగా మాటలాడక లక్ష్మీపురంబుననుండి విజయుని భార్యఁగ వచ్చని లేఖవ్రాసెను. విజయుడు నన్ను నిర్బంధించి తరువాత విషము పెట్టెను. భగవంతుని దయవలన బ్రతికి మీసన్నిధానంబునకు వచ్చితి. ఇదియే జరిగిన వృత్తాంతము.

తా—విక్రమా! ఇదియేనా జరిగినది?

విక్ర—అది నాకేమియును తెలియదు.

తా—నీకు తెలిసినది తెల్పుము.

విక్ర—(ఊరకుండును.)

తా—రూపవతీ! వివాహంబైనట్లు సాక్ష్యము గలదా?

రూ—అమ్మా లేదు. మీకు తెలియునేమో యనిభయముచేత వాలికి తాసీయ లేదు.

తా—ఆహా! విచిత్రముగానున్నదే నరే! ఇప్పుడు మించిన దేమున్నది. నీకెవ్వరియందిష్టముకలదు? విక్రముని వివాహంబాడుదువా?

రూ—ఆఁ

తా—జయింత విజయ సేనులనో?

రూ—(మాటలాడదు)

తా—జయింతవిజయ సేనులను నీసంగతి విచారింపనా?

రూ—ఊఁ

రా—సరిగా చెప్పుము. ఇదివర్కారు నీవు చెప్పెడిది నిజమైన నీకు భయమేటికి.

రూ—నాకేమియుఁ దోచుటలేదు.

రా—తోచకపోవుటేమిటి? నిన్నెవరేమనిరి? పిచ్చిదానివలెనుంటివే?

విజ—(ముందుకునడచి) అమ్మా! ఈ మెకుమతి భ్రమకలదు. కొంత కాలము పిచ్చియు కొంతకాలము యథాప్రకారముగా నుండును. ఆపెను నేనెరుంగుదు. ఆమెకిది చిన్నతనము నుండియుఁగలదు. తల్లీ! యీ మెముఖము సరిగాఁజూడుము. ఆమెకు కొంచెము తెల్వియుండుటచే సిగ్గుచేక చెప్పనది యబద్ధమని తలంచుకొనుచున్నది.

రా—ఈమె నీపైఁ కూడ చెప్పుచున్నదే! ఈమె మెవరో నీకెట్లు తెలిసినది.

విజ—మాయిద్దరిదియు నొకటే గ్రామము నేనీపెకు పిచ్చిబాలకాలమునుండి చూచుచుంటిని. చిన్నతనంబునుండియు నిట్లనేకములు చెప్పియున్నది. పిచ్చియుండుటచేత నీపెనువిడిచి వేసిరి అందువలననే నిన్నటిరేయి ఘోరవిపినమునందుఁ బరుండెను. సామాన్యమానవులుండఁగలుగుదురా? చూచినయంతగాని వివాహంబాడ దలంచియేమియో పల్కుచుండును.

రా—ఈమె భర్తయెవరు?

విజ—పేరునాకు తెలియదుకాని యీపెఁకు రణరీతి విశారదుండు, తమ సైన్యములో ముఖ్యసేనానాయకుఁడుగానుండి మొన్నమీరాతును త్రిలింగాధి పులకు జరిగినసంగరంబులో మృతినొందెను. అందు వలననీమెకు మరింత పిచ్చియెత్తినది.

రా—నిజమేనా రూపవతీ!

రూ—(దుఃఖించుచు నూరకుండును.)

రా—(తనలో) ఈమె ముఖంబుఁజూడ వెర్రిదివలెనే యున్నది. దానికి దోడు మాటలు సాయముగానున్నవి. వైద్యునిఁ బిలచి పరీక్ష

చేయించెద నందువలన నంతయు విశదంబగును. (ప్రకా) విజయు సేనా! వైద్యుని గొనిరమ్ము. పరీక్ష చేయింతము.

వై—(తనలో) ఏ కారిగుడ్డాపర్ట్యునిటీ కలిగింది. నేనేం చెప్తే అదినర్టెన్. (ప్రకా) అమ్మా! ఏమికలవు?

రా—నీవీమెకు వ్యాధియేమైననుగలదేమో చెప్పఁగలవా?

వై—ఓయస్ చెప్పగలను.

రా—చెప్పుము. (పరీక్ష చేయుచుండును.)

విజ—అమ్మా! ఈమె సౌందర్యమునకు జయంతుఁడు లోబడెనుకాని భూపాలుండును శూరాగ్రేసరుండగు విక్రముండు ప్రేమించునా అదెట్లునమ్మెదరు.

వై—అమ్మా! డిసీస్ ఏమి కనబడలేదు నేను డయాగనైజ్ చేయ లేక పోతిని (రూపా॥తో) నీకేమి వ్యాధికలదు చెప్పుమమ్మా.

రూ—(దుఃఖించుచు మాటలాడదు)

వై—ఓ సీ సోమందమతు . . . మెకు అమ్మా, యీామెకు పూర్వు మన్ పిచ్చవున్నది. ఆఫీసు ఆటారిం ు అదిచూస్తే నూవ్ నెస్సు వున్నదని నిమిషంలో కనుక్కోఁవచ్చు.

విక్ర—(తనలో) సెబాష్ బాగుగావున్నది.

విజ—(తనలో) బతికితిమి మరల మాటాడకుండఁ జేసినాఁడు.

రా—ఈమె సేమిచేయువలెను.

వై—ఏమిచేస్తే యేముూసు. యీామె పశానుకు పంపిస్తేమంచిది.

రూ—(దుఃఖించును.)

వై—నీనీ అన్నిసినరిగా ఏకుస్తుంది. ఫాదర్ అంటే నవ్వాలి.

విజ—ఇచ్చోటనుంచిన చూచిన యుందగాని నెల్లవరించినారే నాథ స్తలను క్షాన తనుజ్ఞాశత్త చేయువలెను.

రా—వైద్యుఁడా! నీవీపెను గొంపోయి కారాగారమునం దుంచుము. తెలివిగల్గినచో తీసికొనిరమ్ము లేనిచో బంపివేయుము.

వై—చిత్తము.

(రూపవతితో నిష్క్రమించును. సోబుదారులుకూడ వెంటబోవుదురు)

విక్ర—ప్రాణప్రియుఁడా! బ్రతికించితివి. లేనిచో నీమె మన కూపిరి నిలువనిచ్చునా? ఎంతచెప్పినను నమ్మనదికాదు.

విజ—నిశ్చయముగా మన మదృష్టవంతులము.

రా—విక్రమా! నీకుఁగూడ నేమైనఁగలదా? ఎన్నిప్రశ్నలు వేసినను పలుకవేమి? నిన్నును బరీక్ష చేయుంచమనెదవా?

విక్ర—ప్రాణేశ్వరీ! ఈపెసంగతి నాకు తెలిసిన నాదగ్గిఱదాచి యుంచుదునా? విజయునిఁ బంపి మనము మాట్లాడుకుందము. (విజయునితో) విజయా! భోజన సదుపాయంబులఁ జూడమని యాజ్ఞాపించుము. మేమిద్దరమచ్చోటికి వచ్చెదము. సత్వరముగఁ బొమ్ము.

విజ—సరియె. అట్టులనే చేసెదను. (నిష్క్రమించును.)

రా—ప్రియుఁడా! నేను నీపైకోపించితినని సందేహింపకుము. నేను దర్బారులో నున్నపుడట్టులనే మాట్లాడవలెను. లేనిచో బ్రతివారును నన్ను నిర్లక్ష్యంబుగాఁ జూచుచుందురు. నవ్వుదురు. ప్రేలెదరు. నిజముగా నీపై ప్రేమ నేనెన్నఁగల్గుదునా?

సీ. మురిపంపు మోహంబు మోహమేకాదది
కుసుమాస్త్రుని తుపాకిగుండుగాని
మధురంపుమాటలు మాటలేకావవి
వలరాజు వలపుల వలలుగాని
సొగసు చూపులతీరు చూపులేకావవి
రతివల్లభుని బాణరాశిగాని
ముఖవిలాసము బూర్వమునులైన నెనలేరు
చంద్రమండలకాంతి చాలదహహా!

గీ. అట్టి నీకంటె లేరు నాకాప్తు లెవరు
సర్వమును నీకె; నీయందె సంతసమున
నిల్పియుంటిని హృదయంబు నిజముగాను
నాకుఁజూపుము నీప్రేమ నళిననేత్ర!

నీపై నుండు ప్రేమ మదనమోహానుని మీఁదఁగూడ లేదు. నిన్ను చక్రవర్తిగాఁ జేతు ననుభవింపుము.

విక్ర—నీవు నాకు రాజ్యాధికారత్వమిచ్చి నీయిష్టము వచ్చినట్లు నన్నుఁ బాలించుము. నీరాజ్యంబు నేపాలించెద.

సీ. కలకంఠి! మధురంపు గానంబు సేయుచు
నానందబాష్పము లద్దుకొనుము
మనసైనఁగోపించి మన్నించి లాలించి
యంతలో చెలగాట లాడుకొనుము
మోహంబు కల్గిన దేహంబు మరచుకో
లలిత బాధములలోకి లాగుకొనుము
ఆహారమావసవి హారముల్గోరిన
చెలువుగా పోషణ చేసికొనుము

గీ. ప్రేమతో మహాప్రేమతో పెంచుకొనుము
చేయఁదలఁచిన శుభములఁ జేసికొనుము
నేను నీయండ కాయుచు నిలచువాఁడ
చేయుము మదిఁదోచినదెల్ల సిగ్గు లేక.

రా—ప్రాణప్రియా! మనోహరా! నీవు నిజంబుగా నామనంబు నపహరించితివి. నీపై మోహంబు నిలుపఁజాలను. సర్వకాల సర్వావస్థలయందును నీతోడు నీడగానుందును.

సీ. రాజులలోకెల్ల రారాజుఁ జేతును
మంత్రినై తోడుగాఁ బరగుదాన
విరహంబులోకెల్ల మరుని మించగఁ జేతు

వేశ్యనై రతుల గావించుదాన
భక్తులలోనెల్ల భక్తాగ్రగణ్యంబొ
సంగి వేదాంతినై సరసనుందు
భోగులలో మహాభోగిగాఁ జేతును
భార్యనై నిసుములు మడియఁజేతు

గీ. శూరసనై రణనీతికి గురువునగుదు
మంచి వేళల నెప్పుడు బోధించుదాన
రత్నగమునుఁ జేసి కీర్తిగౌరవమొసఁగి
గొప్పపేరు నీభువి నిలకొల్పుదాన.

నాథా! నీముఖంబుఁ జూచినకొలఁది చూలపునెడి యుదకంబుచే త ప్రేమలత పెరుగుచున్నది. ఇఁక ఫలింపవలెను. రాజ్యభారం బంతయు నీనామమునుండి యనుభవింపుము.

విక్ర — కాంతా! ఒదిసరియె కాని యొకటి తెల్పెదవినుము. రూపవతి నాపైఁ జవ్వనని నాకు తెలియును. అందువలన మిగులభయంబు కల్గి మాటలాడ కూరకుంటిని.

రా — భయమేటికి.

విక్ర — నాప్రాణకాంతవు నీవై యుండఁగా మఱియొకతె నాయొద్దనుండ నసెప్పరాకుండునా?

రా — నుకేమియు భయములేదు. నిజముగా నాథా! మీకుమఱియొక తేలకావలెనా?

విక్ర — నాకుకాదు విజయునికి.

రా — సరియే! అయిన దానికి విచారింపనేల? మరల మనదర్బారెండు లకు నిన్నుజూడ నాప్రాణములు సహింపుటలేదు. ఒక్కముద్దిమ్ము పిదప సౌధములోనికరుగుదము (ముద్దిడును.)

విక్ర — (లేచినడచుచు) కాంతా! ప్రాణకాంతా! ఈయుంగరము నీవుంచుకొనుము. (ఇచ్చును మరలవాని మెడలో హారము వేయును)

మధుర యధరపానమొసంగి మరల నీవి
లాసమును గో్రలి జగత్తిపై నాశవిడుతు.

నాథా! భార్య మీకెప్పుడు తోడునీడగా నుండునని మీకు తెలి యదా! భార్యయేకదా పురుషునకు మూలాధారము.

గీ. ఆపదలఁబాపు సౌఖ్యంబునందఁజేయు
వంశవృద్ధినిజేయును భర్తతోడ
నిచ్చకములాడి సంతోషనిధినిమగనిఁ
జేయుమరియు స్వర్గప్రాప్తిచేయు భార్య.

ప్రాణనాయకా! మీరీదుర్మార్గుని చెట్టపట్టినాకిట్టి కష్టములఁగ ల్పించిరి కాని యిది మీకు కల్గినదికాదు. దుర్మార్గులతో చెలిమివలన లాభంబేమికలదు.

ఉ. సంతత సద్గుణంబులను సంపదచేతను వెల్గుచుండినన్
సంతతముస్ దురాత్ములను సాకెడివారి కనర్థమేకదా
ఎంతటిరాచభార్య గుణమెట్టిది రూపరికైక దేవితా
చింతలఁబొందె సుందరిను చేరిసెనంగుట చేతనేకదా.

ఇఁకనైన వానిని విడనాడి నన్నేలుకొనుము. మీకేలువారును. నే నేలఁ బడుదానను నాయందేమైన దప్పులున్న క్షమింపుము.

విక—కాంతా! రూపవతీ! అటులనే చేసెదను. నామిత్రుని దూలనా డకుము. వానివలన నేనీకంటికి కనుపించితి లేనిచో నున్నయె. ప్రియురాలా! నీవిచ్చోటి కెట్లురాగలిగితివి.

రూ—నాథా! నన్ను బయటికి కానిమ్మునన్నుఁ గొనివచ్చినవారి పేరు తెల్పిన వానిని శిక్షింతును నేనంటట పాపంబు కొడికట్టను. ఉపకారమున కపకారంబు జేయను వారివలన నేబ్రతికితిని మీ దర్శనము లభించినదే అతఁడు నాతండ్రిసమానుఁడు కాన నేజె ప్ప చాల క్షమించుము.

విక్ర — ప్రాణేశ్వరీ! ఇక శిక్ష చేయుడు వానికిని నాకును ప్రాణస్నేహంబు కల్గినది. నాకు తోడ నీడగానుండి రక్షించెను. వీనిని నేనమ్మితి ఇప్పుడు నిన్నుఁ జేరదీసిన నెవ్వరైనఁ జూచి రాణికిఁ దెల్పుదురు, నాకిప్పటికే భయంబు కల్గుచున్నది. నీవు విజయునితో వనపురంబున కేగుము.

రూ — నాథా! నేనెంత చెప్పినను వినవు కదా! విజయుఁడు నన్నుఁ జంపునని మనోభీతి కలుగుచున్నది. ఏమైనను సరే మీ మాట జవదాటను మిమ్ముల నిర్బంధించను పతిభక్తియే నాకు సర్వము మీయాజ్ఞ నొనర్చుటే ప్రథమ కర్తవ్యము నాథా! ప్రాణనాథా! నా ప్రాణములపై యాసవదలుకొని వీనితో బోయెద. నాథా! మరి యొకసారి తెల్పెదను వినుము. నిజంబుగా విజయుఁడే విన్నఘాతంబున ముంచెను. జయంతుడన్ని విధముల సహాయము చేయుచుండెను.

విక్ర — రూపవతీ! నీకేమియు భయము లేదు. విజయుఁడు నీతిమంత్రివంటి వాఁడు నీకేమియు నపాయంబుఁ గలుగనీయక వెంటబెట్టుకొని పోవును. కావున భయపడకుము (విజయునితో) విజయా! నీవీమెను జాగ్రత్తగా గొనిపోయి వనపుర భవనమునందుంచుము.

రూ — పతీ! నాథా! ఎంతపని చేయుచుంటిరి? (మూర్ఛిల్లును.)

విక్ర — విజయా! ఈమె మూర్ఛిల్లినది. ఈమెనిచ్చోటనే యుంచుదుమా.

విజ — ప్రాణములపై నాశవదలుకొని కీర్తి మంటగల్పుకొనిన పిచ్చుక తోఁడు మూర్ఛ కూడనా?

విక్ర — సరియే నేను జయంతుని ఖండించెద. నీవీమెను గొంపొమ్ము. జయంతుని మరణ వార్త నీకు తెల్పెద. నీవేసినతోడనే నాకుఁ గబురంపుము. తీసికొనిపొమ్ము.

రూ — (లేచును)

(జయంతుఁడు ప్రవేశము)

[విక్రముఁడు కత్తిఁదీసి వెనుకంజ వేయును.]

జ—(తనలో) ఆహా! రూపవతి యీస్థలమున లేనికారణంబేమైయుండును? ఆక్రూర విక్రముండాపెను మరల వనపురంబున కంపె నాఁబోలు! సందేహంబేమి! విజయుఁడే గైకొనియుండును. ఆమె నానుజాతుఁడు వివాహమాడునో లేక చంపివేయునో ఆహా! ఆ క్రూరుని కట్టిదుర్బుద్ధి కల్గుచుండెను. ఆమెకు సకల కష్టములను కల్గించుచుండెను కదా! నాకంపకుండ దొంగిలించి వివాహమాడక బాధలు పెట్టి వెలకాంత సమానరాలుగాఁ జేసెనే.

విక్ర—(పళ్ళుకొరకుచు మీసంబుల ద్రువ్వుచుండును)

జ—విక్రముని జంపినచో నామె సుఖపడఁగలదు. అదియెమందు ఎన్ని విధముల ప్రయత్నించినను తిరిగి మాకు లంకె వేయుచున్నాఁడు. (కత్తిఁదీసి)

గీ. మూర్ఖుఁడైన విక్రమునినే ముందుజంపి
వెండియు విచారమును జేతువెతలు చాల
పొందిననుసకే మాభూన భోగశరములు
క్రుంగిననుసకే విడువక కూల్చువాఁడ.

రూపవతిఁ జూచుటకిందులకు వచ్చునుకదా! అప్పుడు హతంబు చేసెద. (అటునిటుచూచుచు విక్రమునిఁజూచి వెనుకంజవేసి కత్తిఁఝళిపించును) విక్రమా! నీతోడ నొక్కమాటఁ జెప్పవలె వచ్చెదవా?

విక్ర—ఓరీ! నేను నీతోడ రానలెనా? నాతోడ మరియొక స్థలంబున యుద్ధంబొనరింపఁ దలంచితివా? మగవాడవయేని రమ్మిఁక నీవు కాదు నేనే వచ్చెద (మీఁదఁబడును.)

(ఇద్దఱును యుద్ధముచేయుచుండ జయంతుఁడు క్రిందపడును. విక్రముఁడు పైనఁగూర్చుండును.)

(జాఫర్ ప్రవేశించును.)

జాఫర్ — ఈపుష్పారం నూరిజ్ఞానుని [illegible] సచ్చిసచ్చివచ్చా ఈళ్ళు [illegible] (మాంచు) [illegible] చ్చా [illegible] లాగారెక్కె యేసోండి. చిత్తోబాకో లాగావ్ లాగాన్ హాప్రికింభోయి! గోలన్నె గడిటడన్నైకరో! దీస్కెయేసో జల్ది దేఖో.

(విక్రముండుత్తరమందుకొని కత్తిని విడచి జయంతుని లేపును.)

విక్ర — మిత్రమా! క్షమింపుము. నాకిప్పుడు జ్ఞానము కల్గినది.

గీ బుద్ధిహీనుండనై నేను జోగుచుండి
కార్యమును సేయలేను నన్గావుమయ్య
నీముఖముంజూడ నొల్లను నామనంబు
మిగుల దూషించినన్ను క్షమింపుమయ్య.

జ — (తనలో) ఏమి యాలోచించితిని. నీచుడిట్లు క్షమార్పణం గోరుట కేమి హేతువై యుండును. నాతోడ పోరు సల్పలేకపోయెనా? కాదు కాదు. ఈబాలుండు తెచ్చిన లేఖయందేమియో విశేషమున్నది. అందుచేతనే శరణు వేడుచున్నాడు. లేనిచో వైరాగ్యము కల్గెనో యడిగెదంగాక (ప్రకాశముగా)

గీ. శరణు వేడుటకిప్పుడు కారణమును
తెల్పు విక్రమా! నీకేలతిరిగె బుద్ధి
భూతదయ కల్గెనా లేక చేతులు బల
హీనత గలిగెనా లేక నేమిగలిగె

వి — మిత్రమా! నీవు నాకు శత్రుడవుకావు. నిన్నుజూడ నామనంబొల్లటలేదు. నీమీదపగంగొని యున్నందుల కెంతయో తలవంపులుగా నున్నది. నేనీయుత్తరమున జూచినవెంటనే నీయందు మిత్రభావంబు కల్గెను.

జ — మిత్రమా! దీనియందేమున్నది.

వి — చదివెదను వినుము. (చదువును)

వజ్రపురము.

విక్రమునికి నీప్రియభార్య వ్రాయు విశేషములు.

నేనిప్పుడు వజ్రపుర పౌరరాజమ్మున రాణిసందర్శనార్థమై కాళి దనహచరు రాలనై వచ్చియుంటిని. ఏలయన నన్ను నీమిత్రుఁడు విజ యుఁడు కల్పించిన బాధలకు మేరలేదు వాని పోరుచలన నేనిందులకు నాస్వయంబుద్ధి చేతనే వచ్చియుంటిని. నేను భవనమునకు వచ్చుట జయుంతుఁడే కారణభూతుడని వానిపై కత్తుఁగొనకుఁడు. అతఁడు నాకు తండ్రివంటివాఁడు నన్నుకష్టదశలనుండి తొలగింపవివిధ ప్రయత్నములు చేసెనుకాని విజయుఁడడ్డు తగులుచుండెను. నన్ను బొరీ భవనంబున జూచుటకు విజయుడే కారకుడగును. మనల గోతులో దింపువాఁడే విజ యుఁడు మమ్మాటికి నమ్మకుము. బాగుగా నర్థముఁ జేసికొనుము.

ఇట్లు నీప్రియభార్య,

రూపవతి.

జ—మిత్రమా! ఇన్ని దినంబులనుండి నీవేమి కొనుచుంటివి?

వి—నీవేనా యనర్థకంబునకుఁ గారకుండవని.

జ—కాదు కాదు.. నీమిత్రుఁడే నిన్నఘాతంబున దింపెను. నేను నీకు సహాయముఁ జేయదలంప నీవన్యథా తలంచితివికాని విక్రముని తియ్యని పల్కులు నిజమని భావించితివి.

వి—ఆహా! మిత్రమా! జయంతా! ఎట్టి దురవస్థకగ్గెను. ఎందరో యుపదాధులని తలంప మిత్రమాయని పిలుచు విజయుఁడు శత్రు వయ్యెనే! శత్రుండవైన నీవు మిత్రుఁడవైతివే. ఎట్లు మారి పోయెను. ఇట్టిపొంగ నీశ్వరుఁడైన బట్టఁజాలడు గదా! ఇంత కాలమునుండి నేనెరుంగనైతిని.

సీ. విజయుఁడే నాకిట్టి విపత్తులఁ గూర్చినవాఁడు
ఇంతకాలమునుండి యెఱుఁగనైతి

జ—ఎన్నిదినంబులైనవి?

వి—నేఁడే.

జ—అటులైనఁ గబురంపుము. వారు దగ్గఱలోనే యుందురు. కావున వారిఁ గలిసికొనుట సులభము.

వి—మంచిదటులనే చేయుదము? సేవకా.

సే—(ప్రవేశించి) సర్కర్. ఏం వచ్చింది స్వామీ అయ్యా దొరగారూ!

వి—నీవు వీనితోఁగూడఁబోయి విజయుని రూపవతిని గలిసికొని వారి నిట రమ్మనుము. నేను పిలచుచుంటిననుము. వేగమే పొమ్ము. (జాఫర్ వైపుచూచి) బాలకా! సత్వరము నీవు గూడ పొమ్ము.

సే—సిత్తం మహాప్రభో అయ్యా శెలవు. సిత్తం దండాలు. (జాఫర్ తోఁడ సేవకుఁడు నిష్క్రమించును.)

వి—మిత్రమా! మనమిప్పుడు చేయవలసినదేమి?

జ—మిత్రమా! నాకనుమానముగా నున్నది. ఈ వెడలిన వారిని విజయుఁడు చంపునేమో మనమిప్పుడే పోవుదము స్వయంబుగా వానిఁ జూచుట మంచిది.

వి—సరియే బయలుదేరుదము. నాకును సందేహంబుగానే యున్నది. ఇన్ని కార్యంబులు చేసినవాఁడు మన సేవకులను జంపకుండునా?

సీ. తొల్లి నాభార్యను దొంగిలించిన వాఁడు
వనపురంబున నుండువాఁడే వీఁడు
నాభార్యయని నేఁడు నీభార్యయని రేపు
పలుకుచునుండెడి తులువయే వీఁడు
చాలమాటలసెప్పి కీలుబొమ్మలనాఁడి
యాడించినట్టి మహాపిశాచి

రూపవతికి విసమోప యోగముచేత
జంపింప దలఁచిన జాణయొసఁగు

గీ. అట్టివిజయుని నమ్మిన నెట్టియాప
దయిన కల్గును కావున నతిరయమున
పోయి విజయసేనుని తోడఁ బోరుసల్పి
కూల్పవలెను; లేనియెడల కూల్చుదాని.

జ—సరియె పోవుదము రమ్ము అదృష్టవంతులు మేని వారిఁ గూడుదము లేనిచో నాపె మరణంబుఁ జూచుట నిజము. ఇన్ని బాధలఁ బెట్టినవాడు చంపకుండునా?

గీ. మిగుల వేగంబుతోఁ బోయి విజయసేనుఁ
గలిసికొనవలె లేనిచోఁ గాంతకిపుడు
సకలయిడుములఁ గూర్చునో చంపునేమొ
యపుడు మనయాశలన్నియు నడుగుఁజేరు.

పంచమాంకము సమాప్తము.

శ్రీ

# విజయవిక్రమ

## షష్ఠాంకము.



### 1 వ రంగము.

(ప్రవేశము విజయుఁడు రూపవతి అరణ్య ప్రదేశము.)

వి—(బిగ్గరగా) తొందరగా నడువుము. (గెంటును.)

రూ—అయ్యో! దైవమా! నేనెంత నడువంజాల. నాకట్టి యిక్కట్టు లొనగూర్చితివి. నిన్నింత వేడినను రక్షింపవదేల? నీవార్తత్రాణపరాయణుండవు కావా? నీవాదరిని రక్షింపలేవు. నేను వారిలో నొకదానను గానా?

సీ. దశరథునింటను దాశరథివయి జ
 న్మించి రాక్షసులను ద్రుంచలేదె
బుద్ధుండవై నీతి బోధించి జనులకు
 నిర్వాణమొసగగా నీవు కావె
కృష్ణుండవై భూమికింక భారము
 దగ్గించి ధనము నోదార్చలేదె
ఇదియవతారముల్ పాప మాప్పం గెత్తి
 క్రూరులం బాపుల గూల్పలేదె

గీ. దుష్టజాతివారిల నీవు దునుమలేదె
సత్యమును ధర్మమును నిల్పె జగతియందు
నటుల చరియింపనా నేను? అమలచరిత
వినవె చూడవె తలపవె వేగ రావె.

[తెరలో]

వన—గీ విజయసేనుఁడా! నీవింక వెళ్ళవలదు
గెలుపునుచోట నేఁడూరక నిన్నుఁజేర
దేఁచినాఁడ; నాగుణగణముల ... ను
చిన్నిమాటను నీతోడఁ జెప్పవలయు.

విజ—(లోనఁ జూచుచుండను) ఏమీ? దుష్టుఁడు మన్మథుఁడు నాపువాఁ
డా! కానిమ్ము. వాని శిరస్సిప్పుడే ఖండించెదగాక.

రూ—(తనలో) అయ్యో! రక్షింపవచ్చినవానినిఁ గూడ జంపెదనను చుం
డెనే. ఇంకనే బ్రతుకుటెట్ల? పోనిమ్ము. వీనిచేతిలో చచ్చినాగదిన
వీరస్వర్గప్రాప్తియైన గలుగకుండునా.

గీ. కటకటా! యిట్టిఘోర దుష్కార్యమేను
చూడలేనింక నాప్రాణిఁ దోడుకొనును
క్రూరవిజయుఁడు నన్నువధింపఁగలఁడు
... నోర్వజాలనో బాధరహిత

(జాఫర్ సేవకుడు ప్రవేశము)

జా—హీం హజ్రత్ ... జల్దీబులాతా హై దొరగారికి జల్దీఆవో
అదియే టో ... వీసస్తుందా ... వాస్వ రూపవతి బులావ్
విజయుకు బూలావ్ కేలుచెప్తారు హాయివార్కి వస్తావాఏమి

వి—ఏమి? ఏమనుచుంటివి?

జా—ఏమి నైగీమినై హయ్యవార్కి బులాతాహై జల్దీఆవుబే హట్టా
నూస్తావ్ క్యాబే

వి—ఛీ! దురాత్మా! నీవిట్టి వార్త దెచ్చినందులకు నీశిరంబిప్పుడే
(తెగవేసెదఁ జూడుము (కత్తిఁగాయును) నేను బయలుదేరిన
తరువాత వచ్చెదననుకొంటివా! నేను రూపవతి యింటనుండనని
నీవెరుంగవా? నన్నురమ్మనెదవా? ... రయే వచ్చెద నీవింకఁబొమ్ము
దుము • (నరకును)

ఏమైనను ... గ్గరనున్న జంతువొకప్పుడైన (బ
తు... ఆయుధము జేబట్టుము (కత్తుల
జేబూని సిపాయిమింతురు)

రంగము. 3

[ రూపవతి వనపుర సౌధంబులో నొకగదిలోనుండును. ]

(దానిముందర నొక గొంయ్యయుండును)

సీ. తలిదండ్రులార! బాంధవులార! చెలులార!
కాలాంతరపు నమస్కారమిదిగొ
ప్రేమించిర సాలంబెట్టిన నాథుండా!
కడకిదే నానమస్కారమండి
పలుబాధలను నాకు ... ప్రజయుంతుడా
అ... గెన వందన మందుకొనుము
కడునిడుముల బెట్టి ... విజయుండా
కాలాంతరపు నమస్కారమిదిగో
గీ. ఇంచుకైనను ... చవట్టి
రాణికి భగవం... రామచంద్ర
మూర్తికిచ్చెద ... సారి
అమ్మలార! ... నందుకొనుడు.

ఓ పంచభూత ప్రభువులారా! విక్రముని వివాహమాడిన సంగతి
యు విజ... బుద్ధి... మీరు చూచుకొని తిరిగదా నన్ను
గొనిపోయి నాపతి పాదారవిందముల కడమృతి నొందజేయుడు.

విజ—రూపవతీ! ... కేక ... పెట్టుచుంటివి? వివాహమాడుట కొ
ల్లుదువా లేక చంపుమనెదవా?

రూ—(దుఃఖించుచు) అయ్యో! దైవమా!

విజ—ఏమిమాటలాడవు. ఊరకుండిన ఊఁ అనినట్టులేనా!

రూ—(మాటలాడదు)

[ తెరలో బూరధ్వని వినఁబడును. ]

రూ— (సంతోషముతో) విజయా! అర్జునా! ఆర్తనాదము వినుము నానాథు [illegible] కొండి చుము. నీవిచ్చోటనే నిలుపుము. నన్ను రక్షించు దైవము వచ్చుచుండెను భగవంతుఁడే వానినిఁ బంపియుండును. దైవప్రార్థన వ్యర్థము గాదుగదా!

ఉ. నాఁటివచ్చుచుండె నికనాయుధముల్ దరిఁజేర్చు నీకనా
యీపదలిన్ని నిప్పుడె తుంచె ముఁగ్గును నమ్మమోరికూ్రి
రా! ఎరిగత్తవేయిపుడు ప్రాణము రక్షణఁజేసికొం బా
హాపటుశక్తిచే నిపుడె యతముచేయును నీప్రతాపము నే.

(విజయుఁడు [illegible] చేయును మరల ధ్వని వినఁబడును.)
నాథా! మీరవలె ప్రకాశము వచ్చియుంటిరా? నాకు ధైర్యము కల్గుచున్నది. నాథా! [illegible] (ముందుకునడచి) నన్ను రక్షింపుము. మీ కౌగిటఁ [illegible] నాథా! మిమ్ముఁ బోషింతును నన్ను మీరే [illegible]. (ముందుకునడచి గోతిలోఁబడి) హా! ప్రాణనాథా! చచ్చితి! నాథా! ధన్యురాలను. (ప్రాణములవిడుచును.)

(విక్రమసింహుఁడు జయసింహుఁడు పరుపిడి ప్రవేశింతురు.)

విక్ర— (పరుపుఁ జేయినేసికొని) అయ్యో! నాకింకెక్కడి రూపవతి ఛీ! నేను బ్రతికిన ఫలంబులేదు. ఎన్నిదినంబులనుండి.

జయం—(కోపముతో) విచారింపకు దయవాతఁ బొందవచ్చును ముందు వీనిదెగఁజేయుము.

గీ. ఓమహాపాప! మోహాంధ! కామలోభ
కాచికొమ్మిదె నూతన ఖడ్గమునకు
బలియొసంగెద మూర్ఖ! రూపవతి జంపు
వాఁడవానీవు? నింజాపువాఁడనేను.

(నరకును.)

తుండ నేనేయుని యురికాజ యొసంగుము. ఇమెచేతిలో నేనేల మృతి నొందవలె నాచేతులారా [illegible] జీవనంబుఁ గద [illegible]ద (పొడుచుకొని) హా! దైవమా! [illegible]. పాపరహితుండనైతి.

## రంగము 4.

(శాణి సన్యాసివేషముఁ దాల్చి ప్రవేశించును.)

శా—అహా! అబద్ధము అన్యాయము మోహము వినాశనంబునకుఁ గుమారులై జన్మించెనుగదా. వీరలో సవ్వరి నాశ్రయించినను తండ్రియొద్ద కంపుము. నిశ్చయముగ వీరికిది వాటిల్లినది.

ఉ. చుట్టములాదివోయె; కడుశోకము నాకొనగూర్చినారు నే
నిట్టి మహాసముద్రమున నీదగలేను వస్త్రాంతరంబులన్
జుట్టుల వ్రుట్టలన్ దిరిగి శ్రీహరివేడ్కన మ్రాహ్మణుండనై
పట్టము గట్టి నేర్తుగ పాలన నీతులబోధ సేసితిన్.

అహా! ప్రపంచమంతయు పాపభూయిష్ఠమై యున్నది. ఒక్కయూ[illegible]నాద్రికై యెంతమంది మృతినొందిరో దీనినిబట్టి తెలియుచున్నది. జనులందఱును గూడ మిగుల మిథ్యామార్గముగఁ జరించుచున్నవారు.

సీ. సప్తవ్యసనములఁ జంకకఁజేయుచు
దైవవిహీనులై తిరుగుచుండ్రి
విద్య శిల్పకళాభివృద్ధి యుడంగెను
ప్రాంచకజ్ఞాన పరులులేరు
ఆత్మాభివృద్ధియు యశముఁగాంగుట సున్న
పౌరుషంబేలేక పరుగుచుండ్రు
ఉపకారము బ్రాహ్మణోత్తములకు బూజ
సేయుక గర్వంబ చెలగుచుండ్రు

గీ. దేశమంతయుఁ బాపంబుతో తేజరిల్ల
మిగుల నవనాగరికతలు మించుచుండె

కడకు భా... స ... ... ష్టమయ్యె
చివరకాత్మ ... ... జేసికొంద్రు.

ఆహా! నాయందుండు భయంబుచేతను ప్రేమాతిశయంబు చేత నేగదా వీరిట్లు మడిసియుండుట నాకు మొదట సత్యము దెల్పిన నింత వరకు గానిచ్చుదానవా? ఏమి చింతించిన నేమిఫలము.

ఉ. నాలుకశాలలో నటుండు నాట్యముచేయును సంతసంబునన్
పాటలుపాడి లోకి చవుభాతి జనంబులు పుట్టి పెర్గి యీ
బూటకమైనమాయ జగమున్ దమశాశ్వత భూమియంచు నే
యాటలనాడు; దేహమునకంతయు కట్టెమ నేళ నేర్పునీ
పాటికిశరీర కట్టెలకు పాలౌట కేర్పుటకేమిలాభమో!

కావున నేనిప్పుడు కాననంబున కేగి సన్యసించెద. తనువులు శాశ్వతము కావనియు పురాకృత ... ఫలంబు ని ...రును తప్పింపజాల రనియు దృఢనిశ్చయము కల్గిన మ... ...నయందు త్రికరణ శుద్ధిగా జీవించుదాన అందువలన స్వర్గ ప్రాప్తి ... లుగు ... నేనింతకాలము నుం డియు రాణిగానుండి చేసినదేమి.

ఉ. వానలులేవు పాడి ... పంటలులేవు ధనంబుకల్గుచో
దానములేదు స... ... ధర్మపువర్తన బాసిపోయె నే
హీనకులంబు వా... ...ంచెన చేతను బ్రాహ్మణోత్తమున్
మానము... ...; పోయెదవన్యభూమి కిన్

ఇంకను ... ...చేశం ... ...బు చున్నది. నా తలిదండ్రుల నాఁడు భరత రాజ్య... ...ట్లు విరాజిల్లుచుండె ను.

సీ. పాడిపంటకు నిధి భాగ్య లక్ష్మికినిల్లు
పండితభూమి యీ భరతభూమి
పౌరుషంబున కాటపట్టయి జగమేలె
శూరులమాత యీ భరతమాత
సంగీతసాహిత్య జన్మభూమిద్దియే
పరగ కవీంద్రుల భరతభూమి

శిల్పకళాదులు శ్రీచేఁ బుట్టిల్లు
బహు భక్తులుగలదీ భరతమాత

గీ. కరువులననేమి యెరుఁగనీ భరతభూమి
అహహా! ఇటునుండు వేల్పులు నప్సరసలు
సౌఖ్యసంపదలకిదిరో జన్మభూమి
భారతీయుల కిదియా భరతభూమి.

ఇఁక నేనేగవలెను. నేనుండిన కొలఁది వారికి భ్రమలు కల్గుచున్నవి. నాకాత్మాభివృద్ధి కల్గుచున్నది. ఇఁక నేగెదను. భగవంతుఁడు నాకాజ్ఞ నొసఁగెను. అహా! సుజనులారా! స్త్రీలనాశ్రయించి సకల యిడుములను బొందకుందురుగాక. సంసార సాగరమీఁదుటకై ప్రాణము లర్పింపకుందురుగాక!

సీ. సంసారమేకదా సర్వసుఖమునిచ్చు
నని భ్రమియింపకు డార్యులార!
జవ్వనమేకదా సౌఖ్యమిచ్చు నటంచు
విపరీతి మేలకో వెఱ్ఱిలార!
కాలకాంతికై పోయి కులకాంత విడువక
తెలిపితో నుండుఁడు తమ్ములార!
దేహంబు భోగముల్ తామరాకులలోని
జలబిందువుఁ బోలు సరసులార!

గీ. జలదములలోని మెరపుల చాయరీతి
పుట్టుచుందురు క్రమ్మఱ గిట్టుచుండ్రు
సుఖము దుఃఖంబుల న్మాచుచుంటకంటె
యంధకారంబు వీడుమా యార్యులార!

నేనిదే కడసారిమాటఁ దెల్పెదను సర్వసుఖ దుఃఖంబులను స్త్రీలే యిచ్చును. కాని యంగనల నమ్మరాదు. ఇది మనుష్యులకి

నమ్మితిమి. గౌతమ [illegible] ది. కనుక తెల్పుము టిని. నే నిదే పోయివచ్చెద. ఇకనైన [illegible] మంతయు సుఖంబుగా నుండుగాక.

సీ. ఈతిబాధలు లేక జాతిభేదము లేక
  పరగుచుందురు గాక మాన్యులార!
అన్యోన్యవైరము లంతరించునుగాక
  విద్య పెరుగుగాక పెద్దలార!
నీతిపాలనమున నెగడును రాజులు
  సౌఖ్యమిచ్చును గాక సభ్యులార!
పరకాంతలను విడి పాపంబువిడనాడి
  పరగుచుందురు గాక పలువలార!
గీ. ధరణియంతయు సస్యంబుతో దనరుగాత
  క్షితి శోభనాభివృద్ధి కలుగుగాత
  వేయివర్షము [illegible] గాత
  సిరియు సంపద జనుల శోభింతుగాత!

శ్రీ శ్రీ శ్రీ.

సంపూర్ణము.



# తప్పొప్పుల పట్టిక.

—:0:—

| పేజీనెం. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 4 | 2 | పోరు | తరిగె |
| 5 | 14 | వారి | వాని |
| 6 | 25 | కావరయ్యో | భువనమందు |
| 10 | 7 | యుండజేసి | యుండజేరి |
| 11 | 2 | వలచిన | బలచిన |
| 12 | 6 | తనివో | కూల్చిమిదె |
| 13 | 27 | భేదము | ఛేదము |
| 19 | 18 | నిలువుమిత్రుడు | బంగుమిత్రుడు |
| 22 | 9 | చేరగలవా | చేరగలెం |
| ,, | 18 | సత్సంప్రసేవితుని | సత్సంప్రసేవింతుని |
| ,, | 22 | విని | వాని |
| 25 | 6 | నీబాధమండితడు మాడు | నీబాధమండితగాదు |
| 30 | 18 | గొట్టి | గొట్టె |
| 47 | 21 | నాహాస్త్రిరక్షణ | నీహాస్త్రిరక్షణ |
| 49 | 11 | కల్లలాడినటంచు | కల్లలాడితటంచు |
| 50 | 6 | శిరమును నెత్తె | శిరమును పైకెత్తె |
| ,, | 7 | జంతువుల | జంతువులు |
| 55 | 5 | శేక | శేఖ |
| ,, | 6 | సాహాయ్యమొప్పచేయుచున్నా | సాహాయ్యముచ్చవిక్రమునిచేయుచున్నాము |
| 56 | 16 | టూరి | టూరీ |
| 57 | 9 | మీరునాకుతండ్రి | నాకుమీరుతండ్రి |
| 58 | 12 | కల్గియుంటి | కలిగియుంటి |
| 59 | 7 | వణిక | వణక |
| ,, | 8 | ఎరువుకయి | కూటికయి |
| ,, | 17 | పోనము | పోసము |
| 60 | 3 | శేర్చి | జేర్చు |
| ,, | 23 | దుఃంబు | దుఃఖంబు |
| 61 | 22 | శోభన | హేళన |
| 62 | 9 | విమ్మతి | సమ్మతి |
| ,, | 17 | విన్నటి | నిన్నటి |
| ,, | 21 | ఉదయమునకు నవోక్క | ఉదయమునపరాతి నవోక్క |

